గోవింద రామాయణము

# రక్షక రాముడు

## - అరణ్య కాండము -

★



కృతికర్త

...ా ప్రపూర్ణ"

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్య

# గోవింద రామాయణము

# గద్గద రాముడు

## అరణ్యకాండము

కృతికర్త

"కళా ప్రపూర్ణ"

**శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్య**

ప్రకాశకుడు

**శ్రీ ఆత్మకూరి గాంధీ** M.A.,
1-8-76 ప్రెండరుగాస్టు రోడ్డు,
35 జవహరునగరు
సికిందరాబాదు - 500 003.

Govinda Ramayanamu,
RAKSHAKA RAMUDU,
Aranya Kandamu,

*AUTHOR :*
"KALAPRAPOORNA"
SRIMAN ATMAKURI GOVINDACHARYA

Second Edition 1983
Copies — 1000



*Publisher :*
Sri Atmakuri Gandhi M.A.,

**Price Rs. 20/-**

This book is Published with the financial aid granted by the
TIRUMALA TIRUPATI DEVASTANAMS
Tirupathi under their scheme of publshing religious books.

Printed at :
VIKAS PRESS, 7-1-332 & 333,
Balkampet, S. R, Nagar (P. O.),
HYDERABAD-500 038. P. P. : 260283

# విన్నపము

కీర్తిశేషులు "కళాప్రపూర్ణ"—శ్రీమాన్ ఆక్మకూరి గోవిందాచార్యులు గారు గాంధీ యుగంలో స్వాతంత్ర్యసమరంలో క్రీ.శ. 1921 నుండి 1947 వరకు అయిదుసారులు కారాగృహశిక్ష అనుభవించిన దేశభక్తుడు. సంపన్న కుటుంబంలో జన్మించి తన సర్వస్వం స్వాతంత్ర్య సముపార్జనకై ధారవోసిన త్యాగయోగిగా సుగృహీత నామధేయుడైన స్వాతంత్ర్యయోధుడు. సమకాలీన సమాజం ఆయనకు బహూకరించిన పౌరుషనామధేయం—''అర్థశాస్త్రప్రవీణ—ఆంగ్లోపాచార్య'', ఆయన గాంధీ చరిత్ర వ్రాసి, గాంధేయ జీవితం అలవరచుకొని ''కొల్లాయి'' గట్టినట్టివాడు. ఆయన వ్రాసిన బృహద్గ్రంథం....రెండువేల పుటలు దాటినట్టిది. "భారతదేశము-ఆర్థిక చరిత్ర'' అలనాటి విద్వాంసుల మన్ననలకు పాత్రమైనది. అట్టి మరియొక బృహత్గ్రంథము-''భారతదేశ రాజ్యాంగ చరిత్ర''.

శ్రీమాన్ గోవిందాచార్యులుగారి జన్మస్థలం పశ్చిమ గోదావరి—అగ్రహార గోపవరం, పిప్పర. వీరి సంపాదకత్వంలో వెలువడిన "సత్యాగ్రహి'' పత్రికను అలనాటి బ్రిటిషు దొరతనంవారు నిషేధించి, ''సత్యాగ్రహి ముద్రణాలయము''ను దురాక్రమణ సలిపి వేలం వేశారు. ఇదుపరి వారికి నష్టపరిహారం లభించలేదు.

పశ్చిమ గోదావరిలో చారిత్రాత్మకమైన—'ఉప్పు సత్యాగ్రహ దండయాత్ర"కు శ్రీమాన్ ఆక్మకూరి గోవిందాచార్యులుగారు ఒక బృందమునకు—శ్రీ దండు నారాయణరాజుగారు ఒక బృందమునకు నాయకత్వం వహించారు. శ్రీ గోవిందాచార్యులుగారు అవిభక్త మద్రాసు రాష్ట్రములో 1940 నుండి 1947 వరకు ప్రజాప్రతినిధియైన శాసనసభ్యునిగా ఉన్నారు.

శ్రీ ఆచార్యులుగారు స్వాతంత్ర్యోద్యమం పిమ్మట రాజకీయముల నుండి విరమించి రామాయణ రచనకు తన కాలం వెచ్చించినారు. మొట్టమొదట ఉత్తర రామాయణం వ్రాసి పిమ్మట షట్కాండలు రచించి ప్రచురించినారు.

సంస్కృతంలో వాల్మీకి రామాయణం సకారత్రయమునకు; సారళ్య-సౌందర్య-సౌకుమార్యములకు సుప్రసిద్ధము, తెలుగులో సాహితీసిద్ధహస్తులైన ప్రౌఢ విద్వత్ కవులు పలువురు రామాయణమును వ్రాశారు. తేట తెలుగు నుడికారపు వంపుసొంపులతో సులభశైలిలో వ్రాయబడిన గోవిందరామాయణంలో

వాల్మీకి రామాయణంలోని నకారత్రయము....సారళ్య సౌందర్య సౌకుమార్యాలు తోణికసలాడటం పేర్కొన దగిన ప్రత్యేకత.

శ్రీ వైష్ణవ వేదాంతులు రామాయణమును దీర్ఘశరణాగతిగ అభివర్ణిస్తారు. గోవిందరామాయణ కర్తకు శ్రీ వైష్ణవ వేదాంతం వెన్నతో అలవడిన విద్య. అంతేగాక, వ్యక్తిగతముగ ఈ కవి ప్రపన్నుడు. ఇందలి అశ్వాసాంత పద్యాలు "శీఘ్రశరణాగతి" అని సమీక్షించవచ్చు.

అంతేగాక — శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు వ్రాసినట్లు, "తెలుగు గోవిందరామాయణం చదువుతే — ఇక సంస్కృత రామాయణంపై వ్రాయబడిన ఏవ్యాఖ్యానాలు పఠింప నవసరంలేదు."

ప్రత్యేక కృతజ్ఞతలు :

గోవిందరామాయణం — షట్కాండలు — సుమారు పదివేల పద్యాలు ఈనాడు ప్రచురించటం మిక్కిలి వ్యయ ప్రయాసలతో కూడిన పని. తిరుమల తిరుపతి దేవస్థానాల వారి ఆర్థిక సాహాయ్యంతో ఈ బృహత్తర కర్తవ్యం నెర వేర్చబడుచున్నది. వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు. చరిత్రాత్మకమై విశ్వజనీన మైన యీ విశిష్ట ప్రణాళికను నిర్వహించుచున్న దేవస్థానపు అధికార వర్గమునకు —సప్తగిరి సంపాదకుడు, ఏతత్ప్రణాళికాసూత్రధారి శ్రీ సుబ్బారావుగారికి హార్దిక ధన్యవాదాలు.

గోవిందరామాయణము—షట్కాండలు అద్యతన భవిష్యత్తులో ఆంధ్ర సహృదయులకు సమర్పింప మా సంకల్పము. అందుచే షట్కాండములు— ఒకేసారి కొను సహృదయులైన వ్యక్తులకు సగము వేలకే పోస్టు ఖర్చులు మే మే భరించుకొని ఏడు సంపుటములు అందించగలము. వ్యవస్థలకు ఈ సౌకర్యము వర్తింపదని మనవి.

—ఆత్మకూరి గాంధీ

1-8-76, ప్రెండరుగాస్టు రోడ్డు,

35 జవహర్ నగరు,

సికింద్రాబాదు—500 003.

# PREFACE

*By*

**Sri Boorgula Ramakrishna Rao Garu, M. P.**
(Ex-Governor, Kerala and Uttara Pradesh)

I am grateful to Shri Atmakuri Govindacharyulu Guru, for having done me the honour of asking me to write a preface to his Telugu Kavya "Govinda Ramayanamu". He is one of the stalwarts of freedom fighters who worked in close association with leaders like the late Pattabhi Sitharamayya, the late Andhra Kesari Prakasham Pantulu of Andhra Pradesh. He had the benefit of close association also with Bapuji and all other Indian leaders and courted imprisonment several times. After independence, however, he has more or less devoted himself to the pursuit of literary activities for which he had a flair even from his boyhood. His up-bringing in a family which was famous for its learning and culture and his adherence to the principles of Shri Vaishnava sect of Shri Ramanuja, naturally nurtured in him deep feelings of devotion to God and a philosophy of renunciation at the feet of the Almighty.

The treatment of the story of Ramayana by this author differs from many others, in the main religious outlook which characterises the work. While Shri Rama, is depicted as a man-God or a God-man, he always forgets his Divinity. He has to be reminded of it, so also his mother Kausalya, his brothers Lakshmana and Bharata, and above all his divine consort, Seeta. All of them forget that Shri Rama is Divine, They pour out their natural human love on him and have to be reminded, whenever occasion demands that Shri Rama is not only a son, a brother, and a husband to them, respectively, but is God incarnate himself and that he has a purpose behind this human life. When they are reminded of this fact they all become devotees and forget their personal relation ships. They fall at his feet and pray to him as to God. They place themselves at his feet in complete renuncsation, and become "Prapannas" i. e. those who have adopted "Prapatti". This is the main difference in outlook which characterises the work of the present author. He follows the style of the famous Bhakta poet Pothana in many places. His work is not a translation nor does he closely follow the narrative of Valmiki.

All over there are beautiful stanzas, expressing sentiments of sincere and heartfelt devotion towards Rama, couched in sweet language, containing many appropriate examples of Telugu idioms. The style is flowing and natural and nowhere, has any attempt been made to embellish artificially, the language, at the cost of simplicity and naturalness, I commend this work to Telugu readers.

Barkatpura,<br>Hyderabad.<br>15-6-1963.

*B. Ramakrishna Rao.*

## ప్రత్యేక ప్రకటన

### భక్తులైన వ్యక్తులకు సగము వెలకే

# గోవింద రామాయణము

షట్కాండములు 7 సంపుటములు తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సాహాయముచే అచ్చు కాబడుచున్నవి. లాభముగాని నష్టముగాని లేని పద్ధతిలో భక్తులకు రామాయణము అమ్మబడును. పోష్టు ఖర్చులు ప్రచురణ కర్తలే భరించగలరు.

| | | |
|---|---|---|
| 1 | సీతారామమ్– బాల కాండము | 15-00 |
| 2 | పాదుకాపట్టాభిషేకము (అయోధ్య) | 25-00 |
| 3 | రక్షకరాముడు– అరణ్యకాండము | 20-00 |
| 4 | ధార్మికరాముడు – కిష్కింధకాండ | 15 00 |
| 5 | సుందరరాముడు – సుందరకాండ | 20-00 |
| 6 | పట్టాభిరాముడు – యుద్ధకాండ (ప్రథమభాగము) | 20-00 |
| 7 | పట్టాభిరాముడు (ద్వితీయభాగము) | 15-00 |
| | పూర్తి సెట్టు వెల | 130-00 |

ముందుగ మనియార్డరు చేయువారికి 3 సంపుటములు రూ. 65/– లకే పోస్టు ద్వారా పంపగలము. భక్తులు – సహృదయులైన వ్యక్తులు ఈ సదవకాశము వినియోగించుకొందురుగాక. ఉత్తర ప్రత్యుత్తరములకు

**ఆత్మకూరి గాంధి**

1-8-76 ప్రెండరుగాస్టు రోడ్డు, 35 జవాహరునగరు

సికింధరాబాదు-500 003.

# అంకితము

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్రదేవతాయై నమః

శా. శ్రీ రంగంబయి భక్తసంతతుల సంసేవ్యంబునై గౌతమీ
తీరంబై విలసిల్లు భద్రగిరిపై ధ్యేయుండవై యున్న సీ
తారామా! కృతి నుంతు నీదు పదపద్మంబందు గైకొమ్ము లో
కారాధ్యంబగు నీ కథాసుధను భద్రాద్రీశ! శ్రీ రాఘవా!

ఉ. దేవ చతుర్ధకావ్య మిది దీనిసుధామయనిచ్చుచుంటి వి
శ్వావసువత్సరంబున శుభప్రదజన్మదినంబు కాన్క, 'గో
మ్మి వరచైత్రశుద్ధ నవమీ శనివారమునందు, సత్కృపన్
నీవె గ్రహించి దీని కరుణింపుము భద్రగిరీశ రాఘవా!

# విషయసూచిక



సంపూర్ణము

# శ్రీ గోవింద రామాయణము

## అరణ్యకాండం

### ఇష్టదేవతా ప్రార్థనము

శ్రీనిధియై యనాది చిదచిన్మయదివ్యశుభంకరాంబయై
భానుసహస్రమండల విభాప్రతిభాసితమూర్తి గల్గియున్
జానగుమోమునన్ మధుర శాంత మృదూక్తులఁబల్కు బాల నా
మానసమందు నిల్చి యభిమానముతో సుకవిత్వ మిచ్చుతన్. 1

శ్రీ, వాణీ, గిరిజా, త్రిమూర్తులును, సంసేవింతు రే దేవి, నా
దేవిన్ మంజులవాక్సుధానిధిని బ్రీతిం గొల్చి యర్థింతు, నా
యీ వాగ్ధామము సేరి, సత్కవిత వ్రాయింపన్, సుధామాధురీ
భావౌచిత్యరసప్లుతప్రథితకావ్యం బిద్ధియై యొప్పగన్. 2

త్రిపురసుందరి నీ పాదతీర్థమందె అక్షరాభ్యాసముం జేసి యఖిలవిద్య
నభ్యసించితి నావిద్యయంత నీవె, గురుఁడ వాచార్యుఁడవు నీవె కూర్మిగనుము.

భక్తిరసఝరీదివ్యప్రవాహగతిని దెనుఁగు నుడికారపుదీపి తేలియాడ
దేటతెల్లంపుఁ బలుకులఁదీర్చిదిద్ది యీ యరణ్యకాండము వ్రాయఁ జేయుమమ్మ.

వలదు కఠినభాష, పాషాణపాకంబు, రాళ్ళ రప్పలఁజను రాచవారు
పాదయుగళిఁబొందు పాషాణబాధనే కర్ణయుగముగూడఁ గాంచనేల ! 5

మున్నేరీతిగ మధుర, రసోన్నతిఁ బెంపార శైలియొప్పెనో, యటులే
యెన్నెద ద్రాక్షాపాకం బన్నియెడల. దీనఁగూడ నంబా ! యిదుమీ ! 6

ఎచ్చటనే రస మొప్పునో అచ్చట నా రసము వ్రాయుమమ్మా, విబుధుల్
హెచ్చుగ మెచ్చగ. రసఝరి, యచ్చపు స్ఫటికంబురీతి నలరెడిభంగిన్. 7

రాఘవుని కష్టకాల మరణ్యగాథ ధర్మపత్నివియోగార్తి దగులుగాథ
శాత్రవులఁజంపు భీకరాశాంతిగాథ కలతఁజెందక వ్రాయఁగాఁగలనె తల్లి. 8

చలితశనియె చేరె జన్మాష్టమపురాశి నెట్టికీడునన్నుఁ జుట్టుకొనునొ !
కావ్యభర్త పొందు కష్టపరంపరఁ గావ్యకర్త గూడఁ గాంచునొక్కొ. 9

అయితేనేమి ? యరణ్యకాండము భరన్యా ప్రదీప్తంబు గా
దె ? యిలాజాతయు, నన్మునీంద్రులుఁ బ్రపత్తిన్ సర్వకర్మానుభూ
తియు సర్వేశ్వరదత్తమే యనుచు శాంతిం బొంది, సిద్ధార్థులై
ద్వయమంత్రంబు పఠించి ముక్తిఁ గనరే భక్తిప్రధానంబుగా. 10

శనిగాఁ దష్టమరాశిలో మెలఁగినన్ శారీరసౌఖ్యంబుఁద
గ్గినఁ గష్టంబు లవేవి ప్రాప్తమయినం గీర్తించుచున్ రాము, ప్రా
తుమ సద్గాధను, వాని నీహృదయమందున్ నిల్పి నిత్యంబు, రా
మునికే దెవ్వరు భక్తసంతతులబాముల్ బాపఁగా నక్కృపన్. 11

కానీ! కాననదివ్యగాథరచనం గానున్న దేమైనసున్
లేనిపోని కళంకలం దగిలి దుష్కీర్తిన్ విసర్జింతు నే
మానాథున్ వనిలో; నయోధ్య కతనిన్ మళ్ళింపఁగా రాజుగా
దీవిం బూర్తిగ వ్రాయ రాఘవుఁ డహో దీపింపఁడే భక్తునిన్. 12

నీ నమాధివి విరతంబు విశ్చలముగ మనసికశక్తిఁ బ్రసాదించి మనుపుచుండి
వ్రాయఁ గృపఁ జూపు మింక నరణ్యగాథరాఘవా? భూమిజానాథ? రామచంద్ర·

కర్తవును గర్మయును నీవె కావ్యమునకు
బొనఁగు పొసగిన నీయదే దోష మగును
కలము పట్టుట యొండెనా కార్యవిరతి
ఘరపుఁడను సుమ్మ రామయ్య! భక్త భక్త! 14

నిధినిక్షేపము లిమ్మనన్ మఱియు దేవిం గోర, నీపాద, స
న్నిధి నిర్విఘ్నసమాధిలోఁ బరమశాంతిం గాంచగాఁ జేసి, త్వ
త్కథ వ్రాయఁగల ప్రజ్ఞమాత్రమిమ్మా. మీ కావ్యంబు, ధర్మార్థ సు
ప్రథితంబై మృదుశబ్దభావరససంపత్శోభితమై రాజిలన్. 15

సకలకళావిశారదులు సత్కవిశేఖరరాజు కావ్యముల్
రకరకముల్ రచించి దివి రాజిలుచున్ మృతజీవులైరి, త
త్సుకవుల, సంస్కృతాంధ్రక భాషల నాత్మ దలంచి, మ్రొక్కి వా
ల్మీకిని కృపార్ద్రదృష్టి గనుమీ యని వేడెదఁ గావ్యసిద్ధికిన్. 16

పామరులుగూడ నీదు భావంబు తెలిఁగి
రామ నామామృతముఁ గ్రోలి రహిఁ జెలంగ

నీ మహాకావ్యనిర్మాణ నియతినొప్పు
వ్యంగ్య భావార్థములఁ జెప్పి వ్రాయుశక్తి
ఆది కవిరాజ! యిమ్ము లోకార్థ మెంచి. 17

శ్రీదేవి చెలిమిపై చెంత నుండఁగ
జేదోడు సౌమిత్రి చెలఁగ వెన్వెంట 18

మంగళ మగుఁగాత మానాథ నీకు
మంగళం బగుఁగాత మా భక్తతతికి 19

# శ్రీ గోవింద రామాయణము

# రక్షకరాముఁడు

## 1. వాత్సల్యాశ్వాసము

మానవ దేహిగ భీకర కాననమున కేగుదెంచు కారణ మేదో
దానిం గొనసాగింపఁగ బూనిన రఘువీర! ధర్మ మూనిన రామా! 1

### కాకాసుర శరణాగతి

శ్రీరాముం, డనుజన్మసంయుతుఁడు శ్రీసీతాసమేతుండు ని
త్యారాధ్యుండయి మౌనిసంతతులచే నానందమగ్నుండుగా
వీరుండై వనిఁ జిత్రకూటగిరిపై వేంచేసియుండంగ దు
ర్వారోద్రిక్తసురారులుం దిరుగ నారంభించి రాప్రాంతమున్. 2

రాఘవుని శక్తి వీర్యంబు రాక్షసాళి తెలిసికొనఁ జిత్రకూటాద్రిఁ దిరుగుచుండెఁ
దిరుగుటయెకాక మునులకుఁ దీరనట్టి బాము లొదవించుచుండెను బవలురేలు. 3

కొండొకనాడు రాఘవుఁడు కూర్మిని జానకియంకసీమయే
దుండుగ నిద్రఁ జెందుతఱి దీనిని రాక్షసుఁ డొండు గాంచి యు
ద్దండగతిన్ దటాలుమని ధాత్రిజపాదములంటి కాకిగాఁ
బుండుగ ముక్కుతోఁ బొడిచె బొట్టనవ్రేలి సీత నొవ్వగన్. 4

బాధపడలేని సీతమ్మపాద మంతఁ గదల మొదలిడె నంకముం గదలసాగ
రాఘవుఁడు నిద్రఁ జెడి, లేచి రామఁ గాంచి కాలిపుండును బరికించి కాకిని గని

అది కాకాసురమాయ యం చెఱిఁగి స్వీయాస్త్రప్రభావం బదె
య్యేదియో తక్కసిమూకకుం దెలియునట్లేసె న్నిషేకాస్త్ర మ
య్యది కాకాసురు నంటఁగా నతఁడు హాహాకారమున్ సల్పుచుం
డి దిశాంతంబులఁ బాఱిపాఱి కనలేఁ డెందెందునన్ రక్షకున్. 6

అఖిలలోకంబులందున నతని కేరు రక్షనీయఁగఁ జాలమి రాత్రిపవలు
ప్రాణభయమున గిరగిరఁ బాఱిపాఱి తిరుగుచుండుంగ నారదుం డరసి వాని. 7

రామబాణం బమోఘంబు రాఘవుండె
దాని నుపసంహరింపంగఁ దగినవాఁడు

పోయి సీతమ్మపాదాలపుందు బడుమ
యామె కృపఁజూపి విను(బ్రోచునేమొ ! కాకి ! 8

అనెడి నారదు నుపదేశ మాలకించి పూర్వజన్మసంస్కృతిఁ బొంది పొందునంత
రామబాణతాడితుఁడైన రాక్షసుండు పరుపులిడి యేగిపడె సీతపాదయుగళి. 9

సీతముందుఁ బడుచు సీతాపతినిఁ జూచు కావు మనుచు నేడ్చుఁ గరుణ పుట్టఁ
జూచి చూచి రాముసుందరపాదాల (వ్రాలి శరణుచొచ్చు వాయసంబు. 10

ఆమె లోకైకనతతదయార్ద్రహృదయ యతులవాత్సల్యమూర్తి సీతమ్మతల్లి
యనుపమావ్యాజకృపఁ గను నామె యెట్లు పదసమాశ్రితకాకార్తిఁ బాపకుండు !

'అన్యథా శరణం నాస్తి'యం చనుచుఁ 'త్వ
మేవ శరణం మమ' యటంచు నిలయు వింగి
యేకపగునట్లు కావించు కాకి ఘోష
వినుచుఁ గని యూరకుండునే విశ్వజనని ? 12

శరణాగతత్రాణపరుఁడు రాముండు
పరమకృపామూర్తి పద్మాక్షి సీత 13

కన వినఁ గాకార్తిఁ గరుఁగదే మనసు !
జనకజారాములు గనరొకో కృపను ! 14

కాకా యంచును గ్రిందుమీ దెగయుచుం గాకంబు కన్నీటితో
లోకత్రాణపరాత్మ పాదిముల వ్రాలున్ లేచి యంతంత సీ
తాకంజాక్షిపదంబులం బడును సంతాపంబు మిన్ముట్టఁగా
లోకారాధ్యకృపామయాత్మహృది కల్లోలంబుఁగా నంతటన్. 15

తన యంగుష్ఠముఁ బుండుగాఁ బొడిచి బాధం గూర్చినన్ వాయసం
బును వాత్సల్య మయాత్మయై కనుచు రాముం జూచి కాకంబు ర
క్షణ సేయందగు నంచు జాలిఁ దెలిపెన్ క్ష్మాజాతనేత్రాబ్జనం
జనితార్ద్ర మలహావభావముల కన్సన్నల్ ప్రదీప్తంబుగా. 16

రాఘవుఁడు రామచంద్రుండు రామఁ గాంచి
కాంచు నార్తస్వనమునఁ గావుమంచుఁ
బై కెగరుచుండి క్రిందకుఁ బాఱుచుండి
కాళ్లపైఁ బడుచుండిన కాకదైత్యు. 17

తానె శరణార్థి రక్షణవక్షుఁ డగుటఁ బ్రేయసియు నట్లె కోరుట వీడఁదలఁచెఁ
గాకిని క్షమించి యతడు లోకాధినేత యెంచ భార్యానువర్తి కాఁ డిల నెవండు?
రామబాణం బమోఘంబు రాఘవుండు వీడ డెప్పుడు వీడుచో వీడ దెవ్వ
డెవ్వనిని గాని యది బలి నింబుకేని గైకొనక కంటిబలినిచ్చెఁ గాకి కూడ. 19

జయంతుఁడు-శాపవిమోచనము

కాకి నాడు మొదలుగ నేకాక్షి యయ్యెఁ
గాకవేషి రాక్షసుఁడంతఁ గాకిరూపు
విడచి నిజరూపమున రాము వీరవరుని
పాదముల నంటి శాపమ్ముఁ బాయఁబలికె. 20

రామ! పరాత్పరా! సకలరక్షక! శాపవశుండ నేను సు
త్రాముఁడు యాజ్ఞవల్క్యమునితాపసిఁ గాంచి భయంబుఁ జెంది న
న్నామునియోగమున్ జెఱుపునంపుట నే నటు సేయఁబూనుటన్
భూమిని నాసురాకృతినిఁ బొందు మటంచు శపించె మౌనియున్. 21

అట్టిశాపగతికి నార్తుండనై నేను మౌనిపాదయుగళిఁ బూని యేడ్వ
సరళహృదయుఁ డౌట శాపవిమోచన కనెడి మార్గ మంత ముని వచించె. 22

మునిశాపంబున రాక్షసుండ నయితిన్ బూర్వస్మృతిన్ వీడి యీ
వనసంచారము సేయుచున్ ఖరుఁడు పంపన్ నీదు లావెంతయో
గనఁగా మౌనుల నేచుచుం దుదకు నీ కాంతామణిం గాకవృ
త్తిని బాధించి తరించినాడఁ గొను మంతేవాసెదాసోఽహముల్. 23

రాముఁడు సర్వలోకనుతరాఘవుఁ డిట్లు సతీసమేతుఁడై
యీ మునిబృందముం గలిసి యిచ్చట నుండెడివేళ జానకీ
రామను గూడ నేచుకతఁ రామునితూపునఁ దాడితుండనై
నామునురూపుఁ బొంద ముని నాకు వరంబొసఁగెం గృపామయా ! 24

అనుచు జయంతుఁ డా వనినుండి వెడలె
జనకజారాములు సత్కృపం గనుచు. 25

సురలోకనాధుని సూనుండు వలుక
ఖరుని దుష్కృతి వినె క్ష్మాపుత్రివిభుఁడు. 26

ఖరుఁడను రాక్షసుండు తనకాంతకు బాధ జనింప మూలపై
బరఁగె నటంచుఁ దద్వననివాసము సేయుచున్నవాఁ డటం
చరసె రఘూద్వహుండు మును లా గిరి నుండినవారుఁ గూడ న
ప్పరిసరమందుఁ గూడిరి విషణ్ణముఖంబుల రాముఁ జూచుచున్. 27

రాముభార్య బాధించె రాక్షసుండు ఖరుఁడు పంపించెఁగా మాయకాకి నింక
మనకుఁజిత్రకూటాద్రిపై మసఁగనౌనె మున్నుకంచెను బాములఁబొందనగును.

అని మునులు తమలోనఁ దా మాడుకొనుచుఁ
బైకిఁ జెప్పంగనేరమిఁ బాదుకొనిన
భీతి హావభావములలో వెడలఁగ్రక్కు
చుండి కనుబొమల్ ముడివైచు చుండి రపుడు. 29

## ఖరుని వృత్తాంతము

సకలుఁడు రాముఁ డా గుసగుసల్ కడు సల్పెడు మౌనులం గనున్
వికలమనంబులం దెలుపు వీరల చూపులఁ గాంచి యెంచఁ జా
లక తగు హేతువున్ మునికులప్రముఖుం గని తెల్పుడీ ముని
ప్రకరముఖంబు లిట్లు కడు బాధను దెల్పెడి కారణం బనెన్. 30

ఏ మెవరమైన నెపుడైన నే యపకృతిఁ జేసియుంటిమ? మముఁ గని చెప్పలేక
మీరే మీకయి సంజ్ఞల బారిఁ బడితి రనియె రాఘవుండు మునికులాధిపతికి. 31

మునిజనకులపతి జననాథుఁ గాంచి
విషయానఁ గష్టాలు వివరింపఁ గడఁగె. 32

ఖరుఁడను రాక్షసుండు పలుగాకి చరించుచు రావణాజ్ఞ నీ
పరిసరమందు మా తపసుఁ బాడొనరించెడి నగ్నిహోత్రముల్
దెలుపుచు నింక మే మిచటఁ జేర్పడుచున్ వసియింపలేక వే
పరువున వేఱు తావునకుఁ బోవఁదలంచితిమో రఘూత్తమా ! 33

ఆ జనస్థానమౌనుల నదలఁగొట్టి
వెడలఁగొట్టియు ఖరుఁడు తృప్తినిఁ గనండు
వినుము మాపైనఁ దనకన్ను వేసినాఁడు
రామ ! మీ పైకి గసిఁబూని రాఁగలండు. 34

ఖరుఁడను రావణానుజుఁడు కాననమందు వసించువాఁడు దు
ష్కరుఁడయి మౌనులన్ సతము సర్వవిధంబుల నేచువాఁడు నీ
తరుణిని జానకీసతిని ధర్మయుతుండగు భర్త చెంతనే
యరమర వీడి గాసిలఁగనౌనటుఁ జేసెనుగాదె యిప్పుడే. 35

మీరొకొ యెగ్గు సల్పుదురె మీపురరాదున నేరుఁగాని మా
కేరికిఁగాని యెప్పుడును నే యపచారము సేయలేదు మీ
వారము గామె మేము మునివారము నెల్లెడఁ బ్రేమమూర్తులై
గారవమొప్పఁజూచెదరుగా రఘురామ ! నృపాలసత్తమా ! 36

కాని రఘూద్వహుం డిటనుఁ గాంతను గూడి చరించుచుంటచేఁ
గానన చిత్రకూటగిరిఁ గాకులమూకలు గాగ రాక్షసుల్
పూనికతోడ ద్రిమ్మరి మముం గడు నేచుచు నున్నవారు మా
మౌనికులంబు నీకుఁ గడు మాన్యమటంచని లోఁ దలంచుమున్. 37

లంకారాజ్యవిభుండు రావణుఁడు నీలావుం బరీక్షింప నీ
శ్శంకన్ రాక్షసవారమున్ మునులపై సారించె నీవారికిన్
జంకుం గొంకును లేక కష్టతతులన్ సాగించి నీ చేవ నీ
సంకల్పంబును దా నెఱుంగఁదలఁచెన్ క్ష్మానాథ ! రామప్రభూ ! 38

లోకముఁ దాఁ జయించు మది లోకమునం గల రాజరాజులం
దాకి త్వదీయవంశనరనాథులపై నలుపంగ దాడి యి
క్ష్వాకు మహాన్వయోద్భవనృపాలురచేతఁ బరాజితుండుఁగా
నా కసి లోనఁ బెట్టుకొని యా కులజన్మునిఁ దాక నెంచెడిన్. 39

నీనిమిత్తమై మాత్రమే మౌను లిచట
వెతల నొందుచున్నారు వీర రామ !
యదియె తమకోన మునులు దా మాడుమాట
దాన నెటకైనఁ దరలఁగా దలఁచువారు. 40

వీరుఁడవయ్యు నీ చెవినిఁ బెట్టుము మా నుడిఁ జెప్పుచుంటిమో
శూరవరేణ్య ! యిట్టిచట సొంపులకుప్ప సతీలలామతో
మీరు వసింపఁగాఁ దగ దమేయబలుల్ గద రాక్షసౌఘముల్
చేరఁగనౌను సేమమగు సీమకు మీపురున్ రఘూత్తమా ! 41

అనతిదూరానఁ గల దొక్క యాశ్రమంబు
పత్ర ఫలపుష్ప తరులతా భాసితంబు
నటకుఁ బోనెంతు మయ్య రామయ్య మేము
నీవునుం గూడ రాఁదగు నెలవు సుమ్మి ! 42

అని పయనంబు జెసెడి మహామునివర్గము వెంబడించి వా
రిని విలుపంగఁ జెప్పి బహురీతుల వాక్యము లెన్నొ వ్యర్థమై
చన, హితమెల్లఁ గొంతవడి సాధువులన్ ఎడలేకపోయి యా
మునికులవృద్ధు మ్రొక్కి సెలవుంగొని చేరెను జిత్రకూటమున్. 43

ఒక్కఁడును జిత్రకూటాద్రి నుండకుండ
మౌను లెల్లరుఁజని రొక్కమార్గమందె
కాని వాల్మికి వీడి యాకాననంబుఁ జేరెఁ దమసానదీపుణ్యతీరమందు. 44

ముందుఁ గల రామకార్యంబు మునులు దలఁచి
తాము చిత్రకూటము వీడి తరలినారొ!
రాఘవునివెంటఁ గొనెడి మార్గంబుగాఁగ
మునుల వెనువెంట రాఁడె రాముండటంచు 45

రాముఁడు-అత్రి ఆశ్రమము

మునులఁ బంపించి మఱలిన జనవిభుఁడు
ఖరుని దుష్కృతిఁ గనులారఁ గాంచినాఁడు
మునిజనాశ్రయమైనట్టి వనము నేఁడు
చచ్చిపడియున్న మునుల శ్మశానమాయె. 46

చిత్రకూటంబు స్థిర వాససీమ కాదు
దండకావని నుండె నీ ధర్మకర్మ
ముందునకు రమ్ము శ్రీరామ మునులతోడ
నని మునులపోక రామున కర్థమాయె. 47

చిత్రకూటమందు సేనాసమేతుండు కైకసుతుఁడు విడిసి కదలిపోయెఁ
గాని సైన్యమందుఁ గల మృగంబుల లద్ది కొండఁ బట్టియుండె దండిగాను 48
పాడువడియుండె మౌనుల వాడలెల్లఁగొండయో చెడ్డవాసనఁ గొట్టుచుండె
జిత్రకూటాద్రిపై నివసింపలేక తనదు కర్తవ్యముఁ దలంచె దాశరథియు. 49

భరతుండు భక్తిచేఁ బరతంత్రుఁడైనను
　　పవిఁ బూవి కలిసిన ప్రాంత సిద్ధి
ముప్పురమ్మలు బాంధవుల్ ప్రేమమీఱఁగఁ
　　దనుపును నిమిరిన స్థాన సిద్ధి
నాగరబృందంబు నవ్యానురక్తితో
　　నెమ్మిఁ గైమోడ్చిన నేల యిద్ది
నేత్రపర్వంబుఁగా గోత్రంబుఁ జుట్టుచు
　　సైన్యముల్ విడిసిన చక్కి యిద్ది
యిచ్చట వసింప నీస్మృతి పెచ్చుపెరుగు
పులకితుల వీడి యిట నెటు వసఁగలాఁడ
బూర్వ సంస్కృతి విస్మృతి బొందవలదె
పొంద వనవాసదీక్ష సంపూర్ణ సిద్ధి. 50

పెక్కువమునైన కారణవివేకములన్ విడి చిత్రకూటమున్
భువిజను లక్ష్మణుం గలిసి పోఁదగు ముందున కేను దండకా
టవి తగు వాసయోగ్యము విశంబన మేలు సుధర్మకర్మకున్.
దివిజహితుల్ మునుల్ ముదముఁ దెల్పగ వారలయందు నుండెదన్. 51

అని తలపోసి రామవిభుఁ డంతట వీడుచు జిత్రకూటముం
జనెఁ జని యత్రియాశ్రమము జానకితోడ సలక్ష్మణుండునై
ముని కభివాదమున్ సలిపి మువ్వురు పొందిరి పూవిపూజలన్
మనములఁ గాంచిరెల్ల రసమానముదంబును జూచి యొండొరుల్. 52

అనసూయానందమగ్న లా యత్రియు సతి
కన్య దమయాశ్రమంబునఁ గమలవిభుని
జానకీరాఘవులఁ జూడ సంభ్రమంబు
వడసె రా వృద్ధమౌనిదంపతులఁ గాంచి 53

మునివరుఁ డత్రివిద్వద్బుషిపుంగవుఁ డున్ భవితవ్యవేత్త యున్
జనకసుతావర మూర్తి ముని సర్వ శుభంకరదివ్యమూర్తి అన్
గని తన జన్మసార్థకమౌఁగాఁ దలపోయుచు దివ్యదృష్టి రా
ముని వదనారవిందము ప్రమోదముతోఁ దిలకించు భక్తిమై. 54

తన్నుం జూడఁగ వచ్చినట్టి యల సీతారాముఁ డెంచంగ శ్రీ
మన్నారాయణుఁ డంచు నత్రిముని సంభావించుచున్ బల్కె రా
మన్నా! నీవె సృజింపవే భువనముల్ మాయామనుష్యాకృతిన్
దెన్నుం జూపఁగ మాకు వచ్చితి విటుల్ నిన్నుం గనన్ శక్యమే ! 55

మాయాతీతుఁడ! లీలఁదాఁ జలచరమ్మై చున్ మృగంబౌచు న
య్యాయీమానుషరూపముల్ గనుచు దివ్యత్వంబుఁ జూపింపకే
చేయం జూచెదొ లోకరక్షణము సృష్టిన్ దేహివై యుండినన్
మాయాలక్షణముల్ విమన్ దొరకువో మానాథ! నారాయణా! 56

మోహకరంబు మాయ విను మోహమునం బడఁద్రోయఁజాలదో
దేహి! సదా భయంబుఁ గనదే యది సేరఁగ రామచంద్ర ! నం
దేహము లేదు లోకతతిన్ సృజియించుచుఁ బెంచుచుండి వ్యా
మోహము సుంత లేక లయముం దుదిఁ జేయుపె నీవె లీలఁగా ! 57

నీ రూపబింబంబు నెగడ్తఁ గందెడి యిల్లు
బ్రతికెడి పిన్నల వల్లకాడు
నీ కథల్ గీర్తింపనేరని వాగ్వాని
రోతయౌ జంబుకరోదనంబు
నీ సేవ లొనరింప నెమ్మిసైఁ బూనని
కొర్రగాని దేహంబు కుక్కతోక
నీకు నివేదింపకే కడుపునఁ బడ
వేయు నాహారంబు విషసమంబు

నీకు గానట్టి బ్రతుకేల నీరజాక్ష !
సర్వలోకైకరక్షక! సార్వభౌమ !
కనులపండువుగా విను గాంచినాఁడ
పాహి మాం రాఘవాయ తుభ్యం నమోఽస్తు. 58

అనుచు దనచెంతనే యున్న యతివ జూపి
యీ పతివ్రత యనసూయ యెప్పుడనసూయ
నందకుండుట సార్థకమాయె పేరు
తల్లి నా నీవు పూజింపదగిన పూజ్య. 59

అమలమూర్తి దత్తాత్రేయు డనుచు బఱగు
నీమె కొమరుండు విష్ణ్వంశనే జనించె
నటుగ శ్రీరామ జననంబు నొట రామ !
జనని యనసూయ యగునన్న మునితలంపొ ! 60

ఘోరతపంబునన్ దనుజఘోష నివారణమొంద జాహ్నవీ
వారి లభింపజేసి ఫలవంత మొనర్చి ధరిత్రిక్షామమున్
బారగద్రోలె సర్వజన మాకటిబారి విముక్తి కాగ నీ
నారి వయస్సునం గడు వృద్ధ సతీలలామయున్. 61

నామము సార్థకంబయి జనంబభివాదముసేయ నర్థ యీ
ప్రేమమయాత్మ చేసె నొక రేయిగ వానరముల్ బదింటఁ దే
జోమయమైన ప్రొద్దు పొడచూపదుగా పదినాళ్ల రాఘవా !
భూమిజ సల్పనొప్పు నతి, బొందగనౌ, ననసూయదీవనల్. 62

అవి హితం బాడఁగా నత్రి, రాముండు జనకజకుం దెల్పె ననసూయ జేర. 63

అంత జానకి రామాజ్ఞ ననుసరించి బద్ధహస్తాబ్జయై మ్రొక్కి పరమభక్తి
నత్రిసతికిఁ బ్రదక్షిణ మాచరించి క్షేమమా యని యామె ప్రశ్నించుసంత. 64

మోదంబుఁ దెలుపంగ ముఖమండలమ్ము
నాదరించుచుఁ బల్కె ననసూయ పేర్మి. 65

విడచి సమస్త సౌఖ్యముల వీటిని మేడల నత్తమామలన్
గుడుచుచుఁ గందమూలములఁ గోమలివయ్యుఁ బతివ్రతాగతిన్
గడుపఁగ జీవితం బిటుగఁ గాననసీమకు భర్త తోడుతన్
గడఁగితి వీవు నీకు సరికాంతవు నీవె జగాన జానకీ ! 66

రమ్మియంచనకుండ భర్త వనికిన్ రా నీకెగాఁ జెల్లునో
యమ్మా యీ సహధర్మచారిణివిగా నత్యంత భక్తిం బతిన్
సమ్మానించుచు నిత్యమున్ గొలువవే సచ్ఛీలమున్ ధర్మమూ
లమ్ముం గైకొనవే పతివ్రతగ రూఢంబైతివో జానకీ ! 67

పెవిమిటి దుష్టుఁడున్ ఖలుఁడుఁబేదయు భ్రష్టుఁడు నైనగావి యా
తవిఁ బరదైవతంబని సదా సతి కొల్చుటయే సుధర్మ మా
తవి గుణదోషకామములఁ దా దలపోయుదు భర్తపట్ల నే
వనితకునైన స్వర్గగతి భర్తృపదంబుల నాశ్రయించుటే. 68

స్త్రీయె మూలంబు నరకానఁ జేర్పడంగ
స్త్రీయె మూలంబు మరణంబు చెంతఁ బడగ
స్త్రీయె మూలంబు కలహంబుఁ దెచ్చి పెట్ట
స్త్రీయె మూలంబు పురుషుండు సెంద సుకృతి. 69

అనుకూలవతి సతియైన నాయింట
ధనధాన్యసంపదల్ దఱుగ సెప్పుడును. 70

ప్రతికూలయై భార్య పఱఁగెడి యింట
సతము నాశనమొందు సర్వసౌఖ్యములు. 71

పతిహితంబునె యెంచి పాటించుసతికి
సతతంబు సౌఖ్యంబు సంప్రాప్తమగును. 72

భర్త పిలువంగ వెంటనే భార్య వెడలి యరయనౌ కారణము వినయంబు మీఱ
భర్త కోపింపఁ దానుఁ గోపంబు గనని భార్య కరచేత నుండు గై వల్యపదము.

పుట్టిన మెట్టిన యిండ్లకు గుట్టలుగాఁ బెట్టు యశము కోమలి సుమతిన్
మట్టముగాఁ గులటలు తెగఁ గొట్టరె వంశపుయశముఁ గులమున్ గుమతిన్. 74

పతివి గణింపకుండఁ బెరవారల గాముకవృత్తిఁ గూడు నా
యతివలు భర్తకున్ వెత నితాంతము గల్గఁగఁ జేయువారలై
పతితలుగా యశంబు విడి పాయరె వా రిహముం బరంబునుం
గతము దలంచి దుఃఖితులు గారె శరీరము ద్రెళ్లవేళకున్. 75

అని హితవాక్యముల్ మునిసతి పలుక
విని సీత మారాడె వినయంబు మీఱ. 76

తపసునం బతిసేవ ధర్మమ్ములందు
నపురూప నీవ యిట్లాడవే విమల ! 77

అమ్మా ! నీ నుడు లెల్ల సత్యమె సుమా యాంతర్యసంశుద్ధికై
కొమ్మల్ భర్తృపదారవిందములనే కొల్వన్ నితాంతమ్ము సౌ
ఖ్యమ్మం బొందఁగలారు వారలకు స్వర్గప్రాప్తియుం గల్గు స
ర్వమ్మౌ జీవితధర్మ మూనుట యశోభాగ్యంబునున్ లభ్యమౌ. 78

పెండిలికాలాన పేర్మిమైన్ దల్లి
దండకాటవి చేరు తరుణాన నత్త. 79

హితవాక్యములఁ బల్కి రీతుగనే వారు
నతతమ్ము నామాట నతిభక్తి దలఁతు. ౬

నే సహధర్మచారిణి నని గతు దంచని భర్త వీడి నే
నేసరణిన్ వసింతు బురి నీ వనభూమియె యోగ్యమే యగున్
భాసురమూర్తి రామనరపాలుని చెంత వసించునంత నే,
దాసిని భర్త కెంచఁ బతివజ్జ వసించు పతివ్రతంగదా! ౬

దు లఁగూడ వీరరు సతుల్ పతిసేవ బవిత్రతలౌటకుం
గ మ్ములన్ భరించెదరు కాంతలకుం బతి దైవతంబగున్
ష్టలు భర్తలన్ విడచి పొదగుచున్ నరకంబుఁ బొందరే
తుష్టినిఁ బ్రాణనాథుఁ బరితుష్టునిగా నొనరింపరే సతుల్. ౭

రాముఁడు సర్వలోకనుత రాముడు సత్యపరాక్రముండు శ్రీ
రాముఁడు చూడు నెప్పుడుఁ బరాంగనలం దన తల్లిరీతిఁగాఁ
గాముకవృత్తి లేని పరకారుణికాగ్రణి తల్లిదండ్రులన్
నీమముతోడఁ గొల్చెడి పునీతుఁ డహంకృతిలేని ధీరుఁడున్. ౮

సతము ధర్మవీరుండు కౌసల్యతనయుఁ
డతుల దానవీరుండు నృపాత్మజుండు
సర్వదా దయావీరుండు సకలవిదుఁడు
భూవిభుఁడు రామచంద్రుండు నావిభుండు. ౮

పతిసేవ సావిత్రి స్వర్గమ్మునందు
మృతజీవియై నేడు మెఱయుటలేదె. ౮

ఎందఱో సాధ్వులీజగతి నిట్లు పతివ్రతలై జగన్నుతిం
బొందరో యా సతీమణులు పూజ్యులకుం బ్రణమిల్లుచున్, సదా
బొందెద తరింప నావిభుని పూజల నల్పెద నీ హితోక్తులా
నందమునన్ స్మరించుచు మనంబున సంతత మాచరించెదన్. ౮

అని పల్కు సీతమ్మ ననసూయ మెచ్చి
తనువెల్ల నిమురుచుఁ దలమూరుకొంచు ౮

అమ్మ! జానకి! రావమ్మ యనుచు వృద్ధ
తనువు కంపింప వెల్లయొ తనువునూగ

8 గౌఁగిటను గ్రుచ్చికడుఁ బ్రేమ, గారవించి
హృదయమున జేర్చి హృదివిఁ పచింప గడగె. 88

జనకజ ! నీదుమాటలకు స్వాంతము శాంతిలిఁ బొందె సంతసం
బును గనుదాన మెచ్చితిని పూజ్యవు కోరుము దేనినేని, నే
8 బనివడి యిచ్చెదం దపసుబల్కిఁ బతివ్రతమాట నీ పహో
వనజదళాయతాక్షి ! భువి వర్ధిలు గాఁ వినుబోలువారిచే. 89

కొఱతలేదేమియుం గోరికల్లేవు
స్థిరబుద్ధి నానాథు సేవింపుదాన. 90

నాకేమి కొదవగు నీకృప కల్గ
నాకమ్ము లోకమ్ము నాథుఁడే నాకు 91

మృదుమధురంబులౌ మేటిమాటలను
నదమున దెల్పవే యంతియే చాలు 92
8
అనిపల్కి మ్రొక్కుచు ననసూయచెంత
జనకజ కూర్చుండె సంతోషగరిమ 93

నీత మృదూక్తుల, చే మునిపత్ని చేతము మోదముచే నలరన్ మా
ళాలిగ నొప్పెడి పావని నామెన్ బ్రాలిని దన్పె దపస్విని సేవన్ 94

లలితాంగినెమ్మోము లావణ్యసీమగా
బొలుపార గుంకుమబొట్టుపెట్టి
8 కమనీయమౌ కంబు కఠంబు దీప్తిఁ గ్రా
లగ వరదివ్యమాల్యంబు వైచి
మహనీయమగు శోభమై మెయి దీవ లా
సిల్ల దుకూలముల్ సేతి కిచ్చి
86 మించు మించెడిరీతి నం చుచయింప గా
నులేపనమ్ము దేహమున కలఁది
87
కర్ణముల గుండలమ్ముల గ్రాలఁజేసి
మహిమగల భూషణమ్ము లమర్చి మేన
జానకిని లక్ష్మిగాఁ గాంచి మౌనిపత్ని
యమిత సంతోషమగ్నమై యంతఁ బలుకు. 95

దివ్యవరమాల్య మిద్ది పృథ్వీజ! వాడ దక్షయమ్ముగ ఘుమఘుమ లాడుచుండు
విమలకుండలద్వయి యల విశ్వకర్మ నిర్మితంబౌట శోకదు విస్మృభయము. 96

దేహ మను లేపనంబునఁదేజరిల్లి పాయదెప్పుడుగూడ జవ్వనము సీత !
యంగరాగంబుచే సుందరాంగి! సతముభర్తృ పరిపూర్ణ రాగంబు బడయగలవు.

అవ్యయుండగు విష్ణున కాదిలక్ష్మి మోద మొనఁగూర్చురీతి రామునకు నీవు
ప్రీతిఁ గలిగింపఁ జాలిన రీతి నుంటి వా సౌందర్యమూర్తివై యతుల! సీత!

ఎన్నికనుగన్న నీకథ మున్నువింటిఁగాని నీ స్వయంవరగాథ కమలనేత్రి
వివరముగ జెప్ప నీనోట విన దలంతునని తపస్విని సర్వజ్ఞ యడుగునంత. 99

అత్రిసతిచే సపర్యల నంది సీత మోదమలరార నామెకు మ్రొక్కినంత
నాతపస్విని ముచ్చటలాడఁగడఁగి యవనిజాస్వయంవరకథనడిగె దెలుప. 100

సీత నిజపరిణయగాథఁ దెల్పుట

చిరునవ్వు జిలుకుచు సీతమ్మపలుకు
పరిణయకథ నెల్ల బరమానురక్తి. 101

మిథిలాధిపతి తండ్రి మేదినీవిభుడు
ప్రథితధర్మాతుండుప్రఖ్యాతియుతుఁడు 102

జనకుండు సంతత సత్కర్మయోగి
జనతతి బాలించు జనకుం డనంగ. 103

అనపత్యు డౌటచే నతిప్రేమ బ్రజను
కవినట్టి సంతానమనురీతిజూచు. 104

యాగంబు సేయంగ యత్నించుచుండి
నాగటితో దున్నె యాగస్థలంబు. 105

నాగటిచాలున నను గవి యంత
వేగమె రాణికి బెంచ నన్నిచ్చె. 106

ఆకాశవాణియు నాత్మజరీతి
సాకుమంచని చెప్పెలోకంబు వినగ. 107

గారాముతోడ నంకంబునం జేర్చి
మారాము గనకుండ మమతతో బెంచె. 108

పరిణయ మొనరింప వయసు వచ్చుటను
వరునికై వెతుకంగ బని బూనినాడు. 109

తను నయోనిజను దగినవాని కొసగ
ననురూపుని సదృశు నరయంగ నెంచి. 110

దొరకమి నెచ్చోట వరగుణమూర్తి
పరితాప మొందెను బహువిధంబులుగ. 111

రూపురేఖల నపురూపనై యుంట
భూపులు గురునితో బోరాడి నన్ను. 112

గొనిపోవ యత్నించి చనినార లోడి
యనియందు గెల్చుచు గనడు మోదంబు. 113

పగబూన దండ్రిపై బలువురు నృపులు
తగవుల హేతువై తనరారినాను. 114

అందాలచందాల నలరారుదాన
మందభాగ్యగ వరుః బొందకయుంటి. 115

ఒకకన్యకే పెండ్లి నొనరింపలేక
వికలాత్ముడై తండ్రి విసగి వేసారె. 116

పెక్కురు సుత లింట బెండ్లికై యుండ
స్రుక్కడో యా తండ్రి సుఖహీను డగుచు. 117

ఆడపిల్లలఁ గన్న యా యయ్య బ్రతుకు
వాడవాడల కెక్కు గోడు నొందంగ. 118

సురలోకనాథుని సరివాఁడైయైన
ధరపతియైనను దప్పునే చింత. 119

సరివారొ పెఱవారొ మఱి యత్తవారొ
కొరగానివారొ కూతురు గన్నవాని. 120

పరుష వాక్యంబులఁ బలుకాడరొక్క
తఱుగని దుఃఖాన సిరిలేనిగతిని. 121

గురుఁడెంచ బాధల బరగకుండునొకొ
తరుణులఁ గన్యలు దనయింటనుండ. 122

సంతానమునఁ బొందు సౌఖ్యంబు కంటె
వింతవింతల కష్టవితతియే మూడు. 123

జనకుని వంశంబు జనని వంశంబుఁ
గనజొక్కు యపకీర్తి యని కన్యవలన. 124

పారంబుఁ గనలేని ప్లవహీనుగతిని
దారితప్పినవాడు తపియించురీతి. 125

కడు విచారాబ్ధి మగ్నుఁడుగాఁగ దండ్రి
విడువఁడు యత్నంబు వీడఁడు పెళయు. 126

నే నయోనిజ నగుటను దానుఁ దలఁచి మానవాతీతుడగు నొక్క మహితపతిని
నన్ను వరియించువారల నెన్నికఁ గన జనకుఁ డన్వేషణ మొనర్చె జగతియందు.

వరుణుఁ డిచ్చిన విల్లొండు వరలు వింట మానవుఁ డెవండు నద్దానిఁ బూనలేఁడు
దాని మోపెట్టఁగలవాఁడు ధరణి నున్న మానవాతీతుఁడని యెంచి మహిజ విడగ.

అర్మ దలపోసి చాటె స్వయంవరమ్ము
రాజు లరుదెంచియును ధనుర్వరముఁ జూచి
వెశలి రెల్లరు దాని మోపెట్టలేక
గడిచెఁ గాలంబు కొంత యాగతిని దేవి ! 129

అటుగఁ జన గొంతకాలంబు యజ్ఞ మొండు
జరుపుచుండెను జనకుండు, జరుగుచుండ
కొండొకదినాన ఋషిశల్లజుండు గాధి
సూనుఁ డరుదెంచె యజ్ఞంబుఁ గానఁదలఁచి. 130

అత్తఱి గాధిపుత్రుఁడు మహాత్ములు వీరలు రామలక్ష్మణుల్
బత్తిని వెంటరా నవనవాటికఁజేరి స్వయ వరార్థ మా
యత్తముసేసి యుంచిన మహాధనువుం గనవచ్చియుండి రీ
యుత్తమక్షత్రియాన్వయసముద్భవు లీ సుకుమారులం చనెన్ 131

చనువున స్నేహపాత్రుఁను నాదరించి
జనకుండు పూజించె మునినాథు నంత. 132

జనకనృపుండు గాధిజుని సార్థకవాక్యములన్ గ్రహించి రా
మునిఁ గని వింటిగొప్పతనమున్ వివరించుచు విల్లుమోపువా

వివి గను నీ యయోనిజ వినిర్మలభక్తిని భర్తగాఁగ విం
టిని శివదత్త మురర్వి నెవఁడేనియుఁ బూనగలేడు లేడనెన్. 133

జనకుని పల్కులన్ వినుచు జారుతరాంగుడు రాఘవుండు త
న్మని గని వానియాన విలుమట్టుచు నారిని గూర్చుమాత్ర నా
ధనువు ద్విభాగమై విఱిగె ధారుణి భీతిలు ఘోషనల్పుచున్
మనుజుడె రాఘవుండు నరమాత్రుడె రాము డటంచనం బ్రజల్. 134

హరధర్మ మిదియౌట హరి బోలువాడె
యరచేత విలుమోప నర్హుడౌ వాడు 135

సీతమ్మ చేనెత్తి చెలగాట మాడు
పాతవింటినె నృపుల్ పట్టలేరైరి. 136

జనకుడు నా కయోనిజకు జాలిన భర్త లభించుటన్ ముదం
బున నపురూపువిం గనుచు, బుత్రిని నన్ సహధర్మచారిణిన్
గొన వినయాన గోరె రఘుకుంజరు డొల్లక యట్టిసేత దం
డ్రిని వెనువెంటనే పిలుచుచే తగు ధర్మమటంచు దెల్ప గన్ 137

తండ్రియాన సతము దల దాల్చు తనయుం డుజనకు నాజ్ఞ లేక సతిని గొనునె
దానమైథిలుండు దశరథు రావించి పరిణయణంబు నలిపి ప్రమదమొందె. 138

పతిగా గ లక్ష్మణుం బడసె నూర్మిళయు
పతి గాగ రాముమనే బడయుచుుండంగ. 139

రాముని పాణియం దునిచి రామను సీత నయోనిజన్ సుతన్
భూమిజనైన జానకిని భూధవు డెంతయు సంతసించి. నా
స్వామికి నప్పగించి నను బంపె నయోధ్యకు నాటినుండి నే
నీ మహితాత్మ పూజల రహించుచునుంటి బతివ్రతంగదా ! 140

## అ న సూ య సం తు ష్టి - దీ వ న

అని సీతమ్మ స్వయంవర ప్రథితదివ్యార్థంబు వ్యక్తంబుగా
మునిపత్నీ హృదయాంతరాళములలో బుల్కల్ జనింపంగ వా
కొన మాధుర్యముగా మృదూక్తులను జేకూరెన్ మహానంద మా
యనసూయాత్మకు మాసతీ మహిత దివ్యాత్మన్ వినన్ నోచుటన్ 141

తా నయోనిజ ననుమాట, ధాత్రిజాత నం చనినమాట, మోపెట్ట నా ధన-
మనుజమాత్రుల కలవిగా దనినమాట, ధాత్రిజారాఘవులు దివ్యదంపతులని.

చెప్పకయె విప్పిచెప్పెడి చొప్పు గాదె సీత యవతార విస్మృతి జెందకుండ
ముందు గల భక్త రక్షణస్ఫురణ మొంద నాది సౌందర్యమూర్తి ననాదిమా
మహిజ మంగళదేవత మహితవాక్కు కర్ణపేయంబుగా విన గాంక్ష గలిగి
భావికాలంబు నోర్పుపై బరిగణింప దనదు జన్మంబు దా నెంచి మనగ సీ
యవని జాన్వయంపర గాథ నడిగి వినుచు
గనుచు దనయుందు "ధన్యాస్మ" యనుచు వృద్ధ
పొంది సంస్పర్శ సుఖము నానంద మొంది. 14

రశ్మిమంతుని వెన్నంటి రాత్రి రాదొ
మాయ నిరతమ్ము జ్ఞానివెంబడిఁ బడదొ
కులట కులకాంతను హసించి కులుకుగాదె
సుఖము దుఃఖమ్ము వెనుగొనుచుండుగాదె
దివ్యకాంతినిన్ బ్రసరించి తేజావాసి
యినుడు చనుచుండె విశ్లేషమిడగ మనకు
ననుచు బరమానురక్తిని నవనిజాత
శిరము నిమురుచు గౌగిలి జేర్చె నామె: 144

ఆశ్రమస్థలముల సంబాయటంచను
నావుదూడలయార్పు లవియె వినుము
కూయుచుఁ గెరలుచు గూండ్లకు మరలెడు
పక్షిసంతతుల రవంబు వినుము
పూయుచు బంగారు పూతల నీమేన
నినుగొల్చుచున్నవాడినుఁడు గనుము
సాంధ్యకర్మల దీర్చి జలపాత్రముల బూని
చనుదెంచువారల మునుల గనుము

లక్ష్మివలె నీవు నీభర్త లలితరాము
పూజ సల్పెడి వేళాయె బోయి రమ్ము
రాఘవునితోడ మఱల నీరాజ్యమేఁగి
సౌఖ్యపడెదవు సీత నిజమ్ము సుమ్ము. 145

చూడు మీ రాత్రి యరుదెంచె జుక్క లవిగొ
శీతకిరణాల శశి ప్రవేశించె నింగి
దాశరథిఁజేరవమ్మ సీతమ్మ! యింక
దనివితీరునె నిన్నెంతతడవు గనిన. 146

అనుచు ననసూయ కోరగా నవనిజాత
పట్టుపుట్టంబు ధరియించె భర్త జేరె
మానవాతీతసత్కృతి మహిజ కొనుట
రహిఁజెలంగిరి దశరథరాజసుతులు. 147

## రాఘవుఁడు ముందున కేగుట

భక్తభక్తుఁడు తాపసబాంధవుండు
చిత్రకూటాద్రి వీడుచు నత్రి జేరి
మునితతులఁగూడిఁయారేయి బుచ్చి యచట
భానుఁడుదయించినంతనే పయనమాయె. 148

అవనిజారాము లీయాశ్రమంబందు
నవతారసంస్మృతి నందియుండుటను. 149

దండకాంతరసీమ తన కర్త్వ మంచు
నుండగా నచ్చోట నూహించినాడొ! 150

భావికర్తవ్యంబు భావించినాడొ
యా వీరరాము డేభావముం గనెనొ. 151

మునిజనవారముం గలిసె ముందునకున్ వనిలోఁ జనంగ ద్రో
వను దెలుపంగఁగోరె రఘువర్యుఁడు, మౌనులు వచ్చిపోవుదా
రిని దపసుల్ వచించిరి చరించుచు నీ వని మమ్ము రాక్షసుల్
పనివడి ఘోరకష్టములపాలొనరించుచునుండి రీశ్వరా! 152

మానవుల గూడ దినుచు దుర్మార్గులగుచు
రాక్షసులు మాంసభోజులు రాత్రిపవలు
తిరుగుచున్నార లీ వని వెఱపులేక
రక్షణ మొసంగుమోయి శ్రీరామచంద్రా! 153

అనుచు వేడుచు దీవించు మునుల (మొక్కి
యత్రి సెలవొంది, చొచ్చె వనాంతరంబు
జానకీలక్ష్మణాన్వితచక్రవర్తి
మొయిలఁబడు లోకబాంధవమూర్తిరీతి. 154

## ఆశ్వాసాంత పద్యములు

స్థానభ్రష్టుడనైతి రోగము పరీక్షంజేయుచుండెన్ ధృతిన్,
బోనీ, నీతిరుపాదపూజలను రేపున్ మాపుఁగావింపగా
నైనా, యోపిక లేకపోయె గడు నాయాసంబుచే నిత్యమున్
దీనత్వంబు ఘటిల్లుచుండె నిక నంతేవాసి రక్షింపవా ? 155

కవచశరాస్త్రబాణసితఖడ్గధరుల్ రఘునందనుల్ సదా
కవమెయి జానకీయుతులు గ్రాలఁగ నాముసుముందు నాకహో
యవమతి యేల నాగ్రహదశాంతరభావఫలం బదేల ? రా
ఘవకరుణార్ద్రదృష్టి త్రుటికాలము చాలదె సర్వసిద్ధికై, 156

కర్మతెఱంగులం బడుచు గాదని లేదని పుణ్యపాపముల్
మర్మ మెఱుంగలేక భువి మాయకు లోఁబడి నీదుమార్గముల్
ధర్మము గానలేక వివిధంబగు సంకుచితాభిమానముల్
చర్మమునంటి పట్టి విడజాలవుగా విను గాంచ రాఘవా ! 157

నమ్మకమైన దిక్కు రఘునాయక నీవొకరుండవే సుమా
నెమ్మినిఁజూచి కడుక్కినే స్తపు సల్ప్రితి జాలమందితో
వమ్మగు నాదుప్రేమ హితవర్గము బంధులపట్లఁగూడ లో
కమ్మున స్వార్థ మొక్కటియె కన్పడు నెల్లరయందు రాఘవా ! 158

ఆరయ నౌనె నీ మహిమ లన్యుల కేరికిగాని భక్తులౌ
వారలు మాత్రమే కనెడివారలు నీదగు దివ్యశక్తి, న
వ్వారల బ్రోచుదీ వెపు డపారకృపారసమూర్తి వౌచు నో
"తారకనామ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ !" 159

శ్రీ గోవింద రామాయణమున రక్షకరామ కావ్యమున వాత్సల్యాశ్వాసము
సమాప్తము___

# శ్రీ గోవింద రామాయణము

## రక్షక రాముఁడు

### 2. విమోచనాశ్వాసము

### శ్రీరాముఁడు - మౌనులు

హరినామంబు నతంబె
వ్వరిహృదయస్థమగు వారు పగవారైనన్
హరికిఁ దరింపరె, నీకృప
బరమపదంబే లభించు వైరులకైనన్. 1

యతియొకొ! కాదు కాదు కుసుమాంగిఁగలాఁడు! తితీర్షువేనొకో!
ధృతధనువైనవాఁడు! నృపతీంద్రసుతుండొ! జటాజినాదిసం
గతుఁడగువాఁడు! వ్యాధుఁడొకొ! కాఁడు కనంబడు జందెమయ్యదే!
యత డెవఁడో? వనిం దిరుగు నీగతి శ్యామలమోహనాంగుఁడై. 2

అనుచున్ సర్వశుభాంగలక్షణుని భార్యాభ్రాతృసంయుక్తునిన్
వనజాతాక్షునిదీర్ఘబాహుయుగళీభాస్వంతునిన్ శ్యామలున్
మునిబృందమ్ములు కౌతుకాత్ములయి గుంపుల్ గూడి వీక్షించుచున్
జనినా రాతని గూర్చి సర్వ మెఱుఁగన్ సంసిద్ధులై చెంతకున్. 3

పురుషుండో భువనైకసుందరుఁడు తాముం బూరుషుల్ కాని, యే
మరపాటుం గనకుండ వానిఁ గనుచున్ మారాకృతిం జొక్కి త
త్తఱపాటుం గని బుద్ధి మోహవశులై తావత్రయీ మాయకున్
గుఱియై కౌగిట బట్టి ముద్దుగొనగాఁ గోరున్ మునీంద్రౌఘముల్. 4

ప్రేమమయబుద్ధిమగ్నులై యా మునితతి
ప్రకృతివశులయ్యు దదుపరి బరమదృష్టి
భ్రూకుటిం జేర్చి కనుగొన బూని రతని
వారు దివ్యవిజ్ఞానులౌ వారు కారె! 5

యోగదృష్టిని సారించి యోగులెల్ల
జానకీరామలక్ష్మణజన్మగాథ
నెల్ల నవలోకన మొనర్చి యుల్ల మలర
స్వాగత మొసంగినారు సుస్వాగతమని. 6

సర్వభూతహితరతుండు చక్రవర్తి
యతిథిగా లభ్యమాయె 'ధన్యాస్మి' యనుచు
మౌను లెల్లరు రాఘవుమహిప నంత
పర్ణశాలకు దోడ్కొని వచ్చినారు. 7

తమపర్ణశాలల దమి నిచ్చి మునులు
కమలేశు బూజింప గడ గినా రంత. 8

అర్ఘ్యం బిదే రామ! యఘవిదూరక! నిత!
ప్రళయాబ్ధిలో వటపత్రశాయి!
పాద్యం బిదే రామ! యాద్యంతవిరహిత!
పరమపావనమూర్తి! పద్మనేత్ర!
మాల్యంబిదే రామ! మహితాత్మ! పరమేశ!
జయ జయ రామ! విశాలవక్ష!
భక్ష్యం బిదే రామ! వనరమాదత్తంబు
బ్రహ్మాండపోషణ! ప్రమదవర్తి!

మునిమనోవల్లభా! యిదె మునులతపసు
నీకె నైవేద్య మిడినాము లోకనాథ!
యార్య! జ్యోతిర్మయాత్మల హారతి గొను
"మాదినారాయణాయ శుభ్యం సమోస్తు" 9

రాముని నెఱింగి యాదినారాయణునిగ
దోయిలిం బట్టి మనసార దోయజాక్షు
నటుగ నర్చించి మువ్వుర నా తపసులు
గాంచుచు మనవి సేయంగ గడ గి రంత. 10

రాజువు నీవు సర్వజనరక్షణదక్షుడ నీవు ధర్మవి
భ్రాజితమూర్తివై తనరివచ్చినవాడ వరణ్య మేల, న
వ్యాజకృపావరుండ! మునివారశరణ్యుడ నీ వయోధ్యలో
రాజిలుచుందుగాక వనరాజి వసింతువుగాక స్వేచ్ఛమై. 11

తపమున, గోపతాపముల దాశరథీ! త్యజియించినాము మా
తపకృతి నల్పువారల నహంకృతిచే శపియింపబోము మే

మెపుడును, స్వీయరక్షణము మే మయి పూనము శిశురక్షణల్
నృపులస్వధర్మములుల్ గద! పనీస్థలెన్తై నను వీరరాఘవా! 12

సకలభువనైకమోహనచక్రవర్తి వీవ, నీ ప్రజ రంజింప నెంత నీకు
స్వీయరాజ్యంపె యీ వనీసీమ కూడపాలితుల మమ్ము రక్షింపవా మహేశ ?13

వాఙ్మనః క్రియారూపసర్వగతుల నిను నాశ్రయించినవారమో యంబుజాక్ష!
'యన్యథా శరణం నాస్తి' యనెడివారి నీభరన్యాసకుల బ్రోవుమీ మహేశ! 14

అనుచు దోయిలి బట్టి యా మునులు వేడి మంగళాశాసనంబుల మహిమ గొల్చి
లక్ష్మివలె జానకిం గాంచి లక్ష్మణార్య మన్ననం దన్పి యానందమగ్నులైరి.15

ఆ రీతి మువ్వు రా యాశ్రమస్థలిని
నా రేయి గడుపగా నర్కుండు వచ్చె. 16

మునితతి సెలవొంది మువ్వురుం గలసి
వనమధ్యమున కేగ బయలుదేరంగ. 17

వేదఘోషలు వినవించుగా నుండిన
పర్ణ శాలలు దృష్టిపథము దొలగ
గుంకుమ రేఖల గుశతతి గొనితెచ్చి
పతులచే నిడు మునిసతుల బాసి
నిత్యసాంధ్యవిధుల నిరతాగ్నిహోత్రముల్
పరున కర్పించు తాపసుల వీడి
యాశ్రమస్థలి ప్రేమ నలరారి తిరుగాడు
పెంపుడు మృగపక్షివితతి విడిచి
ఘోరభీకరరూపనిర్ఘోషమయము
క్రూరశార్దూలవృకమృగాకులము వనము
లోన జొరబోవుచుండె భూజాని, సతియు
లక్ష్మణుడు వెనువెంటరా లలితగతిని. 18

తాను ముందున జన దా నిర్ణయించి
జానకి పిమ్మట సౌమిత్రి రాగ. 19

ధను వెక్కువెట్టుచు దరలినా రడవి
గనుచుండి ఘోరమృగంబులం దెల్ల. 20

చిదచిదీశ్వరు లొండొంటి చెంత బలుగు
చంద మొప్ప నా ముప్వురు చనెడిరీతి
ప్రకృతిబద్ధజీవిగా సీత, ప్రకృతిముక్త
శుద్ధజీవిగ సౌమిత్రిచొప్పు, వీర
లవ్యయువిభుపెంట బడుచుండి రనగనొప్పు. 21

అడవిలో నడచెడు నాత్మేశువెనుక
వడివడి నడుగిడి వైదేహి నడుచు. 22
జనకజ వెనువెన్క సౌమిత్రి పఱగు
వనమార్గమందున వరుసగా వారు. 23

తనభర్త యడుగులో దా నడుగిడదు
పనిబూని యడుగును బ్రక్కగా వేయు. 24

అవనిజయడుగున కవలిప్రక్కగను
నవనీశుసోదరుం డడుగు వేసెడిని. 25

ఒకదానిప్రక్క వేఱొక యడు గొప్ప
సుకరముగా బోవుచుండిరి వారు. 26

దాశరథి పదన్యాసంబు ధాత్రిజాత, యవనిజ పదన్యాసంబు రామానుజుండు
నతిపవిత్రముగా నెంచుకతన బ్రక్క గా నడుగిడుచునుండి రా కాననమున. 27

ఆ వని వరుసగా నడుగులు మూడు
భువన త్రయీ సృష్టి బోలియుండినవి. 28

వారివోకరీతి ప్రణవార్థసూచన మగుచునుండె రాము డగ్రమం ద
కారవాచ్యుడును నుకారవాచ్యగ సీత గాంగ లక్ష్మణుడు మకారమూర్తి. 29

అగుచు 'నోం'కారార్థ మనగ నవ్వారు
సొగసుగ గులుకుచు జొత్తు రా వనిని. 30

ముద మలరారెడి మోమున సదమలచరితుండు రామచంద్రుం డడవిన్
బదముల వేయుచు బడలిన సుదతికి బలుకాడు నర్మసూక్తుల నెలమిన్. 31
జానకి! యీ వనీస్థలము శాతశిలామయకంటకావృతం
బైనది మెట్టపల్లముల బాదము లీ వెటు వేయుచుంటివో

కానగజాతి దూలిపడగానగు రాదగు గ్రింద జూచుచున్
బూనదగున్ మదీయభుజమున్ భవదీయకరాబ్జ మూతగా. 32

అంతన్ సీతను గాంచుచున్ రఘువరుం డాప్యాయితం జూపి యీ
కాంతారత్నము నీదుపుత్త్రి గద! యీ కాఠిన్య మేలా ధరా!
కొంతైనం గనవా మృదుత్వమును! సంకోచింతువే! యాత్మజా
సంతాపం బుడువంగ మేలు సలుపన్ సాహాయ్యముం జేయుమా! 33

అరుణదళమృణాళస్నిగ్ధ మతివపాద పద్మయుగము ధరా! తడబడుట గనవా!
కఠినతర ధాత్త్రి! నీ సుత కాలుమోపు మేరయైనను దల్లివి మృదుల వగుము.

అన మందస్మితవక్త్రుడై పృధివితో, నాపై మనోజ్ఞంబుగా
నను భర్తం గని జానకీరమణి లోకాధీశు భావాగ్రహం
బున బల్కెం జెఱునవ్వువెన్నెలల రాముం దన్వుచున్ నాథ! నీ
పనికై మాత్రమె వీడ దీ కఠినతన్ బావింపుమీ ధాత్రియున్. 35

పదకమలరజంబు పాషాణతనువును గాంతగాగ జేయగలిగె మున్ను-
దాన గౌతమసతి తనభర్త గూడుచు మహితసౌఖ్య మొందె మఱచినావా! 36

ఈవు నే డిట్లు శిలలపై నేగుచుండ నెంద ఱెందఱ గనుదుమో యిందుముఖుల
దాపనబ్రహ్మచారులు తావకీన కృప గృహస్థాశ్రమమ్ముల నెనయగలరొ! 37

శిలలు లేకున్న యీ వనీసీమయందు నల్లునకు గోపకారణ మగునుగాదె!
స్వీయపదరజ మిక ఖ్యాతి జెందకుండ వీడె సహజస్వభావ మీ పృధివి యనుచు. 38

పక్షపాతం బెఱుంగ దీ పరమధాత్రి తనయయెడ జూపకుండు నే తల్లి ప్రేమ?
తరుణ మొదవినయప్పుడు దాశరథివి నీవెఱుంగని దున్నదే నీరజాక్ష! 39

మున్నొకప్పుడు నీ నుడితెన్ను నిజమె స్త్రీల నుద్ధరింపగనయ్యె శిలలనుండి
సీత! హలకర్మమాత్రాన స్త్రీలు నేడు దొరకరే! దాన మృదవౌట ధరకు దగదె? 40

అను ఛలోక్తులతోడ హాసంబుతోడ
జనుచుండి రా వనిం జరచర వారు. . 42

## విరాధశాప విముక్తి

అటు వని కాంచె రాఘవధరాధిపు డంత వనాంతరంబు సం
కటకరఘోరదుష్టమృగకాయసమాయుతవన్యమధ్యమున్

జటులలతానికుంజతరుసంగత సాంద్రమహావనీస్థలిన్
గటుతరఝిల్లికాగణనినాదయుతంబు దటాకయుక్తమున్. 43

పులులు సింహాలు నెలుగుగొడ్డులును నడవి
పందులును దున్నపోతులు పక్కిగములు
నీరములు లేని మడుగులు నింగినంటు
చెట్లు చేమలు గల వని జేరినాడు. 44

వికృతరూపి భయంకరవికటవక్త్రి శైలశృంగమహాకారు జర్మధారు
భూతముల నెల్ల మ్రింగ, వే మూతిదెఱచి రక్తసిక్తుని గవినాడు రాముడచట. 45

పులులు నాలుగు సింహాలు మూడు, రెండు
వృకములును గ్రుచ్చి పదిలేళ్ళ నేనుగుతల
మొన దగిల్చి శూలంబు జేగొనినవాని
సంకటమున జేరువాని రామయ్య కాంచె. 4'

అంత హఠాత్తుగా నట మహాధ్వని సల్పుచు గూబ గుయ్యనం
జెంత విదల్చుచుం దనువు, సీతను జంకను బెట్టి పర్విడెన్
సుంతయు రామలక్ష్మణులచొప్పు గణింపక ముందు కేగి భూ
కాంతుని రాముగాంచి పలుకాడును దైత్యుడొకండు దుర్మతిన్. 4'

ఎవరొహో దండకాటవి జరించెడువారు సతీసమేతులై
కవచశరాసిచాపములు గ్రాల జటాజినవల్కలంబులన్
యువకులు మీర లిర్వురు మహోద్ధతిపై దిరుగాడుచుండిరే
ఏపటున కంపుదున్ మిము విదే క్షణమాత్ర విరాధుడన్సుమా. 48

తాపసులొక్కొ మీరు పవిత్రాయుతులై రహా! యంతెకాదు మీ
చాపశరాసిధారణము చాటెడి తాపసవేషధారులౌ
పాపులు మీర లంచు గనవచ్చు బరస్పరమున్ విరుద్ధమౌ
రూపము మౌనిదూషకులు రూఢిగ మీర లధర్మవర్తనుల్. 50

ఈ విరాధుండను రాక్షసుం డీవనమ్ము నందు సతతమ్ము దిరుగాడు సాయుధుండు
మౌనుల సతతంబు దినుచుండి మనుచు వీడు యా కమలనేత్ర నా భార్య యింకనుండి.

మిమ్ము బాపల దునుమాడి మెక్కువాడ రక్తమాంసంబు లిప్పుడే రహి జెలంగ
ననుచు గర్వోక్తులను బల్కు నసురు గాంచి వనుచు కంపింప సీతమ్మ తాల్మివీడు .51

అంత బెనుగాలిచే నూగు నరటిరీతి భయదరాక్షసునంకాన బఱగు సీత
గనుచు నసురప్రతాపంబు వినుచు రాము డనుజునకు బల్కె జానకీపతితనెంచి. 52

ఎంతవారికి గల్గు నెట్టెట్టి వెతలు సకలసుఖముల బెంపొందు జనకపుత్రి
సాధ్వి యా సీత నాభార్య సతతసుఖద యదె విరాధాంకమున జేరె నామెవిధివి. 53

సీత సుందరి యగుటచే జెనటి యసురు డెవ్వడో హరించు రాఘవుం డీల్గుదాన
కాక మఱల దయోధ్యకు గొంత లేక తా విరక్తుడై యడవినే తనువు వీడు. 54

భరతునకు నడ్డు రాగలవాడు పోవు
ననెడి భావన నను వని కంపె గైక
పుత్రునకు రాజ్య మిడి తృప్తి బొందకుండ
నోయి సౌమిత్రి? యె ట్లెంచియుండెఁ గైక
యట్లె నమకూడె మన విధి యని తలంతు. 55

సకల రాజ్యంబు విడి తండ్రిచావు వినియు వింత దుఃఖంబు బొంద నే నెపుడు గాని
పరునిచే సీత స్పృశియింప బడ్డట గలుగు వంత యింతని యెంత నే బలుకగలను?

తను నాశ్రయించిన తన్వినే, పరుఁడు
గొనె నంకమున నంచుః గుందు రాముండు. 57

దీన జనావన దీక్షాపరుండు
జానకి కష్టంబుఁ గానఁగా లేడు. 58

అట గంట దడిబెట్టు నగ్రజుం జూచి
దిటవరి సౌమిత్రి తీవ్ర రోషాన. 59

పగబట్టు నాగంబు పగిది బుస్సనుచు
వగపేల రక్కసుఁ దెగనేయువాడ. 60

లోకాలకు నాథుండవు నీ కొకో దుఃఖంబు రామ ! నీప్రేషుఁడ నే
నీ కడ నుండఁగ రాక్షసు లోకార్చెద రక్తమిపుడె భూస్థలి గ్రావన్. 61

రక్కసిగాంచుచు బిక్కన నవ్వుచు రాముని తమ్ముడు పల్కెడినీ
వెక్కడివాడవు దుష్టుడవై వని విక్కడ సౌఖ్యముగా దిరుగన్
దిక్కులు పిక్కటిలంగ వినాదము ద్రేవుచుఁజేసి, విరాధుడనే
విక్కడనుందు శతఘ్రహవయున్ జయుడెంచగ నాజఘనీ జనకుల్. 62

## వి రా ధు ని ప్ర లా ప ము

ఓరి మానవుడా యొంది యుంటిన్ వరం బేరి శస్త్రముచే నేని నీల్గన్ భువిన్
గోరగా నజుఁడా కోర్కె దీర్చెం దపం బౌర మెచ్చి యభేద్యత్వమిచ్చెం గదా! 63

రావణుడు రాజు బలియు పరాక్రముండు ఖరుడతనికంటె నతిబలుండరయ వాని
మించిన బలుండు లవణుండు నెంచవే విరాధుడ మహాకాలుండ వీరలకు మించి.

కాంతి మాత్ర పూజార్హయౌ గాంతయీమె భార్యయగునింక నాకు నీ పడతి వీడి
యా యుధమ్ముల వీడి పలాయనమ్ముబట్ట గబళింప మిము పీడు వాడ నిపుడె. 65

ఇంతకున్ మీ రెవ్వరిటు ప్రశ్నవేయ
వింతగా బ్రాణాల పీడ మీరిచిట. 66

అను రాక్షసుం గని యా రాము డంత
వినుతించె కాకుత్స్థ వీర వంశంబు. 67

అన నా రక్కసుడా ప్రలాపముల, గోపాయత్త చిత్తంబునన్
విని రక్తారుణ లోచనుండగుచు బృథ్వీశుండు రాముండు చా
వునె వాంఛించుచు నుంటివోయి యసురా! పోనాడి ధర్మంబు నీ
వనిశం గొందె పరాంగనన్ ! మరణమే ప్రాప్తించునో క్షుద్రుడా ! 68

రాముఁడ లక్ష్మణుం డితడు రామ ధరాత్మజ నాదుభార్య మా
భూమిధవాజ్ఞ వచ్చి వసభూమిని దుష్టుల సంహరింప వి
ల్లేసు చరించుచుంటిమి రిహిన్ లభియించితి వీవ తొల్త గా
భూమిజ సంకషం దువిచి పోవిక జీవముతోడ దుర్మతీ ! 69

అంకము నుంచి డించి జనకాత్మజ సీతను భీకరాకృతిన్
గొంకక పై బయిం బడెడి క్రూరుని గాంచుచు రాఘవుండు నే
నింక విరాధు జంపదగు నించుక హాని జనింపకుండ నా
పంకరుహాక్షి కంచు నెద భావనసేయుచు నేయ దూపులన్ 70

మొఱయ జ్యాఝుంకారమును జేసె నతడు
కఱకుగా శబ్దంబు కను లెఱ్ఱజేసి. 71

ధర్మంబు బూవిరి దశరథసుతులు
కర్మావశిష్టంబు గడతేర్చువారు. 72

దురమునన్ మొదలిడి రాఘవు లరివీరుని పైవి దూపు లంతట నేయన్
బరిహారి మొనర్చు నిశాచరుఁడుం దన శూలశక్తి శస్త్రము లెల్లన్ 73

53 నిశిత విశిఖంబు లన్నియు నిబ్బరముగ నసురతనువున జొరబడి యవలికేగు
రక్తపాతం బొనర్చుచు రాక్షసుండు రుధిరనది నీదుచుండిన విధము దోప. 74

గుణ టంకారము సల్పుచున్ నగుణుడై కోదండ రాముండు తో
డనె బాణమ్ముల నేడు వానిమెయి విండన్వేయ సల్లాడి నీ
తను నంకంబున నుండి డించి ఘన యుద్ధం బాడె శూలాన ధీ
65 కొని రామున్యమరూపరాక్షసుడహో క్రుద్ధుండు మిన్నంటుచున్. 75

66 సొంపుల కుప్ప యీ వనిత చుక్కల మించిన గొప్ప చుక్క నా
కొంపకు వచ్చి నేటి కొనగూడిన జ్యేష్ఠ మదీయ మాత నే
నింపుగ నీమె నెత్తికొని యిప్పుడ జ్ఞానిగ మారినాడ నా
67 సొంపటియున్న యీతనువు క్రుక్కగబొందెద దొంటి రూపమున్. 76

భక్తిని బూజసల్పి బహుభంగుల వేచితి జూడ నీ పరా
శక్తిని నేటి నెత్తికొన జాలితి మాతను దివ్య దర్శనా
సక్తి ఫలించె గాని నను జంపరు రాఘవు లీమె ముందు దా
68 భక్తులయార్తి జూడని కృపామయి,యేనెటుగాంతు మోక్షమున్. 77

ఈమె నిటనుంచి వారల నెత్తికొంచు వన్యపద్యంబునకు బోయి వధ్యుడనయి
ముక్తి గనువాడ నని యెంచె బూర్వజన్మ సంస్మృతిని గాంచి సీతమ్మ స్పర్శవలన.

69 అని లో లో దలపోసి రక్కసుడు దేహంబెల్ల బెంచెన్ రణం
బున మేనంగడు గ్రుచ్చుకొన్న విశిఖంబుల్ దేహము న్వీడి కూ
లెను నేలం దృటిమాత్ర శూలమును గూలెన్ నేలపై ముక్కలై
జననాథుండు రఘూద్వహుండు విడువన్ శస్త్రంబులెన్నింటినో. 79

70 శూలంబుం దెగగొట్టి దాశరథు లా శూరున్ మహాకాయునిన్
గాలుం బోలిన రాక్షసుం, దునుమగా ఖడ్గంబులం బూనుచున్
నేలం గూలగ గొట్టియుండియును వానిజంపగా లేరు వా
71 డో లీలందృటి గొగిలింప రఘువీరుల్ జిక్కిరా కౌగిటన్. 80

రామలక్ష్మణు లిర్వురు రాక్షస భుజబలమునకు బసిపిల్లల పగిది నైరి
72 యా విరాధుండు స్వీయభుజాగ్రసీమ లం దునిచి వారి బర్విడు నంతకంత. 81

తనదుఃఖమును జూచుటను విరాధుండు
తన రాఘవుల వీడు నని యెంచునేమొ.82 82

మూపుల మోసికొంచు రఘుపుంగవులం జను నా విరాధునిన్
భూపువి పుత్రి హస్తముల మోడ్చుచు నెత్తి నమస్కరించి స
స్నేహన నున్నదాని భుజియింపుము వీడుము రాఘవేంద్రులన్
నీ పని దీరునంతట ననెన్ విన వీరులు రామలక్ష్మణుల్. 83

పరుల కష్టంబులే తన బాములంచు దుఃఖమును గాంచుచున్నది, దుష్టదైత్యు
రాఘవుల నాత్మ దలపోసి రమణి సీత భీకరాటవిలో దిక్కులేక యుంట. 84

కౌగిలిలోన నున్న రఘుకాంతుల మూపుల జెట్ట బట్టి వే
వేగెడి ఘోరఘాతుక మృగేంద్ర వృకంబులు బెబ్బులుల్ సదా
మూగు వనీస్థలంబున కపూర్వ బలాతిశయంబుచేత దు
ర్యోగము మూడె నీవిని రఘూద్వహు లింక నశింపజేయరే ! 85

అనుచు నొకవంక నిజభక్తి గనుచు నేప్ప రాఘవులతోడ జనెడి యా రాక్షసుండు
వారి కపకార మొనరించు వాడో యనుచు సీత మఱియొకవంక గృశించుచుండె.86

అపుడు భీకర రాక్షసుండై నవాడు అంకమున దన్ను జేర్చినయంత సీత
కంప మొందదు తనబిడ్డ గన్నతల్లి యెత్తుకొని యున్నరీతిగా నెంచెనేమొ ! 87

కాని రాఘవులను మోయువాని గాంచి కంపమొందుచు దుఃఖింప గడగె సీత
పుత్రవాత్సల్యమున వాని యందు గతిని దలచియే యేమొ! కరుణాఢ్య! ధాత్రిపుత్రి

తనను భర్తను సమదృష్టి దలపడనుచు రాఘవుల కపకృతిసేయు రాక్షసుండు
చాండవి యామె యెఱిగియు గాలధర్మ మార్గమున బొచ్చు బిడ్డపై మమత గలిగి
తనువుకంపింప నేడె నా తల్లి యపుడు. 89

భాగవత దొక్కడుగు భగవంతు డొందు వారి డీకొనె వీడు నవ్వారిచెంత
నేనా లేను నీవిని బ్రోవ నెవరుగాని లే రనుచు బ్రేమ మూర్తియై ధీర వగచు.90

విరాధ వధ

పోవు వారల గనుచు వాపోవుచుండి దుఃఖమును బొందు సీతమ్మ దోర్బలుండు
రాఘవుండు జూచుచు జెప్పె లక్ష్మణునకు దైత్యు దేగు దారిదె తమదారి యనుచు.

దైత్యునిక జంపగాదగు తరుణ మిదియె యొంటరిగ నుండె సీత నే నోర్వజాల
ననుచు బరమాత్మ యాత్మజై గనెకి వ్యధను వెల్లడించెడి గతి సీత విభుడు వలుకు.

ఆర్తిఁ బడు నాత్మకై పరమాత్మ పొందు శోకమున నొప్పు రాముని శోకమంత
నాత్మ పరమాత్మ విడివడు నపుడు గలుగు దుఃఖమన నొప్పు సీతమ్మ దుఃఖ మపుడు
రహిని బరమాత్మ శుద్ధాత్మల గొని యసురు దేగ గని ముక్తిమార్గం బదే యనంగ
జ్ఞానిగా రాక్షసుఁదలంచి జానకియును జే మొగిడ్చెన యనదోఁచు సీతవిధము. 94
కష్టకాలాన మాత్రమే కలుగు దొలుత నల భరన్యాస మాత్మకు నవలస్వాను
భూతి స్థిరపడి ముక్తిని బొంద గలుగు సీత యప్పుడు భరన్యాస సిద్ధి నుండె ! 95

చుట్టును గ్రూరజంతుతతి చుక్కల నంటెడు వృక్షసంతతుల్
గుట్టలు పుట్టలుం బులుఁగు కూఁతలు భీకరదృశ్యయుక్తమౌ
నట్టడవిన్ విలంబడియె నారి ధరాత్మజ ధర్తలేక య
ప్పట్టున దిక్కులేని యొక పక్షిగ రామపరాత్మ దీక్షమై. 96

దిక్కఱియున్న జానకినదే పరికించుచు వెన్కఁజూచుచున్
రక్కసిమూపులం జనెడి రాముఁడు లక్ష్మణుఁడంత నొండొరుల్
జక్కగ సైగఁ జేసికొని చంకలఁబట్టి విరాధు బాహువుల్
ముక్కలు ముక్కలౌచు వనభూమిఁ బడన్ఁదెగఁగొట్టిరంతటన్. 97

క్రిందఁబడి బొబ్బలిడుచుండి ఘీంకరించు నసురు పైఁబడి రాఘవు లతనిఁబట్టి
యెముకలన్నియుఁ బిండిగా నెగురునటుల ముష్టిఘాతంబు సేసినఁ బోవ దసువు.
బ్రహ్మవరవిధాన రాక్షసుం డీల్గఁడు కటకు కత్తులు విశిఖంబు లతనిఁ
జంపఁజాల వెంకఁ జంపుట యెల్లవి దైత్యుఁ గోతిఁ బెట్టిఁ దలఁచినారు. 99
మరణమొందఁ దలఁచి వరబలుం డాతఁడు పూర్వపుణ్య వశతఁ బురుషుఁ దాకి
కౌగిలించునంతఁ గాంచుచు జ్ఞానమ్ముఁ దాను జచ్చురీతిఁ దానె తెలిపె. 100
దాశరథి వీవని పురోషోత్తముఁడవనుచుఁ దెలిసికొననైతిమోహానఁ దెలివివచ్చె
రామ ! కౌసల్య సుప్రజారామ! యిపుడె విన్నుఁగన వేచియుంటినో నీరజాక్ష!

ఆ మహాభాగ సీత మహాయశుండు లక్ష్మణుండు వారల జన్మలక్షణములు
విదితమాయె నారాయణ ! విదితమాయెఁ బూర్వరూపంబు మిముఁగని పొందనుంటి.
గోతిలోఁబెట్టి యీమేనుఁ గోతిబూడ్వ దానఁజచ్చెడివాడ నందాకఁ జావ
నంత శాపవిముక్తియై యెఁరువాడ బరమపావన ! నీ చేతబడుటవలన. 103

కొలువునకు బోక రంభతో గూడియుండు కారణమ్మున ధనదుండు కసలి మున్ను
నన్ను శపియించె రక్కసినై జనింప శాపవశమున రాక్షస జన్మమెత్తి. ... 104

అచటనుంటిని తుంబురుండనెడివాఁ బురుషసింహ ! గంధర్వుఁడ దొక్క పొక్క-
యంత విలపించు ననుగాంచి యా కుబేరుడే విముక్తి మార్గంబు నాడిటు వచించె.

దశరథ పుత్రుడౌచు నవతారము దాల్చి రమాధవుండు స
ద్యశము వహించు వాడు సకలావని నాథుడు భార్యగూడి నీ
వశుడయి విన్నుఁజంపు వనవాసము సేసెడి కాలమందు నీ
దశ యలనాడు మాసెడి యథావిధిగా నిజరూపమొందగన్. 106

ఓ పరంతప! శాపంబు బాపినావు నీ ప్రసాదంబు లభియించె నీ ప్రపూత
హస్తముల శాపముక్తుండ నైతి నింక జనెడివాడ శ్రీరామ! స్వస్థానమునకు. 107

అర్ధయోజన మేగ నట నొక్క మౌని
స్వార్థ వహీనుండు శరభంగుఁ డుండు. 108

శ్రేయంబు మీకగు సేవింప నతని
నాయన ధర్మాత్ముఁ డమిత తపస్వి. 109

రవిచంద్రులను బోలి రాజిల్లువాడు
భవదీయ శుభమునే భావించువాడు. 110

అని పల్కి రక్కసి తన మరణమ్ము
వెనువెంటఁగోరెను వీరరాఘవుని. 111

భూ బిలంబున బూడ్చుట పుణ్యపథము రాక్షసులకబ్బుగాదె శ్రీ రామచంద్ర!
దాన గోతిఁబెట్టి మీ దాసవునకు బూడ్చినమఁగాని ప్రాణమ్ము పోదు సుమ్మి. 112

అనసంత సౌమిత్రి యా ప్రక్క నొక్క
వెనుగోయి త్రవ్వె రాముని యాజ్ఞఁబట్టి. 113

అనుజుండు దానునాయసుర దేహంబు
గని విధిఁ దలపోసి కదతేర్పఁబూని.

గోతిలో బడద్రోసి గొంతుక నొక్కి
పాతి శిలల మట్టి వానిపై వైచె. 115

ఆ సమాధి నపుడె యతిసుందరుండు
భాసించి రాముని ప్రార్థింప గడగె. 116

## తుంబురునీ సంస్తుతి

జయ జయ జయ జియ జానకీ నాథ !
జయ సాధు జననుత ! జయ పరమేశ ! 117

జయ విశ్వ! జయ విష్ణు ! జయ జయ రామ !
106 జయ దుష్ట శిక్షక ! జయ సాధు రక్ష ! 118

జయ మంగళము రామ ! జయ మంగళమ్ము
107 జయ మంగళము సీత ! జయ లక్ష్మణార్య ! 119

ఓ నీలాంబుద కాంతి కాంత! వరదా! యోపద్మపత్రాక్ష! యో
108 మౌనీంద్రౌఘ మనోంబుజభ్రమర! ధర్మార్థావతారా! సదా
నానా రూపవిహార! విశ్వ! సకలా! నాకప్రియా! రామ! ల
క్ష్మీనారాయణ! తావకీన పదముల్ సేవింప దీవింపుమా! 120

109
భవబంధమ్ము తెగన్ త్వదీయ పదసేవారక్తి విన్ నా హృదిన్
భవదీయ స్మృతి వీడకుండ విలుపన్ వాక్కెప్పుడున్ భక్తిమై
110 స్తవమున్ సల్పగ నీ చరిత్ర: విన శ్రోత్రంబుల్ సదా నీ కథో
ద్భవ నాదంబునె నీప్రదక్షిణము సల్పంగాళ్ళు దీవింపుమా. 121

111 అను తుంబురుం గాంచి యా రాఘవుండు
చననొప్పు స్వర్గంబు స్వస్థాన మనెను. 122

.112 నీ రజస్తమములు నేడె వీడంగ
మాతు దీవిక జ్ఞానసహితుండ వౌచు, 123

113 నను జూచుటను ముక్తి కను దీవు తుదకు.
అను వరంబొంది విద్యాధరుం డేగె. 124

కని విరాధుని చావు గగనమందుండి
మనసార సంతోష మగ్నులౌ సురలు. 125

ధ్వని విమ్రోగించిరి దేవదుందుభులు
115 భువి మారుమ్రోగుచు మోదంబుఁ దెలుప. 126

వనమెల్ల కాంతిమై వర్ధిల్లు వింక
16 మనుచుండు విడి భీతి వని జీవకోటి. 127

వృక్షాలు శిలలును వీడెగా భయము
రక్షింప రాముండె దక్షుడౌ ననుచు. 128

ఆ చరాచరమెల్ల నావనీ స్థలిని
గాచెడి వాడునుఁ బ్రోచెడివాడు. 129

రఘురాముఁడనుచు శరన్యాసమూను
నఘవిదూరుని రాము నాత్మలో నునిచి. 130

తమ శరన్యాసంబు దగనొంది యడవి
గమియించు శ్రీరాము గని ముని వితతి. 131

కైమోడ్చి సద్భక్తి గరమనురక్తి
నా మహామహితాత్ము నాశీర్వదించె. 132

భువిజాసమేతుడై పోవు సోదరులు
రవి చంద్రులను మాడ్కి రహినుండి రపుదు. 133

## ఆశ్వాసాంత పద్యములు

కర్మయోగంబె పురుషలక్షణ మటంచు నీవు జూపిన దారియే నీరజాక్ష
ఫలిత మాశింపకయె కర్మ సలుపు బుద్ధి ఆత్మపరిణతి గనకుండ నలవడు నొక్కొ.

ఫలిత మాశించియే కర్మ సలుపుచున్న బలిత మొనగూడు నొక్కొ నీ చలువలేక
పురుషయత్నంబు వ్యర్థ మెప్పుడు నిజంబు త్వత్కృపాలేశమైన సంభవము గాక.

నిన్నే నమ్ముచు నాత్మలో సతము నిన్నే ధ్యానము-జేయ, రా
మన్నా! ఆర్తుల గావ సిద్ధమయి రావా నీవు? సర్వార్పణం
బెన్నన్ సాధ్యము గాని వారి సహితం బీవే దయం బ్రోవవా?
తెన్నుంగానని యట్టి మూర్ఖమతికిం దె న్నీవెగా, రాఘవా! 136

హరి హరియంచు నొక్కతఱి నైహికమున్ విడువేళ బల్కుచే
నరి దురితాత్ముడైన హరి సన్నిధి సేరునె గాదె! రామ! స
త్పురుషులు రామనామ జపమున్ సతతం బొనరించువారు, నీ
దరిగనలేరె సంచిత విధంబున బాములు బొందుచుండియున్! 137

తపసులె యోగసిద్ధి సుకృతాత్ములె మోహవశాతుత్ములైరి, నీ
వపువును జూచునంతటనె పామరులైన గృహస్థు లెట్లు కా
మపరులు గారు? సుందరతమంబగు రూపము గాంచునంత ది
వ్యపురుష! అయ్యదే ప్రకృతి యాట, శరణ్యము నీవెకావెకో! 138

## ద్వితీయాశ్వాసము సంపూర్ణము

ఇది శ్రీగోవింద రామాయణమున రక్షకరామకావ్యంబున ద్వితీయవిమోచనా
శ్వాసము సంపూర్ణము.

# శ్రీ గోవింద రామాయణము

## రక్షకబృందం

### ౩. పరిత్రాణాశ్వాసము

పుట్టుచు యుగ యుగములఁ జూ పట్టుచుఁ దాపత్రయంబు పరిణతి, భువిఁ జే
పట్టుచు శిష్టుల, దుష్టులఁ గొట్టెవె ధర్మంబుఁ బూనికోమలదేహా!

శరభంగ మహర్షి

వసిఁజని యామడన్నర విశాంపతిపుత్త్రులు జానకీయుతుల్
ముని శరభంగు నాశ్రమము పొంతకు జేరిరి, రాముఁ డంత నిం
టిని దన తేరు వీడుచు వడిన్ మునిఁగూడుచు మాటలాడు నిం
ద్రునిఁగని చూపెఁ దోడునకు రోదసిలో రథమున్ సురాళివిన్.

చూపుచుఁ దెల్పుచున్ సురల సొంపును సీతను దమ్ము నచ్చటే
యాపుచుఁ దా నొకండె చనె నామునిఁ జూడఁగ నింద్రుఁడింతలో
దాపున కేగుదెంచు గుణధాముని రాఘవుఁగాంచి యంతటన్
వే పయనంబు సేయఁ దలపెట్టుచు మౌనికిఁ బల్కె నమ్రుఁడై

తపసి? త్రికాలవేత్త? యవతారముఁ దాల్చినవాని రాము నే
విపు డిటఁ గాంచి వాని పరమేశ్వర తత్త్వము వె డింపకే
రిపుతతి నాశనమ్ము నొనరించిన పిమ్మట జిష్ణు వి వున్
నృపకులదీపకుం గనుదు నేనని యేగు సురేశుఁ  తటన్.

వాసవుని పోకఁ గాంచుచుఁ బార్థివుండు జానకీ లక్ష్మణులఁ గూడిమౌని మ్రొక్కి
యతిథి సత్కారములఁ బొంది యడిగె నతని నాకనాథుంపు ముని గను రాకకతము

జానకీ సహితుని జనరాము రాము
నానందమున గాంచి యామౌని పలుకు 6

బ్రహ్మలోకంబునకు నన్ను రమ్మటంచు పిలువ వచ్చెను వాసవు పిలుపు నెంచి
పోవ దల పెట్టియును పోవ బురుషసింహ దాపునందున్న నిను గాంచ దలచి నేడు
ఆత్మవేత్తలె పొంద నౌనట్టి పథము: సుగ్రతపసికి దొరకు మహోచ్ఛ పథము
దేవతా సేవితంబైన దివ్యపథము రాఘవ పదాబ్జ దర్శన ప్రాప్తి కెనయె?

క్షణమాత్ర మిట నుండు జాగులే దింక
తనుమయ్య కృపతోడఁ గంజాక్ష నన్ను. 21

అనుచుం బేర్చి చితిన్ సమంత్రకముగా నాజ్యంబునందుంచున్
మినుముట్టన్ జ్వలితాగ్నిహోత్రశిఖ భూమిన్ వ్రాలి 'నారాయణా'
యని సీతాయుతు మ్రొక్కి మౌని యపుడా యగ్నిం బ్రవేశించి యా
యినవంశోద్భవు సంస్మృతిన్ నలుపు వహ్నిన్ దగ్ధమై పోవుటన్. 21

అట్లు శరభంగుఁ డాజ్వలితాగ్నిఁజొచ్చి భస్మమై కుమారకురూపుఁ బడసి లింగ
దేహమున నూర్ధ్వలోకాలఁ దిరిగి దాటి వాని నప్రాకృతపరమపదముఁ జేరె. 22

బ్రహ్మతోఁ గూడి చేరక బ్రహ్మపదము ధాత్రిజారాఘవులఁ జూచి తనివిదీర
ద్వంద్వముల దాటి ముక్తజీవాత్మ యరిగె నఖిల పరమపదంబున కడ్డు లేక. 2[illegible]

లింగరూపంబు భంగమై వింగి తవల కరిగి యణుమాత్ర జీవాత్మ యక్షయగతి
పరమపద మందుకొని యందు వరల,స్వాగతంబిడియె బ్రహ్మమునికి పితామహాండు

## శ్రీరాముఁడు మునుల రాక

పావన రామురాక శరభంగునిపోకయుఁ జుట్టుఁబట్టులం
దా వనవాసులౌ మునిజనాళు లెఱింగిరి గుంపుగుంపులై
భూవరుఁ జూడవచ్చిరి ప్రభుండును వారల కెల్ల మ్రొక్కి స
ద్భావముఁ జూపి కోరెఁ దెలుపం గుశలంబును వారి నెల్లరన్. 2

ఆహారమే గొననట్టివారలు వాయు
భక్షణ జేయుచు వరలువారు
నరకంబె ద్రావుచు నుర్విపై మనువారు
నూర్ధ్వరేతస్కులై యున్నవారు
నిదఁ గాంచనివారు నిర్వికల్పసమాధి
బ్రహ్మతేజంబుతోఁ బరగువారు
పంచాగ్నిమధ్యాన పవలె గ్రీష్మమునందు
యోగనిష్ఠను బొంది యుండువారు.

వివిధ మంత్రాలసిద్ధిచే వెలయువారు వింగినేలల నడిమింట నిలుచువారు
బ్రహ్మతేజస్సు గల యోగపరులువారు పెద్దవిఁ గాంచి ప్రణుతించి పలుకువారు.

మిమ్ముల మే మెఱుంగుదుము మేదినిభారముఁ దీర్ప దైత్యులన్
వమ్మొనరింపగా భువికి వచ్చిన శ్రీహరి వీవు సీత నీ
కొమ్మయె యాదిలక్ష్మి యతికోమల లక్ష్మణుఁ డాదిశేషుడౌ
నిమ్మహి ధర్మరక్షణము నే యొనరించుట నీ ప్రతిజ్ఞగా. 27

ధర్మముఁ దీర్పనెంచి యవతారముఁ దాల్చుట యొందు పాలనా
కర్మముఁ బూను టొందు నరకాంతునకుం దనయుండ వౌచు నీ
మర్మమదేదియేని నగు మాపతివౌటను రాజువౌటనున్
ధర్మము నెత్తుమీ ద్వివిధ ధర్మ మొనర్పఁగ రాఘవా! నృపా! 28

పన్నిడుచుండి రారవవిభాగము రాబడినుండి పాలితుల్
నిన్ను నుతించుచున్ మునులు నీకయి నల్ప తపోధనంబునం
దెన్నఁ జతుర్థభాగము నరేశునకుం గలదయ్య దాన నా
పన్నుల మమ్ముఁ బ్రోవఁదగు భారము నీయదెగాదె రాఘవా! 29

నాథఁ నీవుండఁగా మే మనాథలవలె రక్కసులపాలఁ బడివాము దిక్కులేక
మునుల పీన్గుపెంటలఁ గనుమోయి రామ రమ్ము మా యాశ్రమంబులవమ్ము గనుము.
పంప మందాకినీనదీపరిసరాలఁ జిత్రకూటాద్రిపై నివసించు మునుల
రాక్షసులు చంపివేసిరి రామచంద్ర దండకనుఁగూడ మితిమీఱె దైత్యహింస. 30

సర్వలోకశరణ్య నీ శరణుఁ జొచ్చు మమ్ము రక్షింపుమీ నిను నమ్మువారి
'నన్యథా శరణం నాస్తి' యనెడివారి మునుల జీవంబులకు రక్షఁ బూను మింక. 32

ధర్మసత్యంబులు నయనద్వయము నీకు నవియ మూర్త్న తేజంబున నలర నటవి
ధర్మ మూనుచు నెత్తుమీ ధర్మమింక రాక్షసవినాశ మొనరించు దీక్షఁ బూని. 33

వచ్చితిఁ దండ్రియాన వనిఁ బాలనసేసెడి ధర్మమూని నే
నిచ్చటఁ గాంచగల్గితి మునీశ్వరులన్, గని వారి రక్షణం
జొచ్చు సుధర్మమౌ సుకృతిఁ జూరఁగొనం గలవాఁడ నింతకున్
హెచ్చగు ధర్మ మొండు గలదే? భవదీయుఁడ ధర్మ మెత్తెదన్. 34

సాధుజన రక్షణము శిరసావహింతు మీర లిచ్చెడి యాజ్ఞల మీర నెపుడు
దుష్టరాక్షస సంహారనిష్ఠఁ గొనుదుఁ గాంచుఁ డస్మదస్త్రముల పరాక్రమము నింక. 35
వనికి యాదృచ్ఛికంబుగ వచ్చినాఁడ నాత్మకారణమాత్రాన; నడవియందు
రాక్షస వినాశవ్రతదీక్షఁ గొంటి నిదియ కారణమౌ వని నే వసింప. 36

అనుచు నా మహామునికోటి కథయ మొసఁగి దైత్యసంహారదీక్ష సీతావిభుండు
జానకీలక్ష్మణయుతుండు చనె సుతీక్ష్ణు వీటికి మునిసమూహంబు వెంబడింప. 37

సుతీక్ష్ణుడు

జలమయవాహినుల్ గడిచి సాంద్రవనిన్ మహితోన్నతంబునై
సలిలధరం బనందగిన శైలముఁ గాంచుచు దానిచుట్టునుం
గల ఫలపుష్పవృక్షచయకాననమందు వివిక్తమౌ స్థలిన్
మలిన మహాజటాధరుని మౌనిని రాముఁడు గాంచె నంతటన్. 38

మునికి మహాప్రసిద్ధున కమోఘతపోమయవృద్ధజీవికిన్
వినతి యొనర్చుచుం బలుకు వీఁడు రాముఁడు-ఓమహామునీ!
నినుఁ గనవచ్చె రాముఁడు వనిన్, నతి సల్పుచునున్న వాఁడు దీ
వన లిడఁ గోరుచుండె భగవంతుఁడ దివ్య సమాధిసిద్ధుఁడా! 39

అను రామశబ్దంబు నాలించి మౌని
కనువిప్పి శ్రీ రాముఁ గౌగిటం జేర్చె. 40

వేచితి నీదు రాకకయి వీడక వందిన మేనువృద్ధతన్
నోచితి నేటికిం గన నినున్ భవదాగమనంబు చిత్రకూ
టాచలమందునుండి వినవయ్యె మదాశ్రమ మింక నాథనిం
జూచి ప్రపూతమాయె సుమసుందరరాఘవ స్వాగతం బిదే! 41

స్నానము పానమున్ విడిచి చాలఁ గృశింపఁగ మేనుయోగమున్
బూనితి నేండ్లు పూండ్లిటుగఁ బుట్టుక చావును లేని మోక్షముం
గానఁగ నేఁడె నీదు పదకంజములం గనులారఁ గంటి నిం
కేను మహాపరంపదము నే కనఁగల్గెడివాఁడ రాఘవా! 42

ధ్యేయా! నీ మహిమం బెఱుంగఁగలవా రెవ్వార లీ సృష్టిలో
మాయామేయజగంబె నిత్యమని సంభావించుచున్ నిత్యమున్
నాయాపుత్త్రగృహస్థరూపమున మగ్నంబై మలోపేత మీ
కాయంబౌ నను మోహపాశపశువిం గాంచం గృపన్ వచ్చితే! 43

సురపతి వచ్చినాఁ డిటకుఁ జూచి ననున్ వివరించె నా తపో
గరిమ సమస్తలోకములఁ గైకొని యుంటి నటంచు వాని నీ
పర మొనరించుచుంటి ప్రభువా! విహరింపుము భార్యఁగూడి యా
వరభువనాల దేవఋషి భాసురసీమలఁ దమ్ముతోడుతన్. 44

అని కర్మఫలమును జనకజాపతికి
ముని సమర్పించుచు మోదంబు నొందు. 45

కర్మఫలత్యాగిగా నొప్పు మునిని
ధార్మికుని మహాత్ము దాశరధిఁ గని 46

ఫలమపేక్షింపక సలుపు సుకర్మ
ఫలితంబు తనఁదానఁ బ్రాప్తించు నాకె. 47

కర్మఫలమును గోరక కర్మసలుపు వార లార్జించు సుకృతంబు వా రిడకయె
నేనె గైకొనువాఁడ సద్దాని నెల్లఁ గర్మయోగం బెఱింగిన ధర్మవిదుఁడ. 48

కానలో నివసింపఁ గాంక్షించు నాకు
ననువగు తా వొండు వినిపింపుమయ్య 49

మునిజనశేఖరా యని ప్రశ్నఁ జేయు
జననాధునిం గని ముని మారు బల్కె 50

చక్కని నా యాశ్రమ మిది యిక్కడ విహరింపుమీ మహేశ్వర రామా !
చొక్కపు మూలఫలంబులు పెక్కుగ లభియించు నతము పృథ్విజవిభూ ! 51

శాంతికిఁ బావలంబు జలజంతు సమృద్ధికిఁ బట్టుఁగొమ్మ వి
శ్రాంతి లభించువాడ, యిట రామ వసింపఁగఁ జెల్లు గాని వ
న్యాంతర మౌట ఘాతుకమృగావళి స్వేచ్ఛగ వచ్చిపోవుచుం
గొంత భయంబు మౌనులకు గూర్చెడి వేఱొక బాధ లే దిటన్. 52

అను మౌనీంద్రునిమాటలన్ వినుచు ధీరాత్ముండు విల్లెత్తి తూ
పును సంధించి యిదే మృగంబుల దృటన్ బోకార్తు నొందే శరం
బున దానన్ మృగహింస బొందవె వ్యధన్ బోనెంతు నిచ్చోట నుం
డను నే నీ కళిషజహేతువుగ గష్టం బొందగా జేతునే. 53

అనుచు దదాతిథ్య మారాత్రి బొంది
దిననాధు గనునంత ముని జేరి మ్రొక్కె. 54

చూడగ నెంతు నీ వని విశుద్ధమునీంద్రుల యాశ్రమస్థలుల్
వాడకు వాడకుం జనుచు ; వచ్చిరి మౌనులు చాలమంది నా
తోడుత, మందుకుం జనగ వారలు తొందరసేయుచుంట నీ
వాడను వీడ నుంటి మునివర్య యటం చనె హృష్టచిత్తుడై . 55

అనుచున్ మ్రొక్కఁగ రాఘవు డనుజన్ముని సీతగూడి యా ముని యంతం
దన చరణంబుల దాకిన జనవంద్యుల గౌగిలించె సఖ్యం బొప్పన్.

విల్లు నెత్తుట దాల్చుట వింటిపూజ నారితేరిన జానకి యాయుధములు
రాఘవులచేతి కందిచ్చె రాజసుతులు వారు వానిని ధరియించినార లపుడె.

చను మీ రాఘవ ఛాయవోలె సతియున్ సౌమిత్రి వెన్నంటిరా
వనమం దెట్టి యరిష్టముం గనని త్రోవం బోవుచుం జూచు మీ
మునిబృందంబుల యాశ్రమస్థలుల సొంపుం దండ్రి! పుణ్యాటవిం
జనుద్రోవన్ మఱియొక్కమారు నినుగాంచం గోర్కెరా వేడెదన్.

అని ఋషి యిడు దీవన గొని మునికి ప్రదక్షిణ మొసర్చి ముమ్మరు గానన్
జనుచుండిరి సూర్యుడు మింటిని బైకెగయువేళ తీవిగ దీప్తన్.

జానకి హితవు

రమణీయపుష్పితారామసీమలు లతా
పరివేష్టితంబులు ధరణిజములు
ధరణిజాగ్రంబుల దనరారు పక్షులు
లలి మింట బారెడి పులుగు జతలు
పులుగుల రాకపోకల యొత్తిడిని రాలు
పూవులు పరిసిన పూలతావి
పూతావి వెదజల్లు లేతగాలులు మయూ
రాళిరుతయుత మందానిలంబు

మందమందానిలంబు సంబంధ మొంది మెల్లగా బుట్టి నడయాడు పిల్లయలలు
గల సరస్సులు సెలయేళ్లు గహనగతిని ప్రకృతి తనసొంపునుం జూపుప్రభునకపుడు.
సహజశాత్రవజీవులు సఖితతోడఁ గలసిమెలసి వసించుట గాంచుచుండి
కఠినతరభూమిపై వని గాలినడక బోవుచున్నారు రాట్సుతభూపసుతులు. 61

సహజ శత్రుత్వ వర్జిత జంతుతతుల శాంతపక్షిగణంబుల శ్మ్రజ గనుచు
దివ్యగుణరూపదీప్తులఁ దేజరిలుచు ధనువు జేగొన్న రాఘవు ధర్మ మెంచు. 62

చూడఁగ మౌనివోలె నతిసూక్ష్మసుధర్మపరుండ వీవు నె
వ్వాడిలలో ప్రయాణ్ణవనవర్జితుడో యల వాడె సిద్ధుడౌ
వాడు గ్రహింపగా గలుగువా డతిసూక్ష్మసుధర్మమున్ సదా
వీడ దహింస వాడు కడు వీరుడుదారుడునయ్యు రాఘవా! 63

అనృతపు బలుకు పాపమౌ నన్యుభార్యే నపహరించుట పాతక మంతకంటె
56 వైర మనుమాట లేకయే పగ వహించు టన్నిటను మిన్నయౌ నట్టి యఘముగాదె.

అనృతము నాడ వెప్పుడు బరాంగన గూడు నపేక్ష లేదు భా
57 ర్యనె యెద నెంచువా డవును నయ్యు విరోధము లేనియట్టి వా
రివి దునుమాడు దీక్షను జరింప బ్రతిజ్ఞ వహించి తేల యీ
మునిజనరక్ష రక్కసులమూకల జంపెడి హింస బూనుదె ! 65

ధర్మము నాలుపావముల దప్పక బూనెదు సత్యమూర్తి! దు
58 ష్కర్మ వహింతువే? విమలసత్యపరాక్రమ! రాక్షసార్థమై
ధర్మము బూనితే! విశితధర్మవిముక్తశరంబు లెట్టి స
59 త్కర్మము వొంద నున్నయవి దాశరథీ! వని రాగతం బిదా? 66

తమ్ముని గూడి విల్లు గొని ధాత్రి ద్యజించుచు దండకాటవిన్
ద్రిమ్మరివోలె జేరుట కిదే పని గాదగు! సత్యదీక్ష క్షే
మమ్మును లోదలంప హృది మానక చింతకు జిక్కుచుండె స
త్య మ్మిది దండకావని విహారము నా కహితంబు రాఘవా! 67

అగ్నిహోత్రంబుచెంతనే యమరియుండు
కట్టెలకు దేజ మధిక మౌనట్టిరీతి
క్షత్రియునిచేత విల్లుండ క్షాత్ర మధిక
మౌను గాదె రాఘవ! లక్ష్మణాన్వితుండ ? 68

దండకావనిలోన దైత్యులం గనిన
చండపరాక్రమా ! చెండవే వారి. 69

వైర మొకింతయుం గననివారలపై గసి గాలుద్రవ్వదే
పోరగ వారి జంపు తలపుం బ్రకటింపదె నీదుతీరు! తూ
ణీరము విల్లు బూనదగునే తప మూన దలంచువారలో
శ్రీరఘురామ! రమ్యగుణశీల! కృపామయ! సత్యపాలకా! 70

ధనువు ధరించు టేడ? వనధాత్రి జరించుట యేడ? క్షాత్ర మే
డను? దప మేడ? నెట్టిది ఫలంబు? పరస్పరమున్ విరుద్ధముల్
వనమున వాసకాలము తపంబున బుచ్చుట దేశకాల ధ
ర్మవిరతియైన పూజ్యగతి రామ! తపం బొనరించుటే తగున్. 71

శస్త్రసేవనమున రామ! సంక్రమించు పాపబుద్ధియె క్షాత్రంబు బట్టదగును
మన మయోధ్యకు మరలిపోయిన తదుపరి యంతవఱకు మనకు దపచ్చింత

ధర్మ మిచ్చు ధనము ధర్మంబె సుఖ మిచ్చు ధాత్రి సకల మబ్బు ధర్మమునసె
సుఖము సుఖము నీయ సుకర మెప్పుడు గాదు కష్టసాధనయె సుఖప్రదంబు.

మనస్తె నుజికెడు దైత్యుల ఖననము సేయంగ వచ్చు కాకుత్స్థవరా!
పచివడి వైరము గొనుదే తనువున ధరియించి యాయుధంబుల వనిలో

మునిని నీముందు హింసించు దనుజు బట్టి
ఖనన మొనరించుటయది సత్కార్మ మగును
మౌనులను బాధపెట్టెడివానిఁ గూడ
బాణమునఁ గొట్టఁగాఁ దగు పార్థివేంద్ర!

కాని, రాక్షసుం డగుమాత్ర వానిఁ బట్టి చంపఁగొను దీక్ష కాదె హింసావ్రత
మునివరులు కోరుటనె దీక్ష బూనదగునె కాదె లేనిపోని పగ పునాది యదియ.

రామ వధింతువే నిరపరాధుల రాక్షసులైనమాత్ర!నే
కామము లేని నీవ యనుకంప గలట్టి మహాత్మ! చంపగా
నామది యిచ్చగింపదు రణంబున జంపుట మౌనిహంతకున్
క్షేమము ధర్మ మెంచ నటు సేయుట వీరుల ధర్మమౌగదా!

దాంతమూర్తి ధర్మంబునే తలపు మిచట ధర్మసత్యంబు లను రెండు కర్మలందు
నొకటి నెడబాసి వేరొండు నుండబోదు సకల మెఱుగు జగత్రయీ సార్వభౌమ!

మూడు లోకాల నెవడు నీ కీడు రామ? యబల లాడెడురీతిగా నంటి నేను
నీకు ధర్మోపదేశంబు నాకు దగునె స్త్రీచపలతను నాహృది జెప్పుచుంటి. 7

వినుపింతు రాఘవా! విను మొక కథను
ముని యొండు తప ముండె బూర్వకాలాన. 8

సతతంబు పుణ్యంబు సంతుష్టి నొందు
ఋతవాది పరిశుద్ధు డతడు సతంబు 81

ఆ మునితపమున కతిభయ మొంది
యే మిష నైన మునీంద్రుని తపము. 82

చెరుప దలంచుచు గరవాలము గొని
సురపతి వెడలెను జూడగ మౌని. 83

భటవేష మూనుచు బ్రహ్మమునీంద్రు
నటవిలో గని మ్రొక్కి యా నాకవిభుడు. 84

తన ఖడ్గమును దాచి తా గోర మఱల
దన కీయదగునని తాపసిం గోరె. 85

మాయమాటల విని మర్మముం గనక
యా యతీంద్రుడు ఖడ్గ మంతట గొనుచు. 86

ఏ నాడు భటు డెప్డొ కానకు వచ్చి
తా నొసంగిన కత్తి దా గొనునంచు. 87

కడు జాగరూకత గత్తి గాపాడ
విడువక దానిని గడుపు కాలంబు. 88

పరధన రక్షణభావంబుతోడ
స్థిరబుద్ధి బుకదీక్ష జెల్లించు మదిని. 89

ఏ కడ కేగిన నే కడ నున్న
నా కత్తి విడనాడ డా మౌనివరుడు. 90

కరవాలరక్షణ పరుడైన మౌని
మరచుచు దనదాను దిరుగాడు వనిని. 91

తపసి యయ్యు సతంబు ధరియించి కత్తి
తప మెల్ల క్రమముగా దగ్ధమై పోవ. 92

పొందెగా రౌద్రంపు బుద్ధినే యంత
కందక మన సెప్డు గావించు హింస. 93

కరముతో గోసెడి కాయల గసవుల
కరవాలమున గోయ గడగె వాడు
తనపాణి విఱిచెడు దర్భల సమిధల
కఱకుగత్తిని గొట్ట గడగె వాడు
మృగవార మెదురైన పెరదారి నడవక
ఖడ్గాన దఱుమగ గడగె వాడు
తపసు బలిమియందు దమి తప్పి చేనున్న
ఖడ్గశక్తిని బూన గడగె వాడు

సతము చేనున్న కత్తిపై రతి చెలంగ రౌద్రబుద్ధికి వశు డౌచు భద్రగతిని
వీడి హింసా ప్రవృత్తియే గూడుకట్ట బతితుడై నాడు శస్త్రసంపర్కగతిని. 94

హింసారతుండయి హింసించి పరుల
ధ్వంసమై తప మెల్ల దదనంతరంబు 95
నరకంబు పాల్పడి నాశంబు నొందె
పరమౌని శస్త్రసంపర్కంబు నొంది. 96

ఆయుధసాంగత్య మనలసంగమమె
ధీయుతుల్ పెద్దలు తెలుపరే యిటుగ. 97

ధర్మ ముపదేశ మొనరింప దగనిదాన మనకు హిత మెంచియే యిట్టి మాట నంటి
తమ్ముడును నీవు యోజించి ధర్మమేదొ దానినే యాచరింపంగ బూనుడయ్య ! 98

తోచినవిధాన నా హృది దాచకుండ
మనవి జేసితి జనవున వినకులేంద్ర !
శిక్ష గఱుపంగ బూన దీ సీత నీకు
ధర్మమూలము నీవెంచు ధర్మగతిని
నీ వెలింగిన ధర్మమే నేను నంటి. 99

ప్రేమరూపంబు దాల్చినరీతి సీత మధుర మృదుధర్మసూక్తుల మహితహితము
జానకీదేవి విజజన్మసరణి యంచు ప్రియుడు రాముండు విని తనప్రేయసి కను.100

భర్తృహితమతీ! మైథిలీ! పరమహితము పల్కినావు నాపై ప్రేమ పట్టలేక
నీ కులగుణజన్మములు పన్నె గను నట్లు ధర్మమును బల్కితివి నాకుదగినగతిని.101

ఆర్తు లెవ్వరు లేకుండ నవనియందు ధనువు ధరియించుటయె క్షత్రధర్మ మనవె
యీవె! నే నింక జెప్పె డిదేమి సీత ? శిక్ష నొసరాదె శరణార్థి రక్షకొఱకు ? 102

దండకారణ్యవాసులౌ తపసు లెల్ల నన్నె శరణంబు గోరరే తెన్ను గనక
'యన్యథా శరణం నాస్తి' యనరె వారె తపము న నసురుల దునుమ దక్షులయ్యు.103

నిరపరాధులె దైత్యులు? నేను రక్ష నీయ బాసను గొన్న మునీంద్రతతుల
బాధ పెట్టుచు నున్నారు వైరహేతు వదె మహాశ్రితుం విరోధి నణపవలదె ! 104

సోకు మూకలు తపసుల ద్రుక్కజేసి చంపి వారల భక్షించునరణి గనరొ !
'పరమగతి' నీవె యని నన్ను బట్టియున్న సాధురక్షణ నసురుల జంపువాడ. 105

రాచకొమరులు వీరలు రామ! మీరు,
నాథుడవు నీవె మాకు వనమ్మునందు
రామ! లక్ష్మణాన్విత! యిమ్ము రక్షణ మిప్పు
డనుచు శరణార్థులై వేడు నా ఋషితతి
రక్షణము బూన దగదె యో రమణి! నేను. 106

చిరకాలార్జితశక్తి నిన్ మునులు నా సిద్ధుల్ వ్యయింపం దలం
పరహింసావ్రతులై తపోమహిమ దుర్వారంబె యయ్యున్ నిశా
చరబాధం బడి క్రుమ్మగుచుండిరిగదా! శస్త్రప్రయోగంబునం
బరిమార్చన్ మునివైరులన్ నృపుడు సంభావించుటే ధర్మమౌ. 107

నేనె మదిచ్చ మౌనుల నవిం బరిరక్షణ సేయగావలెన్
గాని తమంత దామె కనగా నను వచ్చిరి వచ్చివారలే
కాన నిశాచరుల్ సలుపు కానిపనుల్ గడుజెప్పి రక్షణం
బూనగ గోరియున్న మునిపుంగవులం ద్యజియింతునే సఖీ! 108

చేసి ప్రతిజ్ఞ మౌనులకు జేసెద రక్షణ మే నటంచు రా
కాసుల బోరునం దునుమగా గొనినాడ సుదీక్షదండకన్
గాసిలకుండ యోగులు సుఖంబుగ నుండ దపంబు బూని యా
బాసను వీడి సత్యమును బాయుదునే జనకాత్మజాతరో! 109

ప్రాణమునైన బాయుదును భార్యను సీతను గూడ వీడగా
బూనగలాడ లక్ష్మణుని బొమ్మనజాలెడివాడ గానినే
నూనిన సత్యమున్ విడువ నోపను సత్యముకంటె విష్టమే
దేనియు గాదు నాకు భువి నింతకు బ్రాహ్మణులం ద్యజింతునే? 110

త్రిభువనాల సుందరివౌట రిపుచయంబు తమకు దా బుట్టు మరతువే ధాత్రిజాత!
యాత్మసంరక్షణముఁ బూనుటప్పు డైన నవసరముగాదె యీ ధను వబల! చెపుమ!

మునివాడ విలు దాచుమని నీ తలంపు
పనిరాదొ! దానితో వనమందు మనకు. 112

ఆర్తనాదంబు వినరా దటంచు నీవె పలికినా విప్పుడే గద! పనిని గూడ
రాజధర్మంబు మరువఁగారాదు మగుల తపసులకు దిక్కు నేనె కా ధాత్రియందు!

ప్రేమయే నీదు రసంబు బిడ్డలగతి జీవతతినెల్లఁ గనుదాన వీవ యౌట
హింసకుం బూనవలదని హెచ్చరింప దగవె నాహితంబునె కోరుదాన వౌట. 114

ప్రియులకే చెప్పఁ జూతు రప్రియుల నెవరు చెప్పనెంతురు ? స్నేహానఁజెప్పినావు-
అదియు నీపరిశుద్ధాత్మ కనువుమాట మఱియు నా సహచారిణి వరయ నౌట. 115

అనుచు ముద మొంద మైథిలి యనఘ సీత తమ్ముడును దాను విల్లుల దాల్చి చేసన
మువ్వురును దండకాటవీపుణ్యసీమ బోవుచున్నారు రమ్య తపోవనాల. 116

లోకబాంధవు డన మునిలోక హితుడు రాఘవుడు పోవుచుండె నా రమ్యవనివి
నపుడె యోంకారమే రూపమంది యడవి వెడలుచున్నట్లు మువ్వుర విధము తోచు.

రాముడును వెన్క సీతయు లక్ష్మణుండు
అ ఉ మ కార వాచ్యులగతి నటవియందు
జనుచు ఋష్యాశ్రమంబుల గనుచు గనుచు
నొకరి వెనువెంట నొక రుండి యొక్కవిగతి. 118

అడవి జనుచున్నవారి పోకడ గనంగ నుర్వి ప్రణవంబు రూపంబు నొందినట్లు
మహితరాముండు సీత రామానుజుండు నోమ నగనొండొరుల వెన్కగా నొప్పువారు.

పులులున్ సింహములున్ గజంబులున్ బాముల్ దున్నపోతుల్ మెకం
బులు నానావిధమౌ విహంగతతులున్ ముమ్మందు సంచారమున్
నలుపం గాంచుచు వించు బక్షిరుతముల్ సాంద్రావనీమధ్యమం
దలపుం గాంచక బాటసారు లయినా రా రాజహంసోద్భవుల్. 120

వారలు దండకావని నివాసులు మౌనులతోడ బో చుం
జారుతర ప్రసూన నగసానువులున్ ఖగకంజయు కా
సారములున్ నదీ పులిన చారణ సారసచక్రవాకసం
సారములున్ వినోదగతి జాలగ గన్పడ జూచి చూచుచున్. 121

పంచాప్సర సరస్సు

ప్రొద్దు గ్రుంకువేళ బొడగాంచి రటు చని యోజనాయుతమగు నొండు కొలను
వివిధపక్షి జంతు నిభవాస్పదంబును సుప్రసన్నసలిల శుభయుతంబు. 122

వీరు పాడెడివారు కాసారతటిని లేరు గాని సంగీతంబు నీరమందు
వినఁగ నయ్యెడు శ్రుతిహితావిష్కృతమ్ము గీతవాద్యనిర్ఘోషంబు కెరలివినుచు. 123

ఆ పాటతీరున కచ్చెరువొంది
భూపాలసుతు లంత మునిధర్మభృత్తు. 124

వివరింపఁగోరి రా విపరీతరీతి
నెవరినిఁ గాంచమే యిచ్చోటఁ బాడ. 125

దివిజసంతతి పాడు తీరైన పాట
నెవరయా మునివరా! యీ పాడువారు? 126

అను దాశరథుల నుడి విని మునిజనవృద్ధుండు రామమూర్తికిఁ దెలిపెన్
మును పంచాప్సర మనఁగా గనుపిందుగఁ జేసే మాండకర్ణియె దీనిన్. 127

మాండకర్ణి యా తాపసి తిండి వీడి వాయు జల భక్షణంబున వారియందు
నిలిచి పదివేల యేండ్లుగ సలిపెఁ దపము దాన నగ్నిహోత్రాదులు తాపముఁగని.

మాండకర్ణి తపోవిఘ్న మాచరింప నప్సరసల సంపిరి వార లైదుమంది
పరమమునిఁ జేరి మన్మథవశునిఁ జేసి యతనిభార్యలై క్రీడింత్రు సతము కొలన.

ముని తపశ్శక్తి యౌవన పూ బొంది యందగత్తెల గూడి యీ యంబులందు
నీ తటాకాంతరంబున నిండ్లఁగ సలుపు సరస సల్లాప లీలల ధ్వనులివి. 130

కామినీ హస్త కలిత కంకణరంటు భూషణ ధ్వని మధుర సంభాషణములు
గీత వాద్య సరణి విటు చేత మలర శ్రుతిహితము గాఁగ శుద్ధచరిత. 131

ఆడ మడిఁ బడి వెళ్ళువాఁడు లేఁడు కనఁడో పాతాళలోకంబు మునియు నయ్యె
మాండకర్ణియు మగువల మరిగి యు ..ఁ విరగతులఁ బాసె సురతతి ప్రమద మొంద.

అని మౌని మాటల వినుచు రాముండు
చనె ముందునకు వని ముని తతిఁ గూడి. 133

ముని యాశ్రమంబులఁ గనుచుండె సతము
జనకజా సౌమిత్రులను వెంటఁగొనుచు. 134

మాయావేషచరుల్ సురారులు నశింపన్ ధర్మసంరంభియై
యా యా యాశ్రమ వాసియై మునుల రక్షార్థంబు నద్దిక్కాలం
గాయున్ భీతిఁ దొలంగి శాంతిఁ గని ముక్కాలంబు వారల్ ముని
ధ్యేయుండా సహజన్మ సంయుతుఁడు ధాత్రీశుండు దీక్షారతిన్. 135

ఒకటియు రెండు మూడు నెలలొక్కొకయాశ్రమ వాసమూనుచు
న్నొకటికి రెండు మార్లు మునులుండెడి వాడలకేగి యేగుచున్

శకలవనంబుఁ ద్రిమ్మరి నీశాచరులం దునుమాడుచుండె న
బ్లొక పదియేండ్లు రాఘవుఁ డహో విహరించెను దండకావనిన్. 136

వనవాసదీక్షయ మునిరక్షణంబు
జన రాముఁ డాశ్రమస్థలులయం దుండి. 137

పనిఁ బూని నెరవేర్చి పదియేండ్లు గడిపి
చనె సుతీక్ష్ణునిఁ జేర వెనుకకు మరలి. 138

సుతీక్ష్ణునికడకు మరల ఏగుట

మాట మీఱక ధర్మంపు బాటి తన్ను మరల గన నెంచి వచ్చిన మహితు గాంచి
యా సుతీక్ష్ణుండు ముదమొంది యతిథిపూజ సలిపి నమ్రుడై భక్తిమై బలుకదొడగె

స్వాగతంబిదె విశాంపతి రామా! త్యాగవీర! ధృతధర్మ! మహాత్మా!
యోగిరక్షణ సుయోగపరా! నీ యాగమంబున గృతార్థుడ నైతిన్. 140

దివిజాప్త! దాశరథి! దివ్యసుందరా! భవదీయ మంత్ర జప భాసురాత్ముడన్
భవనాశనవ్రత విభాయుతంబు లీ స్తవనీయ పాదముల దాల్తు నా హృదిన్. 141

వివిధ జలభాండములయందు పెక్కురగతి భాస్కరుడు దోచు చాందాన వరలు దీవు
రామ! నారాయణా! జగత్రయ పరాత్మ వివిధనామాల వెలుగొందు వేదవేద్య! 142

అన సుతీక్ష్ణుండు మునివర్గ మంత రాము బూజలను సల్పుచుండ సపూర్వ గతివి
జానకీ రామలక్ష్మణుల్ సంతసమున నట విడిసి యుండిరి సుతీక్ష్ణ నాశ్రమమున.

కొంతకాలంబు గడచిన యంత నొక్క నాడు రాఘవుండు సుతీక్ష్ణు గూడి తెలిపె
దనదు కోర్కె నగస్త్యుని తావు జూడ నాత దనుపమ బ్రహ్మర్షి యగుట జేసి. 144

ఆమాట లాలించి యా సుతీక్ష్ణుండు
రాముస కను గడు రాగంబు తోడ 145

సృష్టించి పోషించి చేడ్పాటు చేయు
శిష్ట తారణ మూర్తి! శ్రీనివాసుండ! 146

సత్త్వ రజస్తమో సహజ గుణాల
తత్త్వంబు దాటిన దశరథ పుత్ర ! 147

నీ నామ జపమున నిత్యంబు మనెడి
మౌనీంద్రు డాలడు మహితాత్ము డతడు 148

నాకు గురుండును నీకు దాసుండు
నోకు ముూకలు గల చోటె యయ్యదియు. 149

చిరకాల మాయెనే సేవించి గురుని
ధరణీశ! యీ దాస దాసుండు గూడ. 150

మీ వెనువెంటనే యీ వనమందు
త్రోవను జూపగ దోడుగ వచ్చు. 151

అన వార లప్పుడే యా ప్రభాతమున
జన సాగి రెల్లర మునులతో గూడి. 152

నడినెత్తి సూర్యుండు నడయాడు నంత
వడిబోయి చేరి రా వనమందె యున్న. 153

ఆ యగస్త్యభ్రాత యాశ్రమ స్థలికి
సాయుధ రాముండు సపరివారముగ. 154

కనుమేర దూరాన గాంచి యాశ్రమము
చనుచు నెల్లరు విన సౌమిత్రి కనును. 155

వాతాపి ఇల్వలుల మరణము - అగస్త్యమహిమ

ఇట సుదర్శను డెపు డెలమి వసించు
నటుపైని నొక యోజనానంతరమున. 156

తపముండువా డగ స్త్యమునీంద్రు డెపుడు
జపతపో హోమముల్ సతతమ్ము సలుపు. 157

ముని కుల గురు డాత డనుపమ యోగి
జనవంద్యు డాతండు సాధుసత్తముడు. 158

దక్షిణాపథమందు దప సున్న వారు
భక్షింప బడకుండ రక్షించె నితడు. 159

భక్షింప బూనిన భయద రాక్షసుల
శిక్షింప గల్గిన శ్రేష్ఠు డాతండు. 160

వాతాపి యొకడు నిల్వల నాము డొకడు
పూతాత్ములను దిన బూనిరి సతము 161

ఇల్వలుండు బ్రాహ్మణరూప మెత్తుచుండి
సంసత్కృతమును సంభాషించి శ్రాద్ధములకు
బ్రాహ్మణుల భోక్తలుగ నుంచి పరమభక్తి
నటన సేయుచు నుండె నీ యటవి యందు. 162

మేషరూపాన వాతాపి మెలగుటయును
దాని ఖండించి వండి శ్రాద్ధంబు నందు
భోక్తకిడుచుండుటయును నా భోక్తగుడువ
తమ్ముడిల్వలు డంత వాతాపి బిలుచు. 163

రమ్ము వాతాపి రమ్మిక రమ్మటంచు తమ్ము డిల్వలు డటు వాతాపి వినగ
మొండి వాతాపి భోక్తల పొట్ట పగల బయట బడువాడు చావగా బ్రాహ్మణ తతి. 164

విగత జీవులైన విప్రుల మాంసంబు నెల్ల నన్న దమ్ము లుల్లసమున
దినెడివారు భూమి దివిజుల పలువుర నిట్టిమాయ జంపు దిట్టలైరి. 165

ఆ యగస్త్యు డీ యసుర మాయల నెఱింగి తానె భోక్తగ వెడలె నా దైత్యుకడకు
నిల్వలుడు వాని మామూలు నెంచి మేక వలె జరించు వాతాపిని వండిపెట్టె. 166

రమ్ము వాతాపి రమ్మని అంకెవేసె
జీర్ణమగు గాత వాతాపి జీర్ణమగుత
మంచగస్త్యుండు త్రేన్చి జీర్ణంచుకొనియె
నసురు వాతాపి యసువుల నన్ని తృటిన 167

అకట నీ తమ్ముండు యమపురి కరిగె
వికట స్వరూపుండు వీడె ప్రాణముల 168

ఇంకేడ వాతాపి? యేల నీపిలుపు?
బింకెటు వచ్చు భక్షించితి నిపుడె. 169

అనుచు నవ్వుచు బలుకాడు నా తపస్వి గాంచికుపితుడై యురికె నగస్త్యుపైకి
నిల్వలుం డంత నాముని యీక్షితాల దనరు నేత్రానలజ్యోతి దగ్ధుడాయె. 170

నాటినుండియు నిట నీ వనంబు నందు రక్కసుల బాధ తొలగె నే రాక్షసుండు
ధైర్యము వహింప జాలడు దాక మునుల నిటు లగస్త్యుండు శాంతిమై అట వసించు.

అన్నదమ్ము లిట్లు హత్యచేసి మౌనివారమున్
దెన్ను మీటి యుండ దీవ్రమౌ తపోబలాన్వితుం

డెన్న నా నగస్త్యు డిర్వరన్ నశింప జేయుటన్
మున్ను లేని శాంతి బొంది రెల్లవార లా వనిన్. 172

మాయలమారి వేషముల మాయబలంబును హింస శక్తియున్
మాయు తపోబలంబున సుమా! యని చూపె నగస్త్యమౌని సే
సాయుధ శక్తియుతం దపము సాటిది కాదుకదా సుమిత్రపు
త్రా! యనుచుం జనెన్ వడిగ రాము డగస్త్యనివాస జేరగన్. 173

అతని సహజన్ముడు సుధర్ము నాశ్రమ మిది యెంత సుందరమై యుండె నీవనం బ
టంచు లోనొచ్చి మౌనిని గాంచి రచట దినకరుడు తేజు వీడుచు జనెడువేళ. 174

మునిని బూజించి యాతని పూజ బొంది గడపి యారేయి నట ప్రొద్దు పొడుచునంత
నా సుధర్ముని గని మ్రొక్కి యతని సెలవు గైకొని చని రగస్త్యుని గనదలంచి.

నల్లని మొయిళ్ళు వని నెల్ల నల్లినట్టు లాశ్రమాగ్ని ధూమపటల మలముకొనిన
యా వనాంతరమం దుదయాన నడుచు చుండిరి కనుచు మునివాట పొలుగునెల్ల.186

శ్రుతి హితమౌ పక్షివితతుల నాదంబు
సత్యోపదేశంబు సరణి జెప్ప
నన్యోన్యమైత్రిచే నలరారు మృగతతి
ప్రేమసందేశంబు పెంపు జూప
విట్టవిల్వగ బోయి వింగినంటిన తాళ్ళు
సద్వర్తన విధంబు జాటుచుంత
పన్నగావృత లతా పరివృత పాదపాల్
కష్ట సుఖాతీత కర్మ దెలుప
రమ్య దృశ్యంబు పరిమళ రంజకంబు నా, యనిర్వాచ్య శాంతి సువ్యాప్త వనము
దివ్య తేజోవిలాసినీ దేవత కిది యాటపట్టు అగస్త్య మహాశ్రమంబు. 177

ఈతడు మౌనికోటిగురు వీత దనూనతపోబలుండు వి
ఖ్యాతుడు వింధ్యపర్వత మహాగతి సడ్డినవాడు వృద్ధుడున్
వీతభయానురాగముల విస్రు డితం డిట వాసిమౌటచే
భీతి దొలంగి మౌనితతి స్వేచ్ఛగ నుండిరి దక్షిణంబునన్. 178

ఔర! మహానుభావుడు మహాతపమందు నిమగ్నుడీ తపో
నీధు డగస్త్యమౌని యిట నెక్కుమహర్షులు సిద్ధిబొంది రా

హారము వీడి దేవత లహర్నిశలున్ బలుమంది ముక్తి సే
కూర దపంబు సల్పెదరు క్రూరు లిటన్ వసియింప రెవ్వరున్. 179

హితము గుణసంగగల లోకహితుడితండు సత్పురుషహితరతుడు ప్రశాంతగుణుడు
శీఘ్రగతి సాధకుడు సిద్ధి జెందు నిచట నీ మహాముని యాశీస్సు లిచ్చుకతన. 180

ఓయి! సుమిత్రపుత్ర! మనకుండదగున్ బదునాలుగేండ్లును౦
బోయెడిదాక తక్కుగల ప్రొద్దు లిటన్ మునిసేవ సేయుచున్
శ్రేయమునే వినీతజనసేవితుడై యిత డిచ్చు; సర్వదా
పాయు నమస్తదోషము లుపాసన సేయగ నీ మహామునిన్. 181

అని చెప్పి సౌమిత్రి కంత రాముండు
తన రాక దెలుపగా దగునంచు మునికి 182

పలుకాడె యాశ్రమప్రాంగణమందు
దొలిసారిగా నగస్త్యుని జేరనెంచి. 183

ఆ సుతీక్ష్ణమౌని యా యగస్త్యశిష్యు డంత నీ
తానతిప్రియుండు తమ్ముగూర్చి యన్న, యానలో
వాసినెంచి మౌనివాడ జొచ్చి మ్రొక్కి సద్గురున్
బాసగాగ రామభద్రుమాట జెప్పె నమ్రతన్. 184

జనకసుతాభిరాముడు విశాంపతి కోసలనేతపుత్రకుం
డును రఘురాము డిట్టి వనిలో గురునాన జరించుచున్ ధరా
తనయయు లక్ష్మణుండును యథావిధి రా వెనువెంట జూడవ
చ్చెను మిము నాశ్రమాంగణము జేరి యటన్ నిలిచెన్ గురూత్తమా! 185

తారక మంత్రరాజ గుణతత్త్వము నెల్లర భక్తకోటికిన్
భూరియశుం డగస్త్యుడు సుబోధన జేయుచు నున్న వేళ నీ
తారమణీవిభుండె నిజదర్శన వాంఛితు డాశ్రమస్థలిం
జేరిన మాట విం చతడు చెచ్చెర నిల్చుచు బద్ధహస్తుడై. 186

ఏమి సుతీక్ష్ణ! నిల్వదగునే జనకాత్మజభర్త వాకిటన్
రాము ధరాసుతాయుతుని లక్ష్మణు వెంటనె తోడి తెమ్ము శ్రీ
రాముడె సర్వలోకజనరాముడు నన్ను నిరం గృపన్ సదా
యేమెయివాడు నీ వెఱుగవో పదె పొమ్మిక తెమ్ము రాఘవున్. 187

సీతాయుతుడై రాఘవు డీ తపసిని గాంచవచ్చెనే ధన్యుండన్
నా తప సిక ఫలియించున్ జేతుల జోడించి మ్రొక్క సీతారామున్. 188

ఏనాటికై నను నేను గాంచెదనొ
శ్రీనాథునని యిట్లు రేయింబవళ్ళు. 189

వేచియుంటిని యేండ్లు వేలకొలంది
పూచి నానాలతాపుష్పాల విప్పుడు 190

ఫలియించె తప మింక బండునా నోము
తొలివానిఁ దుదివాని లలిఁ జూతు నేడు. 191

అనుచున్ మౌని యగస్త్యుడు మనసారగ నెంచి రాము మౌనులు భక్తుల్
తనవెంబడి రా నెదురుగ జనియెను వినతి లలితునకు స్వాగత మొసఁగన్. 192

రా రా నా రఘురామచంద్ర! సుజన వ్రాతావనాలోల! దు
ష్టారిస్తోమలయార్థజాత! ఋతవీరా! నిన్ను నే మానుషా
కారుం గాంచగ వేచియుంటి నిట భక్తత్రాణ! నారాయణా!
శ్రీ రామాయుతు లక్ష్మణాన్వితు నినున్ సేవించితిన్ ధన్యుడన్. 193

తారక మంత్రరాజ గుణధర్మమహామహిమాన్వితుండ! వే
సారితిగా తపోగరిమ సారసనేత్రు నినుం గనంగ నా
భారము వో ప్రియాతిథివి వచ్చుటచే సఫలుండ భక్తభ
క్తా! రమగూడి యాశ్రమమునందు సపర్యల బొందుమీ కృపన్. 194

అనుచున్ సీతారాముల గని మ్రొక్కుచు హర్షబాష్పకణముల విడుచున్
మునిహృదయాంతర్గతు దే హినిగా దన ముందు గాంచె నీ యిల యందే 195

సర్వలోక సంత్రాణప్రశస్తమైన పరమపావనరాఘవపాణితలము
దనదుహస్తాన గీలించి తరలె తపసి యాశ్రమాంతరస్థలికి రామయ్యతోడ. 196

హరిణతతు లెల్ల తావుల నాడుచున్న
యాయగస్త్యాశ్రమము ప్రశాంతాశ్రమంబు
జొచ్చి రామలక్ష్మణధరాసుతలు గాంచి
రంత వదునేడు దేవతాలయములందు. 197

మోడ్చి కరయుగమ్ము మ్రొక్కగ నమ్మౌని
తోయజాక్షు డంత దోసి లొగ్గె

విధుల దీర్చి మౌని వేదవేద్యుని గొల్చి
నర్ఘ్యపాద్యము లిడి యమితభక్తి. 198

పుష్పపత్రగంధాదుల బూజ సల్పి
వన్యమూలఫలంబు లనన్యభక్తి
నారగింపగ నిచ్చి రామయ్యతండ్రి
తృప్తి గనగ నగస్త్యుండు సంతృప్తు డగుచు. 199

సుఖముగా నెల్లరును గూరుచుండిన. తటి
తా సుఖోపవిష్టుండుగా దనరు రాము
మ్రొక్కి మ్రొక్కుచు జేవోయి మోడ్చుచుండి
మఱల మఱల గాంచుచు ఋషి కెరలి పలుకు. 200

నీరాకకై వేచి నే నిట నుంటి
వీరాధివీర ! సర్వేశ్వరా! రామ ! 201

సర్వలోకవిభుండ ! సర్వజ్ఞ రామ !
దుర్విపాకౌఘములఁ దునుమాడు రామ ! 202

పాలకడలియందు బ్రహ్మ ప్రార్థించె
నీలావు నెంచుచు నిల జనింపంగ. 203

పోకార్చి రావణు భూభార ముడుప
నా కాల మావిగా నాద్యంతరహిత. 204

ఈ కాల మగుదాక నే కాచియుంటి
నా కండ్లు తరియించె నాయనా నేడు. 205

సృష్టికి మూలమై చేద్పద వెపుడు
సృష్టి కంతమ్ములోఁ జెలువొందువాడ. 206

నారాయణాఖ్యుండ నలినగర్భుండ
నీ రామనామంబు నిరతంబు భక్తి. 207

నోరారజపియింప నోచెడివారు
కాలోకో ముక్తులు కారుణ్యమూర్తి. 208

ఆదిదంపతుల మి మ్మరయుటవలన
మోదంబుతో మిమ్ము బూజించుకతన. 209

నాజన్మ సార్థకమౌ జన్మమాయె
నో జానకీనాథ ! యోంకారమూర్తి ! 210

రామ ! పరాత్పర ! నాహృదయంబున రంజిలు మీవ సతంబును నీ
ధామము నా హృదిగా వసియింపుము ధాత్రిజతోడ గృపామతివై
భూమిపయిం దిరుగాడెడి యప్పుడు పోవక నిల్చిన నొక్కెడఁ ద
న్నామమహాస్మరణంబున నెప్పుడు నా మనసుండ వరం బడుమీ ! 211

మఱల నిను బూజనల్పెద నరవరేణ్య పూజనీయుండవును ధర్మమూర్తి వీవు
మాన్యుడ వహో మహారథ! మా ప్రియాతిథివగుట విశేషపూజార్హుడవు మహేశ.

అనుచు నా యగస్త్యుండు రామయ్యతండ్రి బుమషసింపూ రెండవమారు పూజపుష్ప
మూలఫలముల సల్పి యపూర్వగతిని తృప్తుడై నతి రాము సంతృప్తుగనుచు. 213

నిను బూజించి కృతార్థుడన్ రఘువరా ! నీ సేవ సాయింప దా
సునికిం బ్రేముడి వచ్చినా విటకు దాసోహంబునే తప్ప రా
ముని కీయంగలవాడనా బహుకృతిం బోరం జయింపంగనౌ
వనిషు ట్లిచ్చట నుండె నీవె గ్రహియింపన్ నీవి నీకిచ్చెదన్. 214

వరుణున కిచ్చి తీవు మును భార్గవరాముని విల్లు తద్దను
ర్వర మిది నాయొడం గలదు వైష్ణవదివ్యము దీనిబూనియే
స్సురల విరోధులం దొలుత ప్రుక్కగ జేసె రమావిభుండు నీ
వరుల జయింప నీ ధనువె పట్టుము పూర్వవిధాన రాఘవా ! 215

విల్లున కీడుజోడయిన వీరశరం బజు డిచ్చె దాని నే
చల్లగ దాచియుంచితి నిశాచరసంహరణార్థియై ధరా
వల్లభుడిట్లు రా విడగ భాస్కరతుల్య మమోఘ మిద్ది యో
సల్లలితాంగ నీకె దగు సాయకమిద్ది పరిగ్రహింపుమీ ! 216

స్వర్ణ భూషిత హేమకోశంబు గలది యసియు పావకోజ్జ్వలశిఖ లనగ బఱగు
నక్షయంబగు బాణమ్ము లమ్ముపొదులు నింద్రుడిట నుంచె నీ కిడ నెలమిగొనుము.

వీనినే పూనియే మున్ను విష్ణుమూర్తి యసురకోటుల దునిమి జయంబుగాంచి
సురల కిడె రాజ్యలక్ష్మిని శుద్ధచరిత వీని నీ యాయుధంబుల బూను మిపుడె. 218

దుష్టసంహారకుండు రామ! దోషి కాఁడు శిష్టరక్షకుఁడు విశిష్టు డెపుడు
జానకీరామ! పూనిన జన్మకర్మ విజయవంతంబుగా నెరవేర్పగలవు. 219

ఆయుధంబుల సర్పించి యంత మౌని గాంచి వైదేహీ రామలక్ష్మణుల మువుర
సంతసము దెల్పి మంగళాశాసనమనె రాఘవుడు భక్తభక్తుండు రాజ్య మేల. 220

కాననసీమయందు గడగండ్లకు బాల్పడి కంటకావృతం
బైన పథంబునన్ నడిచి వచ్చిరి న గ్నన స్వేదబిందువుల్
మేన స్రవింప డస్సిరి ఫలించె మదీయతపంబు, నీక! యీ
జానకి మోము వాడి కడు జాలెడిగా, శ్రమ విశ్రమింపగా 221

ఈ సుకుమారి కష్టమననేమొ యెఱుంగదు భీకరాటవీ
వాసము సేయవచ్చినది భర్తయెడం గడు స్నేహబద్ధయై
గాసిలె నెంతయో యబలగా నడకన్, రహినుండ నామె కా
యాసము దీర జేయుము మదాశ్రమమందున జానకీపతీ! 222

పతిసుఖప్రదుడగు సంతవఱకె యతని
యెడల ననురక్తి జూపుదు రాడువాండ్రు
ఎపుడు పతులు దుర్దశ గాంతు రపుడె స్త్రీలు
భర్తల దక్యజించెద రిదియె ప్రకృతిగుణము. 223

లలన లోలత్వమున చంచలయగు ద్రుటిని
క్షణిక మాత్రాన మతి మార్చు చంచలగతి
దీర్ఘ కాలసంబంధమ్ము ద్రెంచుబుద్ధి
కత్తిపదునున కెనయగు క్రౌర్యయుతము. 224

నెఱపును సాహస కర్మల వెఱవొందక సుంత ముందు వెనుకల గనకే
గరుడానిలవేగంబున బఱగు బడంతుల మనస్సు వైరము గలుగన్. 225

రామ ! సృష్ట్యాది నేటికి బకృతిసిద్ధ మీ గుణంబులు రామల కెంచి చూడ
గాని యీ యమ్మ సీతమ్మ గాంచ దిట్టి దుర్గుణాల వరుంధతీతుల్య ఈమె. 226

శ్లాఘనీయ పతివ్రత సకలసుగుణ మూర్తి సీతమ్మతోడ మాపుణ్యవశత
నీవు తమ్మునిం గూడి మా తావు నుండ నెంచుటయె యలంకృతదేశ మిదియె యగును

అనుచు దీపాగ్నిహోత్రంబొ యన వెలుంగు
కనులం బలుకాడు నమ్మహామునిని గాంచి
నద్ధహస్తుండు రాముండు ప్రమద మొప్ప.
వినతి సల్పుచు భక్తిమై విన్నవించు 228

ఈ యమ జానకిన్ సతిని నెంతయొ మెచ్చినవాడ వౌట నా
యీ యసఘున్ సుమిత్రసుతు నేర్పడ బల్కినవాడ వౌట నా
ప్యాయము మాకు జూపుట యిదంతయు మాయెడ నీయనుగ్రహం
బేయగు మేము ధన్యులము హే! మునిపుంగవ! నీకృపామతిన్. 229

మునిజనవల్లభా! యెచట మువ్వురముం దగు నాశ్రమంబునన్
వని గడుపందగున్ సుఖము వర్ధిలపట్టున నీటిపట్టునన్
నను గృపజేసి తెల్పరె యనన్ రఘువర్యుడు రాముమాటలన్
వినుచు మునీశ్వరుండు బహువిశ్రుతకర్ముడు ధ్యానమగ్నుడై. 130

కనుచు భవిష్యదర్థమును గర్మయు రాముని కాలదుర్గతిన్
జనకజపాట్లు రాఘవు నిశాచర మారణ ధర్మదీక్షయున్
ముని కృత నిశ్చయుండగుచు బొందకయే వ్యథ నిర్వికల్పుడై
తన విధి దీర్ప రాము నవతారమునే తలపోసి పల్కెడున్. 231

మునులపన్నాగమే రాము పోకడరయఁ
జిత్రకూటంబు విడఁజేసి చేర్చనెంచి
రాశ్రమంబుల జూపుచు నసురలకడ
నీవిధంబంత నెఱిగి మునీశ్వరుండు
వేరు తావెల్లు సూచించు వీరపతికి. 232

ఇచ్చటికిన్ సమీపముననే బహుభోజ్య ఫలాదిమూల సం
పచ్చరితం బనేక మృగ పక్షి సమాకుల పుణ్యవంతమున్
సచ్చరితా! వివిక్తము ప్రశాంతవనం బది గౌతమీనదీ
స్వచ్ఛతటంబునం గలదు వాస మొనర్పగ జెల్లు మీరటన్. 233

పంచవటి యను బేరున బఱగునద్ది రెండుయోజనములదూరముండునంతె
యాశ్రమంబొండు నిర్మించి యచటమనుడు మీరు సుఖముగ గడువెల్ల దీరువఱకు.

తండ్రియానదీర్చ తనయుడవేగాక సాధురక్షణంబు సలుపగలవు
ప్రతినదీర్చి మఱల రాజ్య మూనుదు నీవు గడిచె జాలవఱకు గాన యునికి. 235

నీదు జనకుండు ధన్యుండు నీ వ్రతాన సత్యసంధుని జేయవే జనకు నీవు
దశరధుడు నాకు హితుడౌట దనయుగూర్చి సర్వ మరసితి నాతపశ్శక్తివలన. 236

నీవుమచాశ్రమంబున వనిన్ వసియింపదలంచి తొల్త, నీ
భావము మార్చుకొంటివి తపంబున దాని గ్రహించియుంటనే

సీవసతిం జరింపుమని యే మిము గోరియు నేనె మీకు మీ
త్రోపను జెప్పి పంచవటిలో మిము వాసము సేయగోరుదున్. 237

రాఘవ ! మదాశ్రమము రాడు రాక్షసుండు దాన సీదీక్షవమ్మగు దాని నెంచి
తరలనుంటివి వేరొక తావు జేర దానికే సడ్డుపడను కోదండపాణి ! 238

అనుచు భావితాత్ముం డగస్త్యముని పలికి
కరములను మోడ్చి కనుబొమల్ కలిపి కనుల
మూసి ధ్యేయమూర్తిని దనముందు గనుచు
నాత్మపరతంత్రుఁడౌచు ధన్యోస్మి యనును. 239

అదె యిప్ప చెట్లున్న యడవిని బొమ్మ
మధుకవనంబె మీ మార్గంబం సుమ్మి 240

ఆ వనంబున నుత్తరాశను బోవఁ
ద్రోవలో మఱ్ఱిభూరుహ ముండు నొకటి 241

ఆ మార్గమే బట్ట నందొక్క గుట్ట
సామీప్యమున గొండ చక్కగా దోచు 242

ఆ కొండ దరి నుండె నల పంచవటియు
సీకీవు దరినుండు నా కగువాడ 243

శ్రీరామ! జయరామ ! సీతాసతీశ !
నారాయణా ! రామ! మా రామ ! రామ! 244

ఆ మాట లాలించి రామలక్ష్మణులు
భూమిని దలలొగ్గ మ్రొక్కిరి మునికి 245

మౌని యాశీస్సుల బూని వారపుడు
జానకీదేవితో జనినారు త్రోవ 246

కనుమేర దూరంబుకనుపించువఱకు
ధనువు తూణీరముల్ దాల్చినవారి 247

వరదుండ మగళం బగుగాతమంచు
గరముల జోడించి కనుచుండె మౌని 248

ఓం రామాయ నమో యను రాం రామాయ నమ యనును రామా యను ఐం
రాం రామా యను రాం శ్రీం ఐం రామా యను మునితతి రాముం గనుచున్. 249

అవతారస్ఫురణంబు జేయగల వాక్యాళులన్ మహాపూజలున్
స్తవముల్ సల్పుచు జేర్చె బంచవటికిన్ దైత్యావృతంబౌ వనిన్
భవబంధచ్యుతునిన్ మునీంద్రతతి సంభావించి ధర్మార్థమే
యెవరుం జెప్పరు జానకీపతికి ముందేమున్నదో తద్గతిన్. 250

జనకసుతాభిరామునకు సర్వశుభంకరరామమూర్తికిన్
మనవి యొనర్పడాయె మునిమాన్యు డగస్త్యుడు గూడ జానకీ
వనిత దలంచియైన వనబాధలు ముందు గలట్టివానికిం
దనవిధి ధర్మకర్మ మది తా నెఱుగం డొకొ జానకీశుఁడున్, 251

మాయామేయ జగన్నివాసుడగు రామస్వామికిన్ ద్యోతమే
యా యా భూత భవిష్యదర్థములు కాదా! వర్తమానం బెదన్
దాయంజాలమి నేడగస్త్యుని దరిన్ వర్జించెనా! తొల్తఁ దా
నా యోగీంద్రుని యాశ్రమస్థలిని సౌఖ్యంబొందగా నెంచియున్. 252

ఎవ్వ డేదియేవి నేదియో నెపమున॥ గర్మ మనుభవించుగాదె దేహి
పాము నోటిలోన బాణిఁ బెట్టినటుల బంచవటికి జేరె బార్థివుండు. 253

## జటాయువు

మార్గమధ్యమందు మహితంబు గృధ్రంబు నొండు గాంచి రాఘవుండు వాని
నసురుగాగ దలచి యతని పేరడుగుట బలికె నతడు తనదు వంశ మెల్ల. 254

అసురుడ గా నవధ్యుడ మహాత్మ! పరంతప! నీదుతండ్రితో
మసలినవాడ మీహితుడ మార్గమునం దిటు వేచియుంటి మీ
దెస వసియించి ముక్తిగన దేవర! తోడుగ గొమ్ము. నీక యే
వ్యసనము నెందకుండగ నిరంతర మామెను గావు గాయుదున్. 255

అరుణుండే పిత నే జటాయువను నాఖ్యం గాంచినాడన్ రమా
వర! సంపాతి మదీయ సోదరుడు నా బాహాద్వయీశక్తి నీ
పరమౌ భీమపరాక్రముండ నవిలో వైరుల్ వినున్ దాయ నో
వరు నన్నుం గొను మందగా ననెను సద్భక్తిన్ నతిన్ సల్పుచున్. 256

పక్షిరాజుబలుకు బరమహితంబుగా విశ్వసించి యతని వీరవరుడు
తమిని బాజ సలిపి తాతగాథల నెన్నొ వినగడంగె నతడు విశదపఱుప. 257

వినుచు వినుచు బక్షి వినిపించు కథలన్ని రాఘవుండు పక్షిరాజు నంత
గౌగిలించి మఱల గౌగిలించు దమి ప్రేమ వెల్లడించు వినతి సలుపు. 258

శలభముల నగ్ని దహియించుసరణి దైత్య తతుల నశియించురీతి గోదండపాణి
జానకీలక్ష్మణయుతుండు సకలవిదుడు భద్రముగ బంచవటి జేరె బక్షి గూడి. 259

## ఆశ్వాసాంత పద్యములు

నవరంధ్రంబుల మూసి కుంభకము విన్నాణంబుగా నిల్పి "ఓం"
ర ఁ లగ్నాత్మసమాధిలో నిలిచినన్ రామా నినుం గాంచలే
రెవ నన్ సగుణాత్మమూర్తి వగు నిన్నే జూచినంగాని భ
క్తి శాత్మన్ దరియింపజాలుదురె శాంతిబొందుచున్ యోగులేన్. 360

నీదరహాసమున్ విమల నీరజనేత్ర కటాక్షదృష్టి, స
మ్మోదకరార్ద్రభాషణము ముక్తినిధానము పాదయుగ్మమున్
సాదరణమ్మునం గనగ జాలి సపర్య లొనర్చువారె యో
నీదరినే వికుంఠముననే నివసింపరె విశ్వసూరులై. 261

ముక్కును మూసి నీచరణముల్ గనజాలక రాజయోగముం
జక్కగ బూనినన్ సులభసాధ్యమె మోక్షము! రామచంద్ర! నీ
వెక్కడ! రాజయోగ మది యెక్కడ! భక్తివశంవదుండవై
చిక్కెడివాడ వీవు నిను జేరగనన్యగతుల్ వృథా శ్రమల్ 262

మునులును యోగులున్ విబుధ పుంగవు లెల్లరు భక్తిమార్గమే
గనుచు ప్రపత్తిసిద్ధు లయి గాంచరె ముక్తిని చావుపుట్టుకల్
గనక వికుంఠవాసులయి కర్మతెఱంగు వశించి నీదు ప్రా
పున వసియింపగా సులభపుంగతి భక్తియె గాదె రాఘవా! 263

మరణకాలాన 'రామ' సంస్మరణమాత్ర
మోక్ష మిదు దీక్ష నీయది. పోవునేమొ
కాలగతివేళ కంఠంబు; కఫము సుట్టి
దావ స్మరియింతు నిను నిరంతరము రామ. 264

ఇది గోవింద రామాయణమున రక్షకరామ కావ్యంబున, షష్ఠాశ్వాసము సంపూర్ణము.

# శ్రీ గోవింద రామాయణము

# రక్షకఖండం

## 4. ధర్మాశ్వాసము

ధర్మము కొనసాగింపగ ధర్మముఁ జేబూనియున్న దశరథపుత్రా
కర్మగతిం గనజాలిన మర్మము శేసట్టి వీర మౌనిసుపూజ్యా 1

### పంచవటి

నానావ్యాళమృగాయుతంబు ద్విజసంతానాప్తపుష్పప్రదీ
ప్తానేకాంచితపాదపప్రతతియుక్తంబున్ మహారమ్యమున్
పానీయార్ద్రజలాశయప్రకరసంశోభాసక్తమున్ గౌతమీ
స్థానం బిద్ది సమిత్కుశాంబు సుమనస్సంపత్సమృద్ధంబున్. 2

దగ్గఱయు దూరమును గాక ధాతువితతి
రంగురంగుల బ్రసరించు రమణ నొప్పు
పర్వతావళికి కనుపండు వోచు నుండఁ
బంచవటి యెంత చక్కగా వఱలుచుండె. 3

అవియె నెమలిపింఛులు కడు నాడుచున్న పర్వత శ్రేణి యెంతటి భాగ్యసీమ
అద్దె కేకినినాదంబు నా గుహాళి వలిపెడి ప్రతిధ్వనియు విన శాంతి కలుగు. 4

గోదావరీ కన్య కొమరారు నెమ్మోము
పెడదయా కనుతీరు విధముఁ దోప
గోదావరీ సతి కులుకుచు నిరతంబు
నడయాడి రహి మించు నడకఁ దెలుప
గోదావరీదేవి కొమరొప్పు పాలిండ్ల
చక్కఁదనంబును జాటుగతిగ
గోదావరీ మాత కుంకుమబొట్టును
బసుపుపూతల రంగు వగయనంగ 5

పద్మములు హంసలును చక్రవాకములును
గైరికవిలాసముల నొప్పు కాంతులు గల

గౌతమీసువాసిని శుభంకరయుఁ బూత
యెదుటఁ గనవొప్పె నిది శుభప్రదము మనకు.

ఇదె యగస్త్యుండు చెప్పిన ప్రథితవసతి యిటనె నాకు సీతకు నీకు నిష్టమైన
పగిది నిర్మింపుమీ యొక పర్ణశాల ననుచు రాముండు పలుకాడె ననుజుతోడ. 6

అన్నమాట వినుచు నా లక్ష్మణుం డంత తెన్నుఁ గనఁడు కర్మ తెఱఁగు నెంచి
భ్రాతయాన సతముఁ బాటించువాఁడనౌ కాని స్వేచ్ఛ నేను బూన నెపుడు. 7

పరతంత్రుండగు లక్ష్మణుం డెటుల సంభావించు స్వస్వామి కా
పుర ముండం దగు నాశ్రమస్థలము రాముండే నిరూపింపనౌ
ధరణీజాత్మకు నచ్చునట్టి స్థలమున్ ధర్మం బిదే, యన్న నీ
దరి సేవాపరతంత్రుఁడే యితఁడు స్వాతంత్ర్యంబుఁ జేబూనునే. 8

నీవె స్థలనిర్ణయంబును నేర్పుమీఱఁ జేయగల సమర్థుఁడ వీవు చెప్పినటుగఁ
జేసెద నిట నూరేండ్లు వసించియున్నఁ బారతంత్ర్యంబె సతము నా వాంఛ రామ!

సోదరుని మాట నాలించి మోద మంది సర్వగుణ సమన్వితమగు స్థలము నొండుఁ
గాంచి రాముండు సౌమిత్రి కరముఁ బూని పర్ణశాలను నిర్మించు పని విధించె. 10

మిట్టయుఁ బల్లము లేదీ గట్టిస్థలంబున లభింపఁగల విచ్చోటన్
జుట్టు సమిత్కుశసుమములు గట్టు మిటం బర్ణశాలఁ గట్టెడిరీతిన్. 11

సురభిగంధాన రవికాంతి వఱలుచున్న పద్మశోభిత పద్మిని ప్రక్క నుండెఁ
గొలనిగట్టునఁ జుట్టును గూర్చినట్లు పూలుపూచిన తరుకాండ మొప్పుచుండె. 12

అరయు మాదిత్యసంకాశ మగుచు నొప్పు నిదియ పద్మాలయంబు పుట్టింటికి రమ
భర్తతోడుత వచ్చినపగిది నుండె సుప్రసన్నంబు ననుపమ సుందరంబు. 13

అను గురువాక్యముల్ వినినయంత సులక్షణ లక్ష్మణుండు మ
ట్టిపై నటఁ ద్రవ్వి గోడలఁ గడించి బలంబునఁ బెట్టి వంశముల్
గొని తరుకంబముల్ నిలిపి గూర్చెను నడ్డము జమ్మి కొమ్మలన్
అనువుగ రెల్లుఁగప్పి యొక యాశ్రమ మప్పుడె గట్టె నేర్పుమై. 14

నేల చదునుజేసి నివసింపఁదగురీతి గౌతమీజలాన స్నాతుఁ డగుచు
కమలములను బండ్లఁ గైకొని సౌమిత్రి వాస్తుపూజ శాస్త్రఫణితి సలిపె. 15

అంత రాముండు సీతతో నందుఁ జేరి పరమ సంతుష్టిఁ గౌఁగిలిఁ బట్టి యనుజు
తండ్రి మరపించు నీసేవ ధర్మవిదుఁడ యనుచుఁ దమ్మునిఁ బొగడె ప్రేమానుభూతి

అతుల శాంతిని రాఘవుఁ డతివతోడ సోదరుని జటాయువుఁ గూడి మోద మలర్
పర్ణశాలను గౌతమీ పంచవటిని గడుపుచున్నాడు కాలమ్ము గడువు తీఱ, 17

పంచవటీ కుటీరమున భార్యను దమ్ముని గూడి రాఘవుం
డంచితరీతి నుండు తఱి నల్లె శరత్తును నేగె గాముకా
వాంఛితకాల మేర్పడె శుభాస్పద పుష్యమువచ్చె దద్గతిన్
మంచు జగంబు ముంచెడి హిమంబున లోకవిధంబు మారదో! 18

కొండొకనాడు జానకియు గూరిమి తమ్ముడు వెంట నుండ రా
ముం డల గౌతమీనదికి బోవుచునుండె హిమంబు ప్రాణులం
జెందు ప్రభాతకాలమున శీతల వాయువు లెల్ల దిక్కులన్
నిండినవేళ సంధ్యవిధినిం బరిపాటిగ స్నానమాడగన్. 19

అన్ననుగాంచి లక్ష్మణ బుధాగ్రణి మార్గమునందు బల్కురా
నున్నగతిం గణించు విధ మొప్పగ గాగల ధర్మకర్మమా
తెన్నున; శీతకాల మరుదెంచుట వచ్చిన కష్టనిష్ఠురా
లన్నియు వర్ణనన్ నృపున కంచితరీతిని భావితాత్ముడై. 20
హిమవంతంబన జెల్లు మంచు మలనున్ హేమంతకాలం బిదే
సుమనఃపల్లవరాజి వెల్లనయి దోచున్ మంచులో మున్గి నీ
రములందే చరియించు పక్షిపతి పారంబందునే నిల్చె వే
డిమినే కోరెడి ప్రాణికోటి కయి మోడ్చెన్ వేడి వేల్పుం గనన్. 21

సస్యశాలిని యిల నేడు జనపదాళి
యెల్ల గోమాత క్షీరంబు వెల్లివిరియు
నగ్నిప్రియదంబు జలము భయంకరంబు
కరము ప్రియ మంతిపురము దుర్భరము బయలు. 22

పల్లెలన్నియు సర్వసంపన్నమగుచు దసరు సత్పురుషులు నవధ్యాన దాన
ములఁ బితరులెల్ల స్వర్గవాసులు తరింప పూజ లొనరించువార లీ పుష్యపు నెల. 23

కనకవర్ణంపు బైరుల కంకులెల్ల నలరి ఖర్జూర పుష్పచయంబు మాడ్కి
వంగియున్నవి తండులభార గరిమ పంటవలతికి వినయంబు పగిది దోప. 24

అరుగు దమి మీఱ బుట్టింటి కాడబడుచు క్రొత్త జామాతకై వేచు నత్త వారు
పొంగి పొగంళ్ళు పొంగింత్రు పూవుబోండ్లు విజయయాత్రాభిలాషులు వీరనృపులు.

బిగియంబట్టుచు గొగిటం బ్రియుల సంప్రీతిన్ సుఖంబుందు శా
లగతిం గాంచుము జీవులెల్ల నిపు డాహ్లాదంబుసందుండగా
నగుబాటైన సహింపనెంచెదరు వానప్రస్థదీక్షారతుల్
దిగులుం బొందెడి కాలం మియ్యదియె కాదే జానకీవల్లభా! 26

దక్షిణంబున లోకబాంధవుడు చెలగ నుత్తరార్ధ నారీమణి కొదవదె వ్యథ
యాబిడ విహీనతిలకయై యంతిపురము జొచ్చు స్వప్రకాశము వీడు సుదతివోలె.27

దినకరుడు మృదుసూర్యుడై తేజరిలెడి చంద్రమండల మెఱుపాయె సొరువీడి
మంచుగవ గూడి చలిగాలి మించురేల దీర్ఘరాత్రులునుం జలి తీవ్రము గద! 28

మనమె నిట్టూర్పు విడుచుట మలినమగుచు దేజు బాసెడి నద్దంబు తీరు దోచు
శశితుషార మలినుడు నిశాచరుండు పూర్ణిమనుగూడ నిజకాంతి పొందడాయె. 29

సూర్యు డుదయించు నంతనే సొబగు మీఱి
యడవు లందుండి యావిరి వెడలుచుండె
క్రౌంచ సారస ద్విజరుత మెంచ హాయి
గా వినందగు బుష్యమీ కాలమందు. 30

అమితదూరాన సూర్యోదయంబు కతన నరుణ కిరణావళి హిమాన నలముకొనుట
వేడివెలుఁగు మయూఖముల్ వాడిఁ దప్పి చంద్ర కిరణాలవలెఁ గడు చల్లనయ్యె.
ఉదయకాలంబు రెండింత లుండెను జలి సహజ శీతల ప్రకృతియుఁ జలివి మోయు
పశ్చిమానిలమును రెంట బాధ యినుమడించిన తరుణము మనల డీకొనె గద!

ఎండ తాకెన నీ సీత యెట్లు కాంతి వీడెనో యటు శశి హిమాన వీడె తేజు
నిఁక వనంబులఁ గావ్పింప దేదిగాని యున్నచోటనె యెల్లవా రుండినారు. 33

ఏటి కొక్కమారు హేమంతఋతు వగు దాని సుఖము వీడఁ దలఁచు నెవడు?
పదియు మూడుమారు లిది వచ్చు నీ వనిఁ గాన నుండు గడువు గడచుచుండ. 34

తపసులకెల్ల బెబ్బులికదా! చలికాలము ధర్మదీక్ష, నీ
విపుడు త్యజింపనౌనె వని నే చరియించెడి కాల మింక, గొం
త పరిసమాప్తి కావలె గదా? తుది పట్టున నొక్క యేడెగా
విపినచరుండవై మనుట వీరుడ? సత్యపరుండ ధార్మికా. 35

ఇచ్చట మనగతి యిట్లుండె నింక
నచ్చట నెట్లుండె నా భరతుండు. 36

చలి వణికించు నిత్తఱిని శయ్యను నంతిపురంబు వీడి శీ
తల మహిఁ బవ్వళించెడిగదా ! భరతుంతునుగూడ ! రామ ! నీ
వలెనె జటాజినంబులను వల్కలముల్ ధరియించుచుండి రా
జిలెడి మహా తపస్వి గతి జేతము నీకిడి దుఃఖితాత్ముఁడై . 37

సకల సుఖాశ్రితుండయిన సర్వసుఖోచిత ధర్మమూర్తియున్
వికల మనంబునన్ విడచి వీటని రాజ్యముభాగ్యభోగ్యముల్
సుకరము గానివేళ చలి సూదులుగా మెయిఁగ్రుచ్చు వేళ నె
ట్లొకొ వఱువాత లేచి సరయూనదికిం జని స్నాతుఁ డయ్యెడిన్. 38

శ్యామలమూర్తి వీరుఁడు మహాత్ముఁడు పద్మదళాక్షుఁడున్ సదా
ప్రేమమయుండు ధార్మికుఁ డభీతమనస్కుఁడు హ్రీనిషిద్ధుఁడున్
కోమల దీర్ఘబాహుఁడు నృకుంజరుఁ డన్నకు సాటియౌచు ని
న్నే మది నెంచుచుండెడి జితేంద్రియుఁ డా భరతుండు రాఘవా ! 39

సర్వ సద్గుణమూర్తియై స్వర్గ విజయుఁ
డాయె భరతుండు నీభ్రాత; యన్న సేవ
విడిచి చనఁదలంపఁ డెటకుఁ బ్రియుని రాముఁ
గాంచ నెంచుట యాతని కాంక్ష సుమ్ము. 40

భరతుండు మనమిట్లు చరియించు కతము
నరయఁ గైకయె గాదె యాయమ్మ గతియె ! 41

తల్లిగుణములనే పొందు తనయుఁ డనెడి పరమసూక్తి కల్లఁగనయ్యె భరతుని యెడ
కైక దుర్గుణ మేమియు సోకలేదు తండ్రి సద్గుణ మబ్బె నీ తమ్మునకును. 42

రాజరాజన్యునకు భార్య రాచబిడ్డ యెన్నికను గన్న భరతునిఁ గన్నతల్లి
యయ్యుఁ గైకమ్మకేల లే దమలగుణ మదేల రాఘవ ప్రకృతియం దిట్టి వింత ?

అనుచు సౌమిత్రి కైకమ్మ ననిన మాట రాఘవుఁడు సహింపఁగ లేక లక్ష్మణునకుఁ
దల్లి నా రీతి దూషింపఁ దగదటంచు హితముఁ జెప్పచుఁ బలుకాడు నెలమితోడ.

నిజమే యా భరతుండుగూడ సరయూ నీరంబులం దీ చలిన్
నిజధర్మార్థముగా త్రిసంధ్యల గతిన్ నిత్యాభిషేకుండునై
జయించున్ రవి లోకబాంధవుని భూపాలుండునై సౌఖ్యముల్
త్యజియించెంగద! నా కతాన నదె చింతంగూర్చు నా కెప్పుడున్. 45

మఱువగ జాల నా భరతు మాన్యగుణోదధినిన్ మహాత్మునిన్
దెఱపగనుండి యాతడు విధిన్ నెరవేర్చుచు నున్నవాడు. ఏ
మఱను సుమా మదీయ పరమావధి! కాననవాస ధర్మముల్
నెఱపి యయోధ్యకుం జనెడి నిశ్చలదీక్ష వ్యజింప లక్ష్మణా! 46

ఎన్నడు నా సహోదరుల నెల్లరగూడి యయోధ్య రాజ్య సం
పన్నుడ గాగలాడ! నను భావము నాయెద నిండియుండె సౌ
ఖ్యోన్నతి గోరువాడ! సరయూతటి జేర దలంచువాడ న
భ్యున్నతి రాకపోకలు సహోదర! దైవవిధంబు గావొకో. 47

స్థిరబుద్ధిం గలవాడనయ్యు భరతుం జిత్తంబునం దెంచునో
బిరగున్ జంచలతన్ మనోగతి వనీ వాసం బసంపూర్తిగా
మరలన్ వీడున కేటి కీ గొడవ; యామాన్యుండు తానెంతయో
పరమార్థంబుగ గష్ట సంతతులకుఁ బాలయ్యె నంచున్ వ్యథన్. 48

తరుణమును జారవిడువరు ధర్మరతులు
కాలమునుబట్టి కర్మల గడగవలయు
గాల మొకరీతి నెవరికి గడువ బోవ
దేడనేగాని కాలంబు వీడునె గతి. 49

నీవు సమస్తధర్మముల నేర్చినవాడవు నాదు లక్ష్మణా!
నే వగ జెందనే భరితువిం దలపోయుచు నా నిమిత్తమై
ధీవరు డెవ్విఁ బాసుల విధిం గనుచుండెనొ యంచునంత గో
దావరి జేరె రాఘవుడు తమ్ముడు సీతయు వెంటసంటగా. 50

గౌతమీ పూత జలముల స్నాతులైరి
మువ్వురును. రాఘవులు రవిఁ బూజ సలిపి
తర్పణమొసంగి పితృదేవతలకు వెడలి
నారు సీతతో బర్ణకుటీరమునకు. 51

## శూర్పణక

పర్ణశాలయందు ప్రభుని కుమారులు పరమతుష్టిబొంది పరగువారు
మౌనిపూజ లంది మౌనుల బూజించి రామచంద్రు డిపుడు రహిఁ జెలంగు. 52

జానకీదేవి మధుర వాక్సరణి వినుచు వినుచు లక్ష్మణు ధర్మార్థ విహితసూక్తి
నా వసంతాగమనమున నారబైట జిత్తశాళి వెల్గురీతి నాసీను డతడు. 53

ఆట్టివేళ నొక్క యాదుది యొకనాడు పర్ణశాలదరికి వచ్చి నిలిచి
రామచంద్రమూర్తి రాజీవనయనుని గాంచి ముగ్ధయగుచు గాంచుచుండె. 54

ఆమె యాదృచ్ఛికము వచ్చి యమల మోహ
నాంగుని రఘురాముని గని పొంగిపొంగి
యలరు విలుకాని తూపున కంత జిక్కి
మోహవశత శ్రీరాముని మోము జూచుం 55

కోమలదీర్ఘబాహుని నకుంఠిత తేజుని మన్మథాకృతిన్
శ్యామల వర్ణదేహుని విశాలసువక్షు మహాబలాన్వితున్
శ్రీమహితున్ జటాయుతుని శ్రీరఘురాముని లక్ష్మణాన్వితున్
గాముకురాలు గాంచెడి నెగాదిగ మోహమయార్ద్రదృక్కులన్. 56

జాయం గూడి వసంతపుష్పితతరుచ్ఛాయన్ సుఖాసీనుడై
హాయిం గూర్పగ గంధవాహు డట నాహ్లాదింపుచున్ మాట లా
ప్యాయం బొప్పగ బల్కుచున్న రమణీయాకారు శ్రీరాము వే
డాయున్ మోహిని యాపడంతి పలుకాడం బూని ప్రశ్నించుచున్. 57

ఎవ్వరివాడ వీవు ధరణీశ్వర! లక్షణయుక్తదేహివై
యివ్వని మౌనివేషమున విల్లసి చాప శరంబు లూని యీ
జవ్వని గూడియుంటివి? నిశాచరు లుండెడి ప్రాంత మియ్యదే!
యెవ్వగ దాపురించె నిటు లీ వనవాసము తెల్పు సుందరా! 58

అని యామె పలుకాడ విని పరంతపుఁడు
ఇన వంశజుఁడు సత్య మేర్పడఁ బల్కె 59

కోసలరాజపుత్రుఁడను కోమలి ! యీయమ నాదు భార్యయే,
యీ పతిపేరు సీత, యితఁడే సుమ లక్ష్మణ నామధేయుఁడై,
వాసివి వన్నెఁ గన్న జనవంద్యుఁడు, నాయనుజుండు కానలో
వాసము సేయఁ దండ్రి పనుపన్ వని నుంటివి సత్యదీక్షమై. 60

ధరణినాథుఁ డొకండు దశరథుం డనగ
వరలుచుండెడివాఁడు వాఁడె మాతండ్రి. 61

ఎదనైన నన్నృతమ్ము నెంచనివాఁడు
త్రిదశవిక్రముఁడైన దీప్తిమంతుండు. 62

భూమీశునకు దొల్తఁ బుట్టినవాడ
రాముడంచని నన్నుఁ బ్రజ పిల్చువాడ 63

ఈ సతి మైథిలి యెపుడు వెంటాడుఁ
బాసి యెఱుంగదు పతిని నన్నీమె 64

ఆతఁడు లక్ష్మణుం డనుపమగుణుఁడు
హితసుఖమున నావెనువెంట నుండు 65

జననీ జనకుల యాజ్ఞను వని జనములు లేనిచోట వసియింపంగన్
జనుదెంచితి ధర్మార్థంబున ధర్మాకాంక్షఁ దివిరి పొలతీ యిటకున్. 66

ఎవ్వతెవీవ? యీవని జరింతురు రాక్షసులంటి వీవ, నీ
వెవ్వనమున్ మనోజ్ఞమగు చందపు నందముఁ జూడఁ బోల్చఁగా
రెవ్వరికేనిఁ గాదు, వని నీ గతి నొంటిఁ జరింప నేల? యీ
దవ్వున కేల వచ్చితివి? దాచక సర్వముఁ జెల్పు సుందరీ? 67

అనఁగ బరంతపుం డా రాము! డంత
వినిపించు నా భామ తన కథనెల్ల. 68

వలచి వలపింపఁగాఁ దగు పద్మనయన! పూల విలుకాని రూపమౌ పురుషసింహ?
పరమసుందర! మృదుతనూభాసురాంగ! మోహనాకార వినుము నాపుణ్యచరిత.

ఓయి మన్మథ మన్మథా! యుర్విలోన సుందరాకారునకు గనువిందు గాగ
నెట్టిరూపంబునైన నే నెత్తగలను కామరూపిణి నసురుల కాంత నేను. 70

శూర్పణఖ నేనె యీవని జొచ్చుదాన
నొక్కకుతినె భయంకరరూప మూని, నేడు
గౌతమీతీరమున నుండి క్రాలు నీదు
పద్మ వజ్రాంకుశాంకాప్త పదముల గతి
వచ్చి యుంటిని రామ నిన్ బట్టియుండ. 71

రావణు డా సురారి యసురప్రభు వెంచ మదీయ సోదరుం
డో వనజాక్ష! నిద్ర నెపుడూను భయంకర కుంభకర్ణునిన్.
ధీనరుడా విభీషణుని నిశ్చలు లా ఖరదూషణాదులన్
నీవు వినంగలేదో? రణనిష్ఠులు వారలు నాదు సోదరుల్. 72

విశ్వవసు డెంచ మాతండ్రి వినుము రామ!
యసురుడు విభీషణుండు ధర్మాత్ము డసుర

చేష్టలను రోయువాడు నీ చెవివిఁ బడఁడొ !
యాతనికి గూడ జెల్లెల నందగాఁడ ! 73

ఓ యపురూప ! రామ ! వినుమోయి ! నమో యను దాన నేడు మో
హాయిత మాయె నాహృదయ మంత నినుంగను నంత సౌఖ్య సం
ధాయివి నాదు భర్తగ గొనం దలపోతుల బరిగ్రహింపు మీ
హాయిగ గొండకోనల విహారము సల్పగ రమ్ము సుందరా : 74

ఓ పురుషోత్తమా ! హృదయ ముంచి త్వ దంఘ్రుల భార్యఁ గాగ వీ
దాపున నుండు గాఢమతి దన్వివి వచ్చితి భర్తగాగనా
ప్రాపగుమోయి ! యీవనిత భార్యయె ! నీ కనుహూప నేనె ! సీ !
రూపసి గాని దానియెడ, లోలుడ వెట్లయినావొ ! సుందరా ! 75

నా వారి విడనాడి నలినాక్ష ! యిటకు
నీవాడఁ జేరితి నీ భార్యఁ గాఁగ. 76

అసమాన ప్రతిభా ప్రభావ బల రూపాఢ్యుంగదా ! స్వేచ్ఛమై
మసలంగాఁ గలదాన నీ హృదయ సీమన్ భర్త వీవౌచు నా
వ్యాసంగంబునఁ జాలకాలము సుఖింపన్ వచ్చు సంతృప్తిగా;
నీ సీతన్ విడుమీ విరూపి వికృతం బీ రూపమున్ మెత్తువే ! 77

త్రుటిమాత్రంబున నీదు సీత ననుజుం దృప్తిన్ భుజింతుం గదా !
యట వీరిన్ దిగమ్రింగి యేఁగ నగుఁగా వింపైన నెచ్చోటకో
యటవీరమ్యలతానికుంజములలో నా పర్వతాగ్రంబులన్
బటు కామాప్త మనః ప్రవృత్తిని సుఖింపన్ రమ్మహో సుందరా 78

ఈ నగముల్ మహానదియు నిచ్చటి కందరముల్ నగాగ్రముల్
కానన జంతు పక్షి తరుకాండములున్ సరిక్రొత్త వాసనల్
బూనిన పుష్పసంచయము పూజ్య ! వినోదముఁ గూర్పుకున్నవే
మానస మొక్క ఊయియొకో ! మన్మథబాణములం దపింపదే ! 79

చక్కదనాన నీకు సరి; సాటిగదా ధరణీశ వంశమున్
రక్కసి-నంచు జూడకుము రాగముతో నను జేరఁ దీసి నా
దిక్కగు మోయి భర్తగ బవింబది ప్రియెటు దెల్పువాంఛ, ని
న్నొక్కడ గోరుచుంటి నిక నొప్పుకొనందగు.బూరుషోత్తమా! 80

అను నా కామిని కథ విని వనజాసనుఁడైన రామభద్రుం డంతన్
గని కడగంటను సీతను గను మందస్మిత ముఖాన నసురాంగనకున్. 81

ఓ సుకుమారి! నన్వలచుటొప్పునె? భార్య గలట్టివాడ నే
నీ సరివాడనా? సవతినిన్ భరియింతువె? పోరుపెట్టదే?
వేసరిపోవె? లక్ష్మణుడు వీరుడునుం, దరుణుండు, సుందరుం
డా సుమకోమలుం డనుజుఁ డాతడు నీ కనురూపవంతుడున్. 82

భార్యతో గూడియుండినవాడు కాడు
పత్ని సుఖ మెఱుంగని వాడు వాని భర్త
గా గొనుము సైకతశ్రోణి! కమలనేత్ర!
మేరు వర్ణ కాంతినిఁ బొందు తీరుగాగ. 83

అతివ! నీ యాన యడియాస యగును సుమ్ము
సీతకైన నాకు మక్కువ చెదరఁబోదు
సవతి పోరేమి లేకుండ సౌఖ్యపడుము
భర్తఁగా నాదు తమ్ముని బడయగలిగి. 84

కామమోహిత యప్పుడొక్క గంతు వేసి
లక్ష్మణుం జేరి పల్కె విలాస మొప్ప
నహహ! లక్ష్మణ! నీ యన్న యంపె నన్ను
బడయ సౌఖ్యంబు నిను బొంది భర్త గాగ. 85

కనుమీ లక్ష్మణ! సర్వసౌఖ్యముల నన్ గాంతామణిన్ భార్యగాఁ
గొని స్వేచ్ఛన్, గను నీడుజోడుగను నీకున్ నాకు, నీదండకా
వనిలో నొంటరివై వసంతమున, సంభావింపవే నన్ను బో
లిన భామన్ బహు సుందరిన్; గనివినన్ లేదట్టివా డెందునన్. 86

భార్యతో దృప్తుడై యుండి ప్రమద మొందు
నతడు జతలేని నిను గూడ బంపె నన్నుఁ
దనకుఁ దా రాఁగ భార్యగా వనిత యిటుల
దానిఁ జేపట్టి సుఖియింపఁదగదె నీకు. 87

కాంతారత్నము విన్నుడాసి యిటు సౌఖ్యంబొంద నర్థింప గో
రంతైనం బరియింపవేమి? మగవాడై నట్టివా డిట్లహో

యెంతో వంతకు జిక్కుచున్ మనునొకో యేకాకిగా లక్ష్మణా!
యంతా సౌఖ్యము నీ యదే యగుసుమా! యర్ధాంగిగా నన్గొనన్. 88

అను నా శూర్పణఖా విధాన మెదలో నాలోచనంజేసి, ల
క్ష్మణు డా వాక్యవిశారదుండు నుడువన్ సాగించె, మందస్మితం
బున, నా రాక్షస కామపాశవశకున్, మోహప్రవృద్ధాంగికిన్
దనముందుం గల కామరూపిణికి, శాంతస్వాదు వాక్యంబులన్. 89

ఏమిది ! నన్నెకోరితివె! యే నొక దాసుడ రామదాసుడన్
భామరొ! యిట్లొకానొక యభాగ్యుడు దాస్యముసేయువాడు నీ
ప్రేమకు యోగ్యుడా? యితని ప్రేయసివౌ తలపేల? దాసివై
బాముల బొందగా వలసి వచ్చును నీవును దుఃఖితాత్మవై. 90

కట్టుపుట్టము లివి నార పట్టలు గద చెట్టు నీడ లివె యునికిపట్టులు గద !
పండుకొనుటకు దర్భలే ప్రక్కలు గద! యశన మీ వని గందమూలాదులె కద!
జటలె యాభరణమ్ముపై యటుగ నిటుగ గానఁ జరియించు నొక్క మృగంబు కరణి
నున్న నేనేడ? నీవేడ? సన్నుతాంగి! నీకు సరియగువాడను నేను గాను. 92

ఏ విరక్తుడ, ననురక్త వెంచ నీవు మన్మథునకు దావసికెవి మైత్రి లేదు
తాపసిని నేను మన్మథశక్త నీవు అస్వతంత్రుడ స్వాతంత్ర్య మరయ నీకు. 93

రాజు నఖిలేశ్వరుండు మా రామమూర్తి తన్ను జేరెడివారి సంత్రాత యతడు
నీకె వరవర్ణినీ! తగు నేస్త కాడు సుందరివి నీవ యాతడు నందగాడు. 94

ముదుసలి భార్య జానకి ప్రమోదము గూర్చునె రామమూర్తికిన్!
సదమలవర్ణినీ! వినుము చక్కదనమ్ముల జుక్కవైన నిన్
మునమున రామచంద్రు డిక బొందడె రెండవభార్యగాగఁ గో
విదుడు దయాపరుండు బహువిశ్రుతకర్ముని గొమ్ము భర్తగా. 95

నీవు సర్వార్థసిద్ధివై నెగడగలవు ఆర్యు డగు నాదు జ్యేష్ఠుని కాలివైన
నో విశాలాక్షి! యనతియే యువిధ నీక త్యాజ్యయే యా పరమరూప యా విరూప!

విను బోలు, నే మానుషి? నీదు రూపు
శ్రేష్ఠమే, నీక తాననే శీఘ్రగతివి
జానకి ద్యజించు. నా; రామచంద్రమూర్తి
కమలవర్ణిని! కందర్ప కాంతి కాంత! 97

తన సౌందర్య విశేష మెంచుచు సుమిత్రానందనుం డెంత యో
కొనియాడన్ బరిహాస మంచు నెద సంకోచింపకే రాముని
గని యా పర్ణకుటీరమందు బలుకున్ గామాక్షి నీ సోదరుం
డును వర్ణించె ననుం గ్రహింప వాకొ వాడున్ నీవునుం దుల్యులే. 98

శూర్పణఖ

వనిత ముదాన దా వలచి వచ్చిన జుల్కన గాదె యేరికిన్
వనజభవుండు మోహినిని వర్జము సేసి యపూజ్యుడయ్యె రం
భను విడనాడి మేకతలవాడుగ దక్షుడు నయ్యె నూర్వశిం
గొనమిని నశ్వనీసురలు గొల్పడరే తమ యజ్ఞ భాగముల్. 99

వినవొకొ మేన శాపమున వీడె గుబేరుడు స్వస్వరూపమున్
మునుపు ఘృతాచి శాపమున బూడిదగాడొ మరుండు భ్రష్టుడై
చనడొ మదాలసా మహితి శాపమునన్ బలి; మిత్రకేశి తి
ట్టున సతి గోలుపోయె గురుడున్ మఱపొందితె వీని సుందరా! 100

వనిత నిటుల్ పరాభవము పాల్పడ జేసిన నీవుగూడ భా
ర్యను విడనాడు కాల మది రాదొ! యికేల నిరాకరించినన్
నను విపు దేనె లక్ష్మణుని నాయమ సీతను గూడ మ్రింగెదన్
వని మన కడ్డముం దగులువారు మఱెవ్వరు? చూడు సుందరా! 101

అనుచున్ మాయాసుందరి పెనుగోఱల బైటపెట్టి భీకరరూపం
బున రాక్షసియై యుంకించెను జానకిపైన భర్తచెంతనె యుండన్. 102

వీరుడు రాఘవుండు కడు భీకర రాక్షసి గాంచుచుండియున్
నారిని జంపరాదనెడి న్యాయము నాత్మ దలంచి లక్ష్మణున్
ధీరుని జూచి రక్కసి యిదే యిక సీతను మ్రింగునేమొ! నీ
వూరక యుండరాదుగద! యొప్పుగ దీని గురూపి జేయుమీ. 103

అనునంతన్ రఘురాము చెంత గల దివ్యంబైన ఖడ్గంబుచే
గొని సౌమిత్రి, మదించి దుష్టయగు నాక్రూరన్ మహాక్రుద్ధనుం
గని, దానిన్ బిగబట్టి ముక్కు చెవులన్ ఖండింపగా, నాపె, వ
చ్చిన దారిం బడిపోయె రోదనముతో శీఘ్రంబుగా బర్వనన్. 104

భీకర ఘోరనాదమున బిట్టుగ వేయి విధంబు లేడ్చుచున్
నాకమునంటు ఘోషను వనాన విరూపత రక్తసిక్తయై
సోకు పడంతి పోవునెడ సుందర కానన సీమ యెల్ల ర
క్తాకుల మయ్యె బశ్చిమ దిశారుణ కాంతిని మించి యెఱ్ఱనై. 105

హాహాకారప్రతిధ్వనుల్ సెలగె నాయా కందరాంతస్స్థలిన్
దేహంబుల్ విదళించు జంతుతతి యెంతే భీతిపై బక్షి సం
దోహంబున్ నలుదిక్కులం బరువులెత్తున్ దేవతానీకముల్
హాహాం క్రోధ భయార్భటుల్ వినుచునున్నా రంబరాసీమలై. 106

మన్మథ మన్మథ మహిత రాముం డేడ?
లంబోదరా భామరాగ మేడ?
పంచబాణుని తండ్రి పద్మాక్షువిభు డేడ?
సోకుమూకలతన్వి సొబ గదేడ?
యాజానుబాహు డా యరవిందముఖు డేడ?
వికటానన కురూపి విధవ యేడ?
సర్వశుభంకర సకలలక్షణు డేడ?
భయదస్వరూప శూర్పణఖ యేడ?

భైరవ స్వర దారుణ వామ భాషి
ణి యది: ప్రియ దర్శనుండు నీల దేహ
కాంతి కాంతుడు రాముండు; కామిని యది
ధార్మికుడు రాఘవుండు సత్కర్మరతుడు. 107

రాముడా దయాపరుండగు రామల యెడ దుష్టలే యైన నతడు విశిష్టమూర్తి
స్త్రీ యని ఃమను తాటకిని వధింపకుండ విడువడే? యిట్టే యీమెను విడిచిపెట్టె.
చచ్చెను మగండు మున్నెపో సంతతి సనె గాని కామంబు పోదు రక్కసికి నింక
కామినులె స్త్రీలు జీవిత కాలమెల్ల నెటుల గామించె నీ వృద్ధ? యినకులేశ! 109

తొలుత హింసాత్మతో రామి లలన, కామ
వశత వచ్చుటం జేసి ప్రప్రథమ మందె
యామె హృది నొవ్వజేయుట యఘమటంచు
దాశరథి దయాపరు డింతదనుక దెచ్చె. 110

ఆదినారాయణోపము డాప్త జనుల
కపకృతి నొనర్చువారి దయం గనండు
రాఘవుడు సీత విజ భ క్త, రాక్షసి నెటు
గ సహియించు దనను బ్రేమ గాంచిన నది. 111

నేర మొకయింత సల్పని విరవరాధ
నెట్లు తొలుదొ ల్త శిక్షింప నెంచగలడు
కై కవశమున వచ్చిరి కాన కిటుగ
దీవి కతమున గానున్న దేమొ యింక! 112

శత్రు రణ ఋణ శేషముల్ నమయకుండ
గొంత విడుచుట తగునొకొ కోసలేశు
డేల విడిచె నిద్దాని బ్రాణాల తోడ
బతిత పగ బట్టునేమొ సర్పంబు పగిది. 113

మంచి మాటల విధి ద్రోయ నెంచె గాని తప్పునే కాలగతి యేని దగులకుండ?
విధి విధంబున విడె దాశరధికి మూల మౌనె ధర్మకర్మంబు చే బూన వింక? 114

తన కతితుల మోహింప దగునె యెందు నట్టి దుష్కృతి ఫలితంబు కట్టి కుడుపు
జాపుదప్పి కురూపయై చనె నటంచు సురలు పలుకాడ దొడగుచు పురిసి.రంత.
గహనంబున గగనంబున విహరించెడి పక్షివోలె వెలది వెడలి యా
సహజన్ము ఖరుని వాదకు దహ తహ రక్తంబు తోడ ధరణిం దొర్లున్. 116

వడి వడి కొండను జారుచు బిడుగు వలెన్ భూమి బడిన విహ్వాల గని యా
తడు రాక్షసపతి బహు క్రు ద్ధుడుగా బలుకాడు నాడ తోడున కంతన్. 117

నేను ఖరుండ వీరుడ వనీస్థలి రాజ్యము సేయుచుండ నా
కానన మందె విన్నిటుగ గాసిల జేసినవా డెవండె? ర
క్తానన! నీదు నాసికయు గర్ణములుం దెగియుండె గా! జన
స్థానవిభుండు నుండ ననుజన్మద, నీగతి నీకు బట్టెనా ? 118

ఎవడోహో విను దాకగా గలుగవా డెందుండెనో చెప్పు నా
జవమున్ దూషణ ముఖ్య రాక్షస మహాసత్వంబు లో నెంచకే
దివముం జేర దలంచువా డతడు నా తీక్ష్ణాసి కాహారమై
యవరోధంబు ఘటింపజేయగలవాడా లేడు నా కీభువిన్. 119

మోహసంభ్రమముల వీడి ముక్కుఁ జెవులు దెగిన సంగతి నంతయు దెలుప వమ్మ
యెమ్మ కదలని కృష్ణసర్పమ్ము నెవడు వ్రేల గొట్టినవా డహో లీల గాగ. 120

ఎవ్వాడు మృత్యుపాశమునె యీగతి గంఠమునందు దాల్చెనో
యెవ్వఁడు ద్రావినాడు విష మింతగ దాకుటజేసి విన్ను? వా
డెవ్వఁడు కామరూపిణివి మృత్యువుతో సరియైనదానివే !
యివ్వగ గూర్పగా గలిగె నిట్లు మహాబల సన్నివిష్టవే ! 121

నీవహో వీరవనితవు! నిన్నె యొక్కఁ దేవ గంధర్వు లగువారొ దివ్యమునియొ
యెవ్వ డిటు విరూపగ సల్పె నివ్వనాన నింద్రుడేని నా కపకార మెంపలేడు. 122

ఎవరు మదీయబాణముల కిత్తురి ప్రాణము లొడ్డినారొ! నే
నెవరిని నాదు చాపమున కిప్పుడె యాహుతి సేయజెల్లునో
భువి బడ నేని రక్తమిక భూస్థలియుం జవిజూడనోచునో
వివరముగాగ జెప్పు యమువీటికి బంపెద వాని సోదరీ ! 123

ఏనె యలంగితే, నతని నీ యిల గావగలారు లే రహో,
వానికి జావు నిశ్చయము వాసవుడా సురులేని రక్షణం
బూనగజాల రక్కసీ! విను, బోలిక జెప్పుమటంచనన్ జన
స్థానము నేలువాడు తనతమ్ముడు రక్కసి బల్కె వానికిన్. 124

క్రోధఘూర్ణి తయయ్యు నా రూక్షనయన
రామ లక్ష్మణ సౌందర్యరాశి నెంచు
పురుషులనె మోహమున ముంచు మోము గాంచి
యరసి పురుషోత్తముని వాని మరువగలదె ! 125

కోపయుతులు ప్రమత్తులు కూర్కువారు బయట బడజేయరే స్వస్వభావ మర్మ య
న్నట్లె శూర్పణఖ దెలిపె నాత్మగతమె తన్ను గాంచి క్రుద్ధుండైన యన్న కపుడు. 126

కామము విఘ్నంబైనను గాముని గ్రోధంబుతోడ గనలుచు గూడన్
గామము వీడగ జాలదు రాముని యెడ వానిరూప లావణ్యమునన్. 127

తరుణులు సుందరుల్ స[illegible] తాపసవేషులు నన్నదమ్ములున్
మరుని సమానకాంతి సుకుమారులు సింహబలుల్ సుధర్మముల్
కరముల బూని యుండెదరు కంజదళాక్షులు వల్కలాజినాం
బరులు ప్రసన్నమూర్తు లసమానులు వారలు రామలక్ష్మణుల్. 128

గంధర్వరాజులో కాక మానవులో
యెందుండి వచ్చిరో యెఱుకగా లేదు. 129

దశరథసుతులంట ధర్మాత్ము లంట
విశదంబుగా దెంచ వీర లెవ్వారో! 130

పంచవటి కేగుదెంచిన వారు వీరు పార్థివ వ్యంజనంబుల బఱగు, వారి
జడలు కృష్ణాజినంబులు జూటుచుండె దాపసులు గాగ వారలు తరుణులయ్యు. 131

కందమూలాదులే తిని గ్రాలువారి మధ్యను సుమధ్యమయు రూపసహిత తరుణి
సకల భూషణ భూషిత చారువదన మెలగుచున్నది యద్దాని లలన గంటి. 132

దాని కతమున నన్నిట్లు దాశరథులు జేసినార లనాథగ శీఘ్రగతిని
రామ లక్ష్మణ సీతల రక్తమెల్ల నురుగుతో ద్రావియే శాంతి నొంద గలను. 133

రణమునన్ వారి సువ్వర రక్త మెల్ల ద్రావ నెంచితి నదియ నా ప్రథమ వాంఛ
దీర్పుమీ సోదరా ! దీని దీర్పు మింక ననుచు శూర్పణఖ పలికె నార్తితోడ 134

చనువున సోదరి గాథను విని యా ఖరు డుగ్రు డగుచు వీరుల నిపుడే
పనిచెద దాశరథుల సీతను జంపగ రక్త మీవ ద్రావగ భగినీ! 135

కాముకురా లని తమ్ముడు తా మనమం దెంచకుండ దను గ్రోధంబున్
భామిని నటియించుచు నా రామాదుల రక్తపాన రక్తియె కోరెన్. 136

పంపెద నిప్పుడె రాక్షసవీరుల వైరులన్ రణమందునన్
జంపగ రాముని లక్ష్మణు సీతను శత్రురక్తము నీకిడన్
ద్రుంప మదాత్మయ సర్వము వారెవరో యెఱుంగవలెలగదా
సొంపటి వార లధర్మగుణంబున స్రుక్కగన్ విధి చెయ్దిగా 137

అని పిల్చె ఖరు డంత నని మొనగాండ్ర
తన యెడ భక్తుల ధైర్యవంతులను 138

క్రోపంబు జ్ఞానంబు కూడుకొనంగ
జూపరుల్ భయమొందు చూప్కుల బలుకు 139

రాముండట ! సలక్ష్మణుండునట! దుర్వ్యాపారుడై దండకా
భూమిం బంచవటి న్నివాసియట ! నన్ భూరిప్రతాపోజ్జ్వలున్
భూమీశున్ ఖరు నెంచకే వనితకున్ ముక్కుంజెవుల్ గోసెనా
రామున్ లక్ష్మణు సీతనుం గనుడు పోరన్ వారి మోక్షార్థమై. 140

వారి వేడి రక్తము ద్రావ భగిని వాంఛ యామె కోర్కెను నెరవేర్ప నెంచినాడ
పొండు పొండింక వారల బొడిచి చంప దీవి వెంటనె గొని యా ప్రదేశమునకు. 141

దశరథసూనులంట ! కడు దాపసవేషులుగూడనంట! తా
రశనము గాఁగ దుంపలు ఫలాదులనే కొనువారలంట! ద
ర్పశయనులంట ! నా వని నివాసము సేయగ వచ్చిరంట! విం
టిశరములన్ నిరంతరము తీవిగ బూనెదరంట వారహో ! 142

చక్కని చుక్కయైన వనజాక్షి యొకర్తుక వారిమధ్య నెం
పెక్కిన కూర్మినుండు నట వెంటనె వారి నెదిరించి రండు నా
యక్కకు వీరె ముక్కు చెవు లాదిగ గోసినవారు వీరలే!
త్రొక్కగ జేయ నర్హులు! విరోధులు! డీకొన నొప్పు మానవుల్! 143

హతులుగా నున్నవారి శోణితము ద్రావ
భగిని కోరిక నెరవేర్చువాడ నిపుడె
దీవి [illegible]న మీకు మార్గంబు దెలుపగలదు
పొండు పొండింక ననుచు ఖరుండు పలికె
పదియు నల్వుర రాక్షసవరుల గనుచు. 144

స్వాపరపరంబుగా భావముందెలిపె
నప్పుడా ఖరుండు దా రిపుల లోనెంచి 145

తన నాశనంబును దా నెంచెలోన
మనమున జ్ఞానంబు గనె నొక్కవాడు ! 146

పూర్వజన్మస్మృతి బొందెనా వాడు
గర్వాన మెలగెడి కఱకు రాక్షసుడు. 147

శ్రీరామ శబ్దంబు చెవి సోకునంత
ధీరాత్ము డాత్మలో దెలివొందె నొక్క ! 148

జనన్ రాజాజ్ఞను విడె దానన్ స్వాత్మావగతము ద్వరలో బొందన్
దాని యనుజ్ఞను గొనుటన్ బూనిరి శూర్పణఖ గూడి పోవన్ వారల్. 149

రాముడు - రాక్షసులు

[illegible] గొని రివ్వన వాయువు గతి జేరి రసురవర్గము రామున్
దాఁపుచు నుంచిన శూర్పణఖాయుతులను రాముడు గని యనుజున కంతన్. 150

పలుకును లక్ష్మణ ! కనుదైత్యులు పరువున వచ్చెడి నిట నుండుము సీతా
లలనా రక్షణమున నే వెలుపలి కేగి యసురతతి వేగమె త్రుంతున్. 151

అనుచు సీతను లక్ష్మణు నా కుటీర మందె యునిచి రాక్షసులకు ముందు నిలిచె.
శూర్పణఖ రాము లక్ష్మణు జూపి యపుడు జానకిని జూపి చిఱునవ్వు బూని నిలచె.

అల్లె రాక్షసులును గూడ నాగి రంత నడవి గార్చిచ్చు గని ద్విప మాగునట్లు
రాఘవుని జూచునంతట రాక్షసాళి దుష్టమతులయ్యు నల్లె నిశ్చేష్టులైరి. 153

దశరథుని పుత్రులము మేము దైత్యులార ! రాము డనువాడ నాతండు లక్ష్మణుండు
సీతయును నామెయే యీమె చేరినాము దండకాటవి శాంతిపై దపము సేయ. 154

కాయల గూరలం దినుచు గాలము బుచ్చుచున్నవారమే !
యే యపకారమున్ సలుప కేరికిగాని జరించుచుంటిమే !
యీ యటవీస్థలిం దపమునే కొని ధర్మము బూనియుంటిమే !
మా యెడ మీరు నే డిటుల మానుషహింస దలంచి రేలకో ! ! 155

కాననమున గల బ్రహ్మజ్ఞానుల రక్షించుకొఱకె చాపం బిది నే
మౌనులయాన వహించితి దానన్ బాపాత్ములను హతం బొనరింతున్. 156

దుష్టుల సంహరణార్థము శిష్టుల రక్షింప నింటి జేగొని కష్టా
విష్టవనిం దిరుగాడెడి నిష్ఠ వహించితిని త్రుంతు నే డిట మిమ్మున్. 157

ప్రాణాలు దక్కగా బారి పొం డింక
ప్రాణాల దీసెద బారవియెడల 158

నిలువుడు నిలువుడు బలుకాకులార !
తలవని తలపుగ దారసిలి రహ 159

అని నారి లాగయమిత బలుండు
జనియించె టంకృతి చదలెల్ల నిండ ! 160
మనుజుని రాముని మాటల వినక
దనుజులు మారాడ దలకొని రంత 161

తెవి యాన లేక రిపులు మారాజ్ఞన నుండ శిక్ష సేయకుండు టెట్లు ?
లిదియుగాక భగిని-నిట్లు కురూపిగ జేసినారు మరణశిక్ష తగదె ! 262

పలువుర ముంటి మేము నినుబట్టి వధింప నొకండె చాలు నీ
పలుకులు గట్టిపెట్టు మిక బ్రాణము వీడెద వీవు పోక మా

కులపతి వీరుడౌ ఖరునకుం గడు నెగ్గొనరించి కోపముం
గలుగగ జేసినట్టి విను గయ్యమునన్ వధియింతు మిప్పుడే. 163

మనుజుఁడ! యెంత సాహసము! మా వని మాకవమాన మూని మా
దనుజుల యుద్ధరంగమున దార్కొననుంటివె! యేదొ వింటిచే
ధను విదె ముక్కలై పడును ధాత్రిని శూలమునీ దెబ్బతీయ, మా
సునిశితఖడ్గశూలముల స్రుక్కవె నీవును రామ! కాచుకో ! 164

నిలువగలాడవే యెదుట నిల్వక యేడకు బోగలాడ వీ
యిల దనువుండుదాక, మము నీవెదిరించి మనంగజాలు దే.
లలితధనుస్సు ముక్కలయి రాలు విదే భువి గత్తిదెబ్బ నా
వల బరువెత్తవో మనగ బట్టి వధింప మె యొక్కరుండవే. 165

అని తొలుదొల్తగా నా సురు లనికిం దిగి యాయుధము ల నంతన విసరన్
దనబాణంబుల రాముడు తునియలుగా జేసె వానిదోర్బల మొప్పన్. 166

పరిఘ శూల పట్టసముల వైచి రంత బదియు నలుగురు ఖరుబంట్లు వదియు నాల్గు
స్వర్ణభూషితబాణాల వరుస వీడి రక్కసుల ప్రాణముల దీసె రామ విభుఁడు. 167

వీడిన రాముని తూపులు సూడుల హృదయాల జొచ్చి చొఱబడె భూమిన్
వాడలు రక్తమయంబులు చూడగ భీకరములయ్యె శూర్పణఖ యటన్. 168

బిగ్గఱగా గడు నార్చుచు గగ్గోలున వెడలి ఖరుని గాంచుచు నేలన్
సిగ్గొక యింతయు లేకయె దిగ్గున బడి యేడ్చు నాకు దిక్కేవరంచున్. 169

ఓయి! ఖరు డుండగ నినాథనోయి చెపుమ! నీవు పంపిన శూరులు నేలగూలి
రోయి! రామునితూపుల కోర్వలేక దాని గవి భీతి నేడ్చెడిదాన మఱల. 170

వచ్చినవారల జావని నమ్మన్ హెచ్చగు ప్రీతిని నెంచెద వాకో
వచ్చుచు రాముని వక్షము నేడె చెచ్చెర నేగుము సేనల తోడన్. 171

వారలు రామలక్ష్మణు లపారితవీరులు కావి మానవుల్
వోరున వారి జంపగల భూరిబలాఢ్యుడ వీవ కావ? నీ
తీరుగణింప మిధ్యగ ద్వదీయపరాక్రమ మెంచవచ్చు నీ
వారయ వంశపాంసనుడవా యని తోచెడి నాకు దుర్బలా! 172

మానక వారునిన్ను గుల మంతయు నాశన మొంద జేయరే
లానవా! దుర్బలుండ వాకొ! కాంచవొ దేర్యము? నీ విటుల్ మహా

దీనుడ వంచు వా రెఱుగదెంపున విన్ను వధింపరే జన
స్థానమునుండి పొమ్ము తల దాచుకొనంగ సబాంధవమ్ముగా. 173

దశరథరాము డెంచగ నదా బలవంతుడు వాని తమ్ముడున్
విశదము సుమ్మి బాహుబలవీరుడు వాడె కురూప జేసె నన్
యశము గణించి వారల రయంబున ద్రుంపుము నీవు వి బలం
బశవిసమానులేగద! ఖరా! వెనుదీయుట సిగ్గుచేటుగా. 174

ఈ విషాద నక్రాన్విత మీ భయదత రంగ సంకుల దుఃఖనీరధివి మునిగి
తేలకుంటివి నన్నింక దేల్చ వొక్క రామలక్ష్మణాదుల జంపి రాగదోయి! 175

రాముండు పగవాడురా నాకు నీకు
ధీమహిమ వెడలి త్రెంపవే యతని 176

నీవుండె ప్రాణాల నే వీడుదాన
నే మని యవమాన మే బొందియుందు. 177

అని మోదుకొనుచు బొట్ట నిలనుబడి దుఃఖించు భగిని రావము వినుచున్
వినజాలక ఖరు డామెకు ననునయ వాక్యంబు లాడి యంతట బలుకున్. 178

ఖరుడు

సోదరి దుఃఖమూర్తి గనుచున్ విని ములుకులవంటి పల్కులన్
మోదవిహీనుడై కనులు మూయుచు విప్పుచు నాత్మసంగతం
బేదొ తలంపునం బడి యహీనసమీక్షణ మొంది లోన వి
చ్ఛేదముగాగ సంశయము శ్రీఘ్రగతిన్ సమరాభిలాషుడై. 179

చెల్లె లిటుగ నర్థార్థమై చేరె దన్న టంచు నెంచియు నది విధియన్నరీతి
రాముని వధించి రావలె రణ మొనర్చ సిద్ధమగు మవి దూషణు జీరి పలికె. 180

వెడలె దను ముందు; పౌలస్త్యవీరతతికి మరణ మొదగూడ; రాఘవవరున కెంచ
జయము లభియించి పేరొంద జగతియందు; దెమ్ము తే రింక దూషణ! తెమ్ము తేరు
దూషణుం డంత సైనిక భూషణుండు తెవియాజ్ఞను బదివేల సైనికులను
యుద్ధసన్నద్ధులను జేసి సిద్ధమాయె రాఘవునిమీద దండెత్తి రణ మొనర్చ. 182

స్వర్ణభూషితమును హేమచక్రవితతి రమ్యమై దూర్యమయకూబరంబు, గనక
నిర్మిత రవిచంద్ర కుసుమమీనీశజయతి మేరుశిఖరసమనమౌ తేరు దెచ్చె. 183

వింటి తూపుల ఖడ్గాల వెలయుదాని మంగళకరధ్వజంబు సెలంగుదాని
నుత్తమాశ్వయుతంబుగ నొప్పుదాని రథము నారోహణ మొనర్చె రాక్షసపతి 184

ఖరునిసేన మహాభయంకరముగాగ ఖడ్గ శూల ముద్గర చక్ర కవచములను
పట్టస గదశక్తులు విల్లు వజ్ర మాది వివిధయుద్ధాయుధాళితో వెడలె నంత. 185

ఖరుని రథంబును గదెలెను ద్వరితగతిన్ దిక్కులెల్ల దద్దరిలంగా
ఖరుని ఖరస్వన మతిభీకరమాయెన్ రాళ్ల గురియు కంధర మనగన్. 186

తేరు కదలె ఖరునితీరు గాంచుచునేమొ యపశకునము లయ్యె నంతకంత,
నదిరె వామభుజము నాతని స్వరము గుంటువడియె మాట కుంటువడియె. 187

పగలె యయ్యె జుక్క లగుపడె మింటిలో సూర్యబింబకాంతి సురిగిపోయె
నక్కకూతలపుడు నాల్గుదిక్కులనుండి వినగ నయ్యె ఖరుడు విధి నెఱుంగ. 188

రక్తవర్ణంబు రాళ్లవర్షంబు లపుడు ఖరుని సైన్యంబు పై నమంగళముగాగ
నంధకారంబుగా మింటి నలముకొనిన ఘోరభీకర మేఘాళి గురియదొడగె. 189

రమ్య పుష్ప యుక్త రాజమార్గంబున బోవుచుండి తేరు బూన్చిన తుర
గాలు నట్టె రథ్య దూలిన వప్పుడు దైవవిధి యదేమొ! దైత్యపతికి. 190

పెద్ద గద్ద యొకటి పెనుభూత మసురీతి వ్రాలె ఖరుని తేరుధ్వజము పైన
భయద జంతువితతి పక్షితతియు జన స్థాన మెల్ల నఱవబూనె నపుడు 191

రథము జుట్టుముట్టి రాక్షసవీరున కభిముఖంబుగాగ నఱచువాని
రాపులుగుల గ్రద్దల విహంగమములను నక్కల గనెడి పయనాన ఖరుడు. 192

పగలె రాత్రి కాగ బ్రబలెను జీకటుల్ పెద్ద గాలి వీచె భీతి గొలుప
పుష్పఫలములన్ని భూమిపై రాలెను వృక్షవితతి దోచె నెండినట్లు 193

భూమి కంప మొందె బుట్టలు గుట్టలు కొండ కోన లెల్ల గూలునట్లు
భీతి గొల్పు పెద్ద పిడుగులు పడినవి నాశనంబుగాగ నదులు వనులు 194

ఇన్ని విధముల నశుభము లెన్నొ గనుచు ఖరుడు చలియింపకయె తేరు గదలనిచ్చు
బంద లగువారె వెనుకాడు వా రంటచు ధైర్యమును జెప్పె సైనికతతుల కపుడు 195

బలవిహీనుండగాను నేపాటిసేయ మృత్యువైనను క్షణమాత్ర మృతిని బొంద
గోపకించిన రవి దుల్లు గొండనుండి యపజయం బెఱుంగని వాడ నసురులార! 196

సురపతియైన నాబలిమి స్రుక్కడె? మానవవైరు లిట్టె యీ
ఖరుని నిశాత తీవ్ర విశిఖంబుల జావరొ? లెక్కయేల? నా

సురలకు రండు రండు రణశూరులుగా నవి తెడు పల్కు వా
క్స్ఫరణికి హృష్టులై చనిరి సైనికులెల్లరు మృత్యుబద్ధులై. 197

అసురభీకరార్భటులు నా రణదుందుభి నిస్వనంబు లా
యాః సురవర్గ మెల్ల విని యంబరవీధిని జేరి పల్కు మా
కోసలనేతకే జయము గూడెడిగావుత సాధురక్షణన్
భాసిలు రామచంద్రునకు స్వస్తులు చెప్పిరె యెల్ల దేవతల్. 198

రాముడు సర్వపాతకవిరాముడు సజ్జన సత్య రక్షణో
ద్దాముడు నాసురాంతకుడు ధర్మవిదుండు మహాపరాక్రమ
శ్రీమహితుండు మౌనిజనసేవితుడున్ బురుషుండు వానికిన్
వ్యోమచరాళి స్వస్తి యను టొప్పదెః మౌనులు స్వస్తి జెప్పరే. 199

"స్వస్తి గో బ్రాహ్మణే భ్యోఽస్తు" స్వస్తి రామ
చక్రపాణి ము న్నసురుల జంపినట్లు
రాముడు ఖరుని వంశవిరాము దగుత
మనిరి దేవతల్ మౌనులు నమితభక్తి. 200

బలపరాక్రమవంతులు పదియు రెండు మంది ఖరువెంట దూషణుం బట్టి సైన్య
నాయకులు నల్గురును నుండబోయి చేరి రొక్కపెట్టున రామాదు లున్నచోట. 201

రామ లక్ష్మణ మహా రణవీరవరులు
భూమి యద్రువ వచ్చు భూరిసైన్యంబు 202

కని వీరు చావునే కాంక్షించువారు
మనపైకి వచ్చెడి నని సల్ప నెంచి. 203

శోకమూకల చాపె సూచించు నేటి
భీకరదృశ్యాలు బీభత్సగతులు, 204

సంగరమున్ మహాభయద శాత్రవ రాక్షస మారణంబు నె
ట్లుంగిని దప్పవంచు నవె పక్షుల కూతలరీతి దెల్పు సీ
తాంగన తోడదుర్గమ గుహాంతరమందున నిల్లు యానియే
యంగద లేక నీ వమర నాహవకేళి జరింతు నొక్కడన్ 205

ఈవును యుద్ధకోవిదుడవే, తగ దీ హొకకులుండవే రిపుల్
జావగ జేయ లక్ష్మణ! యనంశయ మిద్యాది, కాని నేనె, నా

లావున నీ నిశాచరబలంబు సమస్తము ద్రుంప నెంచెదన్
నీ విక బొమ్ము, నా నుడివి నీవ గ్రహింపుము ధీవిశారదా! 206

అల్లదియే సమీపమున కాసురసైన్యము వచ్చుచుండె వా
రెల్లరు రాకముందె చను మీ యను సన్నుతలం పెఱింగి తా
మెల్లగ సీతతోడుత సుమిత్రసుతుండు గుహం జొరన్ ధరా
వల్లభు డంత బొంగెడి నవారితదీప్తి మహాగ్నిహోత్రుడై. 207

దక్షిణభుజంబు నదరెడి దరచుగాగ నదియ యాపదసూచించునంతె, మనకె
జయము పథ్యంబు నీదు ప్రసన్నముఖమె తెల్పుచున్నది యద్దాని దేటగాగ. 208

కవచమును దాల్చి పూనుచు గార్ముకంబు దివ్యమంగళవిగ్రహ దీప్తితోడ
బయట నిలబడె కోదండపాణి యంత నంత నాసురసేనయు నతని డాసె. 209

జ్యాఘోష సల్పుచు నా రామవర్మ
యాఘోర రుద్రాంశయా యన దోచె 210

ప్రళయకాలాగ్నిగా ప్రజ్వలితుండు
విలయతాండవమూర్తి విశ్వేశు డనగ. 211

అక్షయబాణాల దక్షుడై నిలిచె
దక్షయజ్ఞధ్వంసి తానైయె నటుగ. 212

ఖరుని రథంబు తీవ్రగతి గార్ముకహస్తుడు వీర రామునుం
బర నిలిచెన్, రణప్రగతి దైత్యసమూహము చుట్టుముట్ట భీ
కరుడయి రౌద్రుడై రణముఖంబున నిల్చిన రామమూర్తిపై
ఖరు డపు డుగ్రు డౌచు విశిఖంబుల వేయిని వేసె నొవ్వగన్. 213

అమ్ములు ఖడ్గ శూల పరిఘాదులు రాక్షససైన్య మెల్ల నొ
క్కుమ్మడిగాగ రాఘవుని కోమలదేహముపైని వేసి యా
లమ్మున సింహనాదము లనంతముగా నొనరింపగా దిశాం
తమ్ములు పిక్కటిల్లె ఋషి దైవ గణంబులు భీతిజెందగన్. 214

గజ రథాశ్వ యోధులు వేలుగాగ రాము నలసుకొనినారు పదిమారు లాయుధముల
వాన గురిపించి రప్పుడు కానసయ్యె నొక్కరుని రాము రాక్షసవ్యూహమందు. 215

రక్తసిక్తుడయ్యు రణాంగవీరుడు నొక్కరుండె యయ్యు వ్యూహమందు.
నశనిపాతమైన నటునిటు కదలని కొండవోలె నుండె బెండుపడక. 216

రామనారాయణుం డంత రాక్షసాళి కొక్కరున కొక్కడై తోచి పెక్క రాము
లుండినవిధాన రణ మూని యొక్కరుండె లీలగా బాణముల వీడె కేళివోలె. 217

### రాముడు - నారాయణ స్వరూపము

గండ్రగొడ్డలితోడ గదన మూనిన వాడు
గండ్రగొడ్డలిరాము గాంచు నెదుట
పట్టి త్రిశూలంబు గొట్ట నుండినవాడు
శూలహస్తుని రాము జూచు నెదుట
వింటిని సారించు వీరుండు విలుకాడు
కార్ముక ధరు రాము గనెడు నెదుట
గద బూని యని సల్పగా దలంచినవాడు
ఆ గదాధరు రాము నరయు నెదుట

నెన్ని వేలుగ రాక్షసులున్నవారొ యన్నివేలుగ రాఘవులచట గలరు
ఎవ్వడెటు పోరు సల్ప నుంకించు వాడొ యట్లె రాముండు వానితో నని యొనర్చె.

వేనవేలు తూపు లెన్నొ వీడి రాము డపుడు వే
పూని యర్ధచంద్రరూపముల్ గలట్టి విశిఖముల్
వానగాగ రాక్షసాళిపైన నేయ ఖరుని యా
సేన యైదువేలమంది జీవముల్ విడె త్రుటిలో 219

అశ్వ గజ రథ వాహిను లన్ని గూలి పీనుగులపెంటగా మారె విపినసీమ
యక్క డక్కడ మిగిలిన యసురు లంత గావుమని దూషణుని జేరి కావు మనిరి.

### దూషణుడు చచ్చుట.

దూషణు డంతట వేగమె కత్తినిదూసెను రాఘవవీరునిపై
భీషణముల్ గిరులం దరువుల్ గడు వేసిరి దైత్యులు రామునిపై
రోషముతో వడి క్రోధనుడై యని రొప్పుచు బోరెడి శాత్రవునిన్
దూషణు సైన్యయుతంబుగ రాముడు ద్రుంచెను లీలగబోరుచునే.

దూషణుం డంత జచ్చుట దుఃఖ మంది యా మహాకపాలుడును స్థూలాక్షు డపుడె
కూడుచు ప్రమాథి రాఘవుతోడ బోరి యిషువులను వీడి యమపురి కరిగినారు 222

అంత నాక్రోశమున దక్కు నమితబలులు సైన్యనాథులు పదిరెండు సాయుధులును
హా యని గాకుండ మిగిలిన యా సురాళి గూడి పోరాడి ప్రాణాల వీడినారు. 223

పాదసులపైన నిల్చినవాడు నరుడొకండె పదునొక్కవేల రక్కసుల జంపె
మాంసరక్తకర్దమముల మయముగాగ నరకమును బోలి యవ్వని బఱగుచుండె.
ఖరుడు త్రిశిరుండు రాముండె కదనభూమి మిగిలియుండిరి త్రిశిరుండు మిక్కుటముగ
గోపఖేదాశ్రితుండయి గూలె నవని రాము డాక్కొని త్రుటిమాత్ర రణమునందు. 225

కూలినవారి జూచి కడు గుందుచు గొందఱు సైనికుల్ వడిన్
గాలికి బుద్ధిసెప్పి మెటొ కాననసీమ గుహాంతరంబులన్
గాలము బుచ్చబారిరి వికావికలై చనువారి బిల్చి తా
నాలమునన్ దగుల్కొనియె నా రఘురామునితోడ నొక్కడై. 226

రథికుండగు ఖరుడు మహా రథుడగు రాముండు వీరరణ మొనరింపన్
విధిగా నొండొరు దాకిరి పృథివీతల మెల్ల వణికె వీరులు గదియన్. 227

ఖరుని బాణంబుల ఖండించు రాఘవుం
డొకదాని వెంట వేరొక్కదాని
రాముని తూపుల రాక్షసవీరుండు
దరిజేరనీయడు దారిని ద్రుంచు
రథముపైనున్న యా రాక్షస యోధుని
భువి గూల్ప యత్నించు భూపవరుండు
అడుగైన వెనుకాడ కచట రాముడు విల్లు
నతడు పర్విడజూచు నసురరాజు

ఆయుధంబుల మార్చు నా యసురభర్త
ధనువులను మార్చుచుండె భూధవుని సుతుడు
వేనవేలుగ రాముండు వేడితూపు
లడ్డుకట్టగ రవికాంతి కడ్డుపడెను. 228
యమునికై వడి నంపి యా ఖరుండపుడు
సముచితబాణాల సారించివైచె. 229

వింటని ముష్టి, బట్టుకడ, వీరుడు రాముని విల్లు గొట్టి బల్
బంటుతనాన ముక్కలుగ భగ్న మొనర్చియు వింటి, గొట్టె నా
కంటకు డేడు తూపుల ఖండముగా బడ రామువర్మమున్.
మంటవలెన్ జ్వలించె రఘుమాన్యుడు వర్మము వోవునంతటన్. 230

వేయి శరసుల వైచి యా వీరరాము తనువు బీడింప ఖరుడు, నా దాశరథియు
క్రుద్ధుడై తడ వొనరింపకుండ బూనె మహిత వైష్ణవధర్మంబు రహి జెలంగె.231

ఆ యగస్త్యు డిచ్చిన యింటి నప్పుడెపట్టి కనక కాంతి శరంబుల ఖరుని గొట్ట
నతని కాంచనధ్వజము వ్రయ్యలయి కూలె దివిని రవి వీడి భూమికి ద్రెళ్ళినటుగ.

ఖరుడు భగ్నధ్వజుండయి విరథు డయ్యె నశ్వతతి చచ్చె సారధి హతుడునయ్యె
వైష్ణవసుధర్మవశుడైన వైరి ఖలుడు భూమి కాలిడినిల్చెను రామునెదుట. 233

సారధి చచ్చె, నశ్వతతి జచ్చె రథంబును గూలె, విల్లు చే
జారె విభంగమై, ఖరుడు చావక చచ్చియునుండి గూడ హుం
కారములన్ గదం గొనుచు గయ్యము సల్పగనుండె, వానికిన్
సారసనేత్రు డంత పరుషంబగు మాటల జెప్పు మెత్తగా. 234

బలగము గల్గియుండి గజ వాజి రథాన్విత వాహినుల్ పదా
జాలు గలవాడవయ్యు గడు శూరవరుండవు వయ్యు దర్పలం
బుల గన వేల లోకహితమున్ భయదారుణకర్మ మూని జీ
వుల కపకారమే సలుపబూనుట చెల్లునె? రాక్షసా! ఖరా! 235

ఎవడిల దుర్జయుండగుచు నెప్పుడు ప్రాణుల హింస చేయునో
యవనిని వానిజంపుటకె యందఱు బూనెడివారు : చంపరే
పావి దిరుగాడు సర్పమును భూరిభయంబున నెల్లరేకమై
భువనభయంకరుండవయి భూసురులన్ మునులన్ వధించదో ? 536

సజ్జనాళి మునులన్ జంపెదవే ఖర! యేమి బాము కొంటివీవ చెపుమ ?
పాపకర్మదప్పు బలువురు ద్వేషింప జగతి పతియుగూడ సౌఖ్యపడదు. 237

లోభకామవశత లోకాపకారిగా బఱగువాడు తుదకు భ్రష్టుడగును
బ్రాహ్మణి వడగండ్ల భక్షింప జావదె కట్టికుడుపుబాపకర్మమల్లె 238

వేరు తెగిన చెట్టు విధమున గూలదె పాపకర్మమూనువాడు భువిని
దుష్కృతంబు ఫలము విక్రమించదుసుమ యదనువచ్చు దాని ననుభవింప. 239

ఋతువు ననుసరించి వృక్షంబు పుష్పించు తీరు, పాపకర్మ తెఱగుకూడ
కాని యమిత ఘోర కర్మల ఫలితంబు శీఘ్రగతిని గర్త మెందుగాదె! 240

విషయుతంబు గూడు విడువకతినువాడు క్షణములోన జచ్చు సరణి సుమ్ము
పాపఫలిత మొకట బంతినయంతనె ప్రబకనేర్చు నెవడు రాక్షసుండ ? 241

ప్రభువునాన వనిని బాపాత్ములను జంప వచ్చి యధియ దీక్ష బోచ్చినాడ
దండకాటవి నింక దైత్యులబాధను మునులు పొందకుండ బూన్కిగంటి. 242

పాపకర్ములపాలౌట భ్రష్టమైన నీ తనువు జీల్చి యీపలి నెగడు వాడు
నిశితకాంచన భూషిత విశిఖపంక్తి గనుదు వీ విద్దె యో ఖర! కన్నులార. 243

ఈ ఏక జేరనుంటివి సుమీ నిజసైన్యముతోడ గూడి ము
న్నీవు భుజించియున్న మునిబృందము నాకసమందుఁ వారు నీ
చావును గోరరే యదె నిశాచత కాంచుము వారి, విన్ను నీ
లావును జూచుచుండిరి విలంబనమేలను వారి గూడుదే! 244

ఎంతయో నీబల మంతయు జూపి
ద్రుంతువే నన్నింక ద్రుంచుము నీవ. 245

సరిబోల నందువా? సమయింప నన్ను
బరితాప మూనిమీ పాపకర్మలకు. 246

ఖరుడు గదాన్వితుండు నిజకార్ముక వీరుల సర్వసైన్యమున్
దురమున బాసి యొంటరిగ దోర్బలవంతుడు నయ్యు ఖిన్నుడై
బరగుచు నున్నవా డతని బట్టి వధింపక రాము డా దయా
పరు డనె మంచిచెడ్డలను వానికి మార్పు జనింప నాత్మలో. 247

తుదకేన్ బశ్చాత్తాపం బొదవి ఖరుండు శరణంబు నొందెడిగతిగా
విదితంబుగ వేదాంతము హృది కెక్కగ రాము డంత నేర్పడ జెప్పెన్. 248

రామునిచేబడి చావగ నేమది నెంచినఖరుడపు డేపధిమారున్
సామంబున దండనయే రాముం డెంచ బలుకాడు రాక్షసు డంతన్. 249

అంతవాడ వింతవాడ నంచు నిన్ను నీవె కొం
డంత వానిగాగ జెప్పు దాహ ! వీరవర్యు లి
ట్లెంతురే స్వకీయశక్తి యేది దాని జూపుమీ
సుంతయైన భీతి జెంద జూడు నా బలంబునున్. 250

అహహ యాత్మస్తుతియె తెల్పు నల్పు డవని
గుశలు స్వర్ణకాంతిని మండి కుమిలిపోవు
గాని యితరుల దహియింప గలవె రామ !
యట్లె యాత్మస్తుతిపరుండు హతుడు సుమ్ము. 251

చంపుట నీవు అల్పుల నిశాచరులన్ వనీ నక్కడక్కడన్
దెంపుగ బల్కుచుంటి వహః ధీరుడ నంచని తన్ను తానె కీ
ర్తింపగ బూనువా డధముడే సుమ! క్షత్రియవంపాంసనా!
చంపక విన్ను పాతెదనొ ? చంపుదొ చచ్చుటొ చేయగావలెన్. 252

పతు, లవి, నీలగా నసురపత్నులు గార్చెడి కంటినీటివిన్
హత మొనరించి వాపుట మదర్థ మహో యటు సేయలేమి నా
సతులను నూఅడించుటకు సంగరకారణమైన నేనె భూ
పతనము నొందువాడ రవి ప్రాగ్దిశ గ్రుంకక యుండు నంతలోన్. 253

మాటలు వేయు నేల ? పలుమాటలతో బని యేల ? వెంటనే
చాటుము నీ ప్రలాపముల శక్తిని జేతలయందు జూతు బో
రాటము బూర్తిసేయ దినరా జదె గ్రుంకకమున్నె మానవా ?
సూటిగ జెప్పుచుంటి రిపుసూదన మాసురధర్మమొ వినన్. 254

దురము విశ సల్ప నరికాదు నరులు మాకు
సాటిగా నట్టివారితో నమర మూన
ధర్మ మగునొక్కొ రవి గ్రుంకు తరుణమిదియు
వడిగ ముగియింతు రాఘవ వైర మిపుడు 255

గద గొని నీదు కట్టెదుట గాలము దీర్చగ నిల్చియుంటి నా
కద విడె వచ్చె వచ్చి దివియందున నున్న మదీయ సైనికుల్
ముదమును గాంచ నీ రుధిరముం గదు దర్పణ మీయ నంచు దా
గదను గఖేలునన్ విసరె కాలువిమాడ్కిని రామమూర్తిపై. 256

వడివడి విసరిన అరుగద మడియంగా దారి లతలు ద్రుమానుల్ కొండల్
వడి వడి రాముని డాయగ బడగొట్టె నతండు దాని ప్రయ్యలుగాగన్. 257

అరమర వీడి రాఘవమహాత్ముడు దుష్టుని చుప్పనాతి తో
వరుగద మట్టిలో గలిపి దైత్యుని జూచుచు బల్కెనంత, నో
ఖర! యిక నేమిసేతువు వికావికలై చనె నీదుశక్తి నీ
దరయవొ యింత జేసినను నల్పుడ వీ వని పాపకర్ముడా! 258

అన్నియు శూన్యమైనవిగదా! గదముక్కలు చెక్కలయ్యె నీ
వున్న తెఅం గెఱింగి కనవో పరితాపము నింకనైన? నీ

పెన్న వృథాప్రలాపములనే పలుకాడెడివాడవోయి! రా
మన్న సుధర్మబాణ మహిమామృతముం జవిజూడ గాచుకో	259

భూదేవిగర్భాన బొందుమీ నిద్ర
నా దేవి నీకొఱ కంగలార్చినది.	260

మున్ను నీకతమున దోనాడి ధవుల
దెన్ను గానక యేడ్చుచున్నట్టి సతుల.	261

పతివిహీనల ఖరుసతు లింక జేర
పతితుని బెండ్లాడ బట్టినగతివి	262

అను రాముమాటల నాలింప డతడు
కననెంచి సత్యంబు ఖరుడు మారండు.	263

మృత్యుముఖమున నున్నచో మేటియైన వాచ్యము నవాచ్య మెఱుగును బలుకలేడు
గర్వితుండైన వాడును గనగలేడు మరణకాలావశిష్టుడై మంచిచెడుగు.	264

వాదోపవాదాల వదరుట యేల?
ఛేదింతు ని న్నిదే ఛేదింత ననుచు.	265

అస్త్రములు లేకయే ఖరు డసురవరుడు తోడు లేకుండ నొకడె యా వాడ నిలచి
చెంత నుండిన వృక్షంబు సంత బెఱికి వైచె గోదండపాణిపై వైర ముడుగ.	266

ఖరుడు నిరాయుధుండుగ నొకండుగ గయ్యము సల్పుదీక్షనే
వరలుచు వృక్ష మొండు బడవైచిన నంతట దాని ద్రుంచి వే
యరమర వీడి క్రుద్ధుడయి యా ఖరు, బాణపరంపరాశిచే
స్థిరముగ మేను మోదె మెయి చిల్లులుగా స్రవియింప రక్తమున్.	267

చిల్లులనుండి రక్తమును జీమును గారగా గంపుగొట్ట మే
నెల్లయు రక్తసిక్తుడయి యిప్పుడ చంపెద నంచు బొబ్బలం
బెల్లుగ బెట్టుచుండి రఘువీరుని బై బడి దాత రాము డా
సల్లలితాంగు దోర్వక నిశాచరు దుర్భర దుష్టవాసనన్.	268

ఖరుడు చచ్చుట

అదు గొక్కటియే పెన్కకు విడి వింట నగస్త్యు డిడిన యేపగు తూపున్
వడి గూర్చి గురిని గొట్టగ దడయక కూలెన్ ఖరుండు ధాత్రిన్ హతుడై.	269

రామబాణం బమోఘంబు రాక్షసాళి పదియు నాలుగువేలను వారినృపుల
నాజి గడియలు మూడింటి యందె దునియె మన్నుమిన్నులు సంతుష్టి మనగ నంత

పూలవాన కురిసె పుష్పాంజలులతోడ మునులు సురలు రామమూర్తి గనిరి
దివిని బఱఁగె నంత దేవదుందుభిమ్రోత ప్రకటితంబుగాఁగ రాముజయము 271

మునులును దేవతల్ విజయమూర్తినిఁ గాంచినమస్కరించి దీ
వన లిడి మెచ్చుచున్ సుజనవైరులఁ జంపిన చొప్పు దండకా
వని భయహీనమై మునిని వాసముగాఁగఁ బ్రశాంతి నుండు సం
చని ఖరు పూర్వజన్మకథ నంతయు దెల్పిరి భక్తియుక్తులై. 272

చంపితి వీవ రాక్షసులఁ జంపగ బుట్టిన విష్ణుకీర్తినిన్
బంపిరి మౌను లిచ్చట కుపాయముగా నిట వాస మూన నీ
పెంపున దండకాటవిని భీతి దొలంగగ నంతె కాదు నీ
పంపునఁ బాసినారు మునివర్యులు రాక్షసజన్మశాపమున్. 273

ఖరుఁడు దూషణుఁడు త్రిశరుఁ డరయ మున్ను
యాజ్ఞవల్క్యుని తనయులు నతుల ఋషులు
వారె చంద్రకాంతుఁడు మహామేరు విజయు
లనఁగఁ బఱఁగి శివునిశాప మదియుంట
రాక్షసుల జన్మ మెత్తిరి రాఘవేంద్ర! 274

ఈ ఋషిత్రయశిష్యులే యిరువేల మంది ఖరునిసైన్యము మున్ను మా సతీశు
శాపవశు లౌచు రాక్షసజన్మ మెత్తి ఖరునిఁ గొల్చుచు నిను బోరఁ గడఁగినారు.

పాపులుగాఁగ రాక్షసులు వర్తిల విష్ణువు భూమి, బుట్టు నా
శ్రీపతియైన దాశరథిచే నవిఁ జచ్చి తరింతురం చనెన్
శాప మొసంగి యంతటనె శంకరుఁ డీ ఖరముఖ్యు లల్లె నీ
చాపవశంబునన్ మడిసి శాపవిముక్తులు నైరి రాఘవా! 276

ధన్యుఁడవైతి వీవును గృతార్థుఁడ వైతివి సాధురక్షణన్
గణ్యుఁ డవున్గదా నృపతికర్మవిశిష్టుఁడ దుష్టశిక్షణన్
మాన్యుఁడ వయ్య, మౌనిజనమాన్యులకున్ సురకోటి కెల్ల లే
రన్యులు లేరు బ్రోవ సుమ యార్తశరణ్యుఁడ వీవ రాఘవా! 277

శాపవిమోచనవ్రతమె నల్పుచునుంటివి కాన వాపుచుం
బాపుల పూర్వజన్మ కృతపాపము శాపములున్ మహాత్ముడా
యాపగిది స్మతెందఱిల నీల్గ త్వదాగమనాభిలాషనై
యోపిక బూనియుండిరో! రఘూత్తమ! యో కరుణాపయోనిధీ. 278

అనుచు గీర్తించుచు నా రామవిభుని
జనిరి సురలు మునులును గొంతమంది. 279

## సీతారాముల కలయిక

అవనిజయున్ సుమిత్రసుతు డా గుహనుండియె గాంచుచుండి భూ
పవరు జయంబునున్ సురలు వచ్చుటయున్ దివి మ్రోగు భేరియా
రవముల నాలకించుచును రాముని జేరిరి కందరాంతరం
బు విడి నిజాశ్రమంబునకు బోయిరి వారలు రామయుక్తులై. 280

జనకతనూజ కాంచి రఘుచంద్రుని దేహము రొమ్ము వీపులన్
విశిత బాణసంచయము వేటున రక్తము చిమ్ముచుండ నం
తన దన కౌగిలిం గొనియె ధార్మికు నా మెయితూపుతూట్ల బా
ధను దొలగింపగా మృదుసుధామయవక్షముతోడ డాకుచున్. 281

వేనకువేలు దైత్యు లని వేడుక వచ్చుట జూచి చూచుచున్
జానకినాథు నాజ్ఞ జనె సాధ్వి జయూపజయంబులేరి వే
గానగునంచు భీతి, దుది గాంచి జయావహు భర్త గౌగిట
బూనగ నెంత సంతసము బొందెనొ ధర్మవిధం బెఱుంగుటన్. 282

ఆడుది పూరుషాకృతివి నందముగా నటియించి తన్ను బెం
డ్లాడెను రాముడంచు బలుకాడిన జానకి వేనవేలుగా
గూడిన దైత్యయోధు లని గూలగ నొక్కడె వీరుడౌచు బో
రాడుట వీర్యశుల్కకవి రాముని నాథుని గ్రుచ్చె గౌగిటన్. 282

మును సురకోటి కిచ్చి వరమున్ భువి బుట్టిన కర్మకారణం
బును మరప బొందకుండగ విభుం డసురాళి వధింప బూనుటం
గనుచు విదేహపుత్రి తనకౌగిట బట్టగలేని సంతసం
బున హృది పొంది పొర్లగ విభుం, గడు గ్రుచ్చెడి నంతకంతకున్. 284

పదియు నాల్గువేల భయదుల దైత్యుల నొకఁడె చంపి జయము నొందియున్న
కాంతు వీర్యశుల్క కనునంత ముద మొంది కౌగిలించె మిగుల గౌరవముగ. 285

రాఘవుని జూసి గుహయందు రామ యొకటి
యున్నత ముహూర్తమే యయ్యే యుండి కాని
హృదయగుహ వీడి శ్రీశుఁ గట్టెదుటఁ గాంచి
జీవుఁ డుప్పొంగువిధముగా సీత తోఁచె. 286

యుద్ధధర్మవేత్త యిద్ధచరిత్రుడు రామరాజు చంపరా దటంచు
విడిచిపుచ్చె భటుల వేగులవాండ్రను నాయుధంబుఁ బూన నట్టివారి. 287

అంత నకంపనాఖ్యుఁ డసురాధిపుచారుఁడు లంక కేగి సా
మంతుఁడు రామనాముకుఁడు మానుష్యజన్ముఁడు దండకాటవిన్
బంతము నూని రాక్షసులఁ బట్టి వధించెను దండకావనీ
కాంతుఁడు నీ సహోదరుఁడు గాయము వీడెను రావణా ! యనెన్. 288

ఖరుడు దూషణ త్రిశిరులు విఱిగినారు దైత్యుఁ డనువాడు లే డింకవని
నా జనస్థానమంతయు నటవి గలిసె రావణా ! యేమి చెప్పుదు రామువలన. 289

ఎట్టులో వచ్చితి నిటులేను నిడకు
గుట్టుగా నినుఁ జేల రట్టు లేకుండ. 290

మాయయే మనమహిమంబుగా నుంట
మాయఁగా స్త్రీరూవ మందుచునంత. 291

అవి నెల్లఁ జూచితి నాత్మానుభూతి
వనితను జంపమి వచ్చితి నిటకు. 292

అను నకంపనువార్త విని రావణుండు
కను లెఱ్ఱసేయుచుఁ గ్రక్కునఁ బలుకు. 293

వచ్చినవాఁ డెవం డసురివర్గము జంపినవాఁ డెవం డహా
చచ్చినవాఁడె వాఁ డెటకుఁ జావక పారగలాడు ? సృష్టి సం
దెచ్చట దాగినన్ మడియఁడే ? యముఁడైనఁ గుబేరుఁడైన నా
యచ్చపు విష్ణుఁడైన సుఖ మందఁగలారలె న న్నెదుర్చుచోన్, 294

యమునకు నే యముండను హుతాశనుఁగూడ దహింపఁజేతు నం
తముఁ గను మృత్యుదేవతయు నన్ దలకొన్న సురాధినేత భీ

తి మనలు; భానుండున్ విడుచు దేజము; వాయువు వీడు వేగమున్
గమరఁగఁజేతు నెల్లర నొకండనె క్రుద్ధుఁడ నేనె యైనచోన్. 295

పుండిపడుచు రావణుం డనుమాటఁ
గుండె దద్దరిలఁ జారుండు భీతిఁ గనె. 296

కన్నది సత్యంబు గాంచినరీతి విన్నవింపఁగలేక విశదంబుగాఁగ. 297

అసురాధిపతిఁ గోరి యభయమ్ము నొంది
వెనఁ దెల్పు సత్యమ్ము వేగులవాఁడు. 298

ఆతడు లోకసుందరుఁడు యౌవనవంతుఁడు దీర్ఘ బాహుఁడా
బోతున కీడు మూపుల విభూతిఁ జెలంగెడివాఁడు వీరుఁడున్
బూతచరిత్రుఁ డుద్యశుఁ డపూర్వమహాబలశాలి వాఁడు కం
జాతముఖుండు దాశరథి శస్త్రమహాస్త్రవిదుండు మా ప్రభూ! 299

అతఁడు మహాత్ముఁడున్ రణమునందు సురాధిపుఁబోలు వాఁడుమన్
సతత పరాక్రముండు గుణసంపద తేజమునందు శ్రేష్ఠుఁడున్
హితమతి లక్ష్మణుండనఁగ నాతనివెంటఁజరించు తోఁడు వా
డతిసుకుమారుఁడున్ శశినిభాననుఁడున్ గడు వీర్యవంతుఁడున్ 300

పూనిక దండకను జన స్థానమునందున వసించు దైత్యుల నెల్లన్
మానక చంపఁగ వీరలు బూనిరి కృతకృత్యులైరి పొక్కఁగ సీవున్. 301

సుర లెవ్వరును వారి దరిరారు రాజ
నరుఁడైన వీరుఁడు పరిమార్చినాఁడు. 302

కాంచన బాణపుంఖము లెకాయకి రాముఁడు వీడునంతటన్
బంచముఖంబులై పఱఁగుఁ బాములుగా నవి రాక్షసాళి భ
క్షించిన వల్ప కాలమున శ్రీ రఘురాముఁడు వేసవేలుఁగా
మించిన దైత్యసంఖ్య మితిమీఱిన రాములుగాఁగఁ దోఁచుచున్. 303

ఎవ రే యాయుధములతో బవరంబున నున్ననట్లె ప్రత్యక్షముగా
వివిధాయుధయుత రాములు జవ మొప్పఁగఁ బోరు సల్పఁజావరెదైత్యుల్? 304

అక్కడ నిక్కడ నా నలు
దిక్కుల రాముఁడె యగుచు దివ్యుండై యే

చక్కికి నేవ రేఁగిన నట
రక్కసులకుఁదోఁచెఁ బెక్కు రాములభంగిన్. 305

అనునంతన్ విని రావణుండు కడుఁ గోపాటోపముం జూపుచుం
జనువాఁడం దడ వేల నేనె రిపులన్ సంహారముం జేతు నం
చనఁ జారుం డనుకంపనుండు దగునే యారీతి నీ కోక యం
చని తెల్పెన్ రఘురాము పౌరుషబలస్థాయిన్ యథార్థంబుఁగా.

రాముడు విష్ణువని అకంపనుని సూచన

విను మీ రావణ! రాఘవున్ దునుమ నీవే చాలుదే? యేమొ! యా
తని సాధింపఁగ నేరి కయ్యెడి? సముద్రంబున్ వడిం జేరు వా
హిని వేగంబును గూడ వాని విశిఖందే యాపగానోవు మిం
టివిఁ దారాగ్రహయుక్తముం గలుప మంటిన్ వానిబాణం బహో !

ధర జలధి మునిగిన సముద్ధరణ మూన
గలుఁగువాఁడును నుదధిలోకంబు మింనీఁ
గట్టుఁ దెగఁగొట్టఁగా గల దిట్ట వాఁడు
జలధిగతి వాయుగతిఁ గూడ సమయఁజేయ
నోపువాఁడును రాముఁడే భూప! నిజము. 308

సహజ విక్రమోద్ధతి లోకసంచయంబు
సంహరించును సృజియించు స్రష్ట యతఁడు
నతఁడు పురుషోత్తముండు మహాయశుండు
నెవ్వరైనను రాము జయింపలేరు. 309

పాపకర్ముఁడు స్వర్గంబు బడయనట్లు
నీవు రాముని గెలువఁగా నేరవయ్య
నీవ కాదు రాక్షసు లెల్ల నిన్నుఁగూడి
పోరి నను గూడ శ్రీమంతుఁ బొందు జయము. 310

రాక్షసులె కాక దేవాసురప్రతతియు
నేకమైగూడ రాము వధింపలేరు

చెప్పెద నుపాయ మొక్కటి తప్పొ యొప్పొ
రాముని జయింపఁదగిన మార్గంబు వినుము. 311

రాముని భార్య సీత సమరమ్యతరాంగి, సుమధ్య, పూతయున్,
శ్యామ, త్రిలోక సుందరియు, నామెకుఁ దుల్యల స్త్రీలఁ జూడ మీ
భామిని రత్నభూషితయు భామలరత్నము నామెఁ దెచ్చినన్
కాముకుఁడైన రాఘవుఁడు కాంతను బాయుచు తేజు బాపెడిన్. 312

సీతను వేఱు సేయు తఱి శ్రీ రఘురాముఁడు రాముఁడే యగున్,
సీతయె రాము తేజము, నశేషబలంబును, నామెఁ బాయుచోన్
వీతబలుండు గా హృదయ వేదన మ్రగ్గెడి, రాముఁ డోడు, నా
పూతకు నాశ్రితుండవయి పొందెద వీవు తపః ఫలంబునున్. 313

శ్రీ మంతుం డగు రామచంద్రుఁడపుడా శ్రీఁబాసి మంతుండగున్
కామోద్రిక్తత సర్వశక్తులను వీకన్ వీడుగా, నీవా! శ్రీ
రామాయుక్తుఁడవైన నాయమకృపన్ రాణింపవే దీప్తిమై
శ్రీమంతుండవు నీవ యాచు నరునిం జెండాడవే రావణా! 314

సురల నారికంటెఁ జక్కల కంటెను
మిన్న యామె తేజ నెన్నవశమె
దైత్య మానవ వనితలఁ బోల్పఁగా నేల
లలిత సీత యొప్పు లక్ష్మియనఁగ. 315

రాముఁడె గొప్పవాఁ డతని రామయె యాతనికంటె గొప్ప దా
భామ పరిగ్రహింపఁ గలవాడవె యా యమ నీవ? యైనచో
శ్రీమహితాత్మ దివ్యగుణ సేవిత మూర్తివి గావె రాముఁడున్
గీముఁడుఁ దోఁక పీకవలె కేవల మానవ మాత్రుఁ డౌటచే. 316

చారుఁ డగుటను నాశ్రమ స్థలుల కేగి
మారు రూపాన మౌనుల మాటలు విని
వినిన యది కాంచిన యదియు విన్నవించు
వాఁడు తన ఱేనికిఁ బ్రియము పల్కువాఁడు. 317

## రావణుఁడు మారీచుకడ కేగుట

వెడలె మేఘమండల శశివిధము రథము
చేరె మారీచు వాడకుఁ జేరునంత
భక్ష్యభోజ్యాదులం దన్పి భక్తి నతఁడు
రాక్షసాధిపుఁ బ్రశ్నించె రాకకతము. 318

రాముఁడు మానవుం డొకఁడు రాక్షసరాజ్యముఁ జొచ్చి దండకా
సీమఁ గలట్టి రక్కసులఁ జెండి వధించె, ఖరాదిసోదరుల్
భీమబలులే రణస్థలిని వీడఁగఁ బ్రాణములన్, సహింతునే,
ఏమయినన్ సరే యతని కే నొనరించెద శాస్తి నిప్పుడే. 319

కానవా? బంధువర్గమును గాంచఁగఁజాలము దండకన్, జన
స్థానము మాఱిపోయెను శ్మశానముగా, నికఁ నోర్చనౌనె? యా
జానకి సీత రాముసతిఁ జయ్యన లంకకుఁ జేర్ప వచ్చితిం
గాన సహాయమున్ సలుపఁగా నినుఁ గోరెదఁ గార్యసిద్ధికై. 320

అను మాట మారీచుఁ డాలించి యంత
తన వంశవిభునకు వినిపించు హితము. 321

ఎవ్వఁడు మిత్రురీతిగ నటించెడు శత్రువు చెప్పె నిట్లు? వాఁ
డెవ్వఁడు నీలయంబె మది నెంచిన వాఁడొకో! సీత పేరు నీ
కెవ్వఁడు తెల్పియుండె నసురేశ? యసూయకుఁ జిక్కియున్నవాఁ
డెవ్వఁడు? నీ తిరస్కృతి వహించి యెవం డిటులాడెనో ప్రభూ! 322

రాముని బాణ మొక్కటియె రాక్షసవంశమునెల్ల మాపు శ్రీ
రాముని సీత నీవు గొనిరా మన లంకయు నీసమస్తమున్
ధూమముపాలుగాదె? యెటు దోచెను నీ కిటువంటి బుద్ధి? వే
పామును బట్టి కోరలజపంబునఁ దీక నెవండు చెప్పెఁబో! 323

చీరెద వేల రాము నరసింహుని; సుప్తమృగేంద్రమూర్తి నిన్
జేరుచు ముష్టితాడనము సేయఁదలంతువే? నిద్ర లేపుచుం
బోరున తీకొనంగ లఘుబుద్ధి వహించెదొ! దానివల్లఁ జే
కూరుఫలంబు నాశనమె; కోరకు పూనకు మిట్టి దుష్క్రియన్. 324

అడవిఁ దనంతఁ దా మసలునట్టి మదేభము దాసి తొండము
న్వడిఁ జెయిఁబట్టి యంకుశమునం బొడవం దలపెట్టు టౌనుగా
వెడలఁదలంతువేని రఘువీరుసతిం గయికొంచు లంకకున్
గడంగి కలంచదే తృణముగా రఘురామగజమ్ము దైత్యులన్. 325

రామధను వెంచ మొసలి, యా రామబాహు
వేగమె సుడి తరంగాలు విశిఖవితతి
సమర సలిల సంపూర్ణంబు నలవిగాని
రామపాతాళముఖ మందు రాక్షసేంద్ర
చొరఁబడియు వెలిఁబడఁగ నీతరముగాదు. 326

విను మసురేశ! కోపమును వీడి ప్రసన్నుఁడ వౌచు లంకకుం
జనుము స్వభార్యలం గలసి సంతతమున్ రమియింపఁగాఁదగున్
వనమున రాఘవుండు తన పత్నినంగూడి సుఖించుగాత నీ
మనమున నెంచఁబోకు మొక మానవుఁ డంచని రామునిం ప్రభూ! 327

ఏమో పరుషములైనను నీ మేలెంచియె సురారి! నే నిటు లంటిన్
రాముని నే నెఱుఁగుదు సూ! వ్యామోహము వీడి లంక కరుగుము తేఁడా!

మారీచుని హితమున్ విని యా రావణుఁ డేఁగె లంక కంతన్ శాంతిన్
ధీరుఁడు వీరుఁడుఁ దపసియు శ్రీరాము నెఱింగె నేమొ చింతించి మదిన్ 329

## రావణుడు శూర్పణఖ

కాముకులైనవారి కడగండ్లకు మేర యొకింత యుండునే
భామ యొకర్తుఁగూర్చి యొక భావములో మొలకెత్తునంత నా
రామను గూడు కోర్కెయె నిరంతరమున్ హృది వేధ గూర్ప వే
రేమియు నెంచబోవఁ డరెరే! తప ముండిన వేదవేత్తయున్. 330

తెలియలే దింపదనుకఁ జెల్లెలివిధంబు
గూఢచారియు నది చెప్పకుండ వెడలె
వినఁడు మారీచుకద్ర గూడఁ గనెను నేడె
శూర్పణఖ మోము రావణాసుర విభుండు 331

తన వారలౌ వార లనియందుఁ జూప
కని ఘోరదృశ్యంబు కామిని వేగ 332

చని రావణునిఁజేరఁ జయ్యనఁ గాంచె
ఘనమైన పేరోలగం బున్న వాని. 333

ఘప్పనాతి కాంచె సూర్యసంకాశుని దీప్తిమంతు గొప్పతేజువాని
ననలకాంతిసమునిఁ గనకాసనాసీను సురల నేతవోలె వరలువాని. 334

మంత్రియుతు విమారమధ్యస్థు వీరుని సురలు మునులు దైత్యశూరు లెవరుఁ
జంపఁజాలనట్టి సర్వభూతాంతకు భయదరూపవంతుఁ బంక్తికంఠు. 335

ఇరువది చేతులునుం బది శిరములు గల కుండలయుతు జ్యేష్ఠుని భ్రాతన్
ధరపతి లక్షణ శోభితు వరరత్నాన్వితు విశాలవక్షము వానిన్. 336

పెద్దనోరువాని భీషణదేహుని నెఱుపు కనులవాని నింద్రసముని
వివిధసమరతతుల వివిధాయుధంబులవలనఁ దూట్లుపడిన వపువువాని 337

దేవాసురులు ఘోర దేవేంద్రువజ్రాయుధప్రఘాతఁ గలిగిన తనువువాని
నైరావతపు దంతహతితతిఁ గాయలు గాసిన పెద్ద వక్షంబువాని
హరిచక్రమునువైవఁ బరిమార్పఁబడకుండఁ బలుదెబ్బ లూనిన వపువువాని
నన్యకాంతలఁ బట్టి యాహ్లాద మొందెడి యతిబలు నతుల కాయంబువాని

పెద్దకొండల నెగురఁగా వేయఁగలుగు వాని సురల మర్దించినవాని సతము
ధర్మనాశన మూనెడి కర్మపరుని జలధి క్షోభింపఁజేసెడి శక్తివాని 338

సర్వదివ్యాస్త్రవేదిని సకలయజ్ఞ విఘ్నకారు భోగపతికి వెడలి వాసు
కిని జయించి తక్షకు భార్యలను బలాన నపహరించిన స్త్రీలోలుఁడైనవాని

ఎవడు నీరుఁ గుబేరు జయించి వాని పుష్పకవిమానమును గొన్న భూరిబలుఁడొ!
ధనదుచైత్రరథవని నందనవనంబు పాడొనర్చెనొ క్రోధంబువలన వాని 340

చంద్రసూర్యోదయంబుల సరణిఁగూడ హస్తములు నడ్డగల్గు ననంతబలుని
బ్రహ్మదేవునిఁ బదివేల సవత్సరాలు తలల బలిఁ బూజ సల్పిన తపమువాని

మానవేతరు లెవ్వరు మడియఁజేయఁ జాల రెవ్వాని రణమందు జగతి వాని
నాప్తయజ్ఞహరుండు బ్రహ్మఘ్నుఁడైన వానిఁ గ్రూరు దుష్టుని దయలేనివాని

సర్వభూతభయంకరు సకలలోక కంటకుని మృత్యు మృత్యువుగాఁ దోచు
శత్రుసంహరణోద్యుక్తు శౌర్యవంతు రావణు మహాబలాన్విత రాక్షసేంద్రు.
దివ్యవస్త్రాభరణధారి దీప్తనేత్రు
నతుల మాల్యోపశోభితు నసురరాజుఁ
జూచి భయవిహ్వలాంగియై చుప్పనాతి
యా కురూప త్రిమ్మరి పలుకాడఁగడఁగె 344

రావణ! కామభోగసుల ప్రాపున మత్తుఁడవై యథేచ్ఛ భీ
తావహదుస్థితిం గనవొ! యట్టిది సర్వ మెఱుంగుచుండుటే
ధీవరుఁడైన తెలివని దేనినిఁ జూడక యుంటి వీవు వా
ర్తావహులైన చారులు భయానకవార్తలు నీకు దెల్పరో! 345

సతతము కామవృత్తుఁడయి సర్వసుఖంబుల లోగు భూపతిం
బతితునిగాఁ దలంపరొకొ పాలితు లెల్లరు గౌరవింతురే
యతని, స్మశానమందుఁ గల యగ్నిగమాత్రమె జూతు రెప్పుడా
గతము ననాగతంబు నెఱుగం దలపోయని తెఁడు భ్రష్టుఁడౌ. 346

స్వయముగ యుక్తకాలమునఁ బార్థివుఁ డెవ్వఁడు రాజధర్మముల్
జయముగ నిర్వహించుకొనఁజాలఁడొ వాఁడు నశించు రాజ్యమున్
లయ మొనరించు నేనుఁగు జలంబులఁ బంకము సేరనట్లు వీ
డి యరుగు దూరదూరముగ తెనికి న్వ్రజ రాక్షసేశ్వరా! 347

వననిధి మున్గి రూపటిన పర్వతరాజమువోలె ప్రీనిలో
లుని నిజరాజ్యరక్షణకు లోటయి చారులు లేమి భూమిపా
లునిఁ దృణీయింపరే ప్రజలు లోకువ సేయదె లోక మెల్ల నె
వ్వని కిల విల్చు వేగులను వాడక నీవొ విరోధి వెల్లడన్. 348

ఏలికవై మనందగుదువే? విధి నేర్వని రాజువై యిటుల్
బాలునివంటి వాఁడ వహ! పాలనసేతువె బుద్ధిహీనతన్
దేలికగా విరోధుల వధించుచుఁ గోశము రాజనీతియుం
జాల వహించి చారులను సాకుట రాజుల ముఖ్యధర్మముల్. 349

దూరవార్తలఁ గనఁగల్గువారు నృపులు చారులే వారికనులు నంచారులొచు
వివిధదేశాల విషయాలు వేగు లెపుడు దెలుపుచుండరె రావణ! తెలసికొనవొ!

కాననె దండకన్ స్వజనకాండము సర్వము భస్మమై జన
స్థానము బంధువర్గరహితంబగుటన్; దలపోతు వేగులన్
బూన రటంచు నీవు సచివుల్, ఖరదూషణు లాది దైత్యులన్
మానవరాముం డొండె మటుమాయము సేసె మునీశ్వరార్థమై. 351

దండకావనియందు దైత్యులబాధ
చెండాడె రాముండు దండివీరుండు. 352

వర మిచ్చి మునుల కసురులం బోకార్చె
వరలంగా శాంతిమై వనమందు ఋషులు. 353

సాంబుండు మదీయపుత్రుండు సచ్చె సుమ్ము తపసు సల్పెడు త్వదర్థ మెంచి
నీ యుపేక్షయె కారణ మాయె నీసహోదరినిం బరాభవ మొందియుంటి నిటుగ

పదియు నాల్గువేల బలగంబు నంత నర్ధాధికమగు ముహూర్త మందె చంపి
యాడుదాన ననుచు వీడెను నన్ను శ్రీ రామచంద్రుం డోయి! రావణేశ! 355

రాముతమ్ముం డుండె లక్ష్మణుండనువాండు
వాడు నన్నంటి బలియు గుణుండు.
నన్న కుడిభుజంబు, నన్నను వెంటాడు
భక్తి, పరుండు శౌర్యవంతుం డతడు. 356

పౌరుషంబున్నచో, పోయి పడిగ రాము
భార్య సీతను గొనివచ్చి వారికిం దగు
మారునల్పుము లేదేని మగటిమి విడి
భర్త చచ్చినవిధవగా బ్రతుకు మింక. 357

చుప్పనాతి పలుకు శూరుండు వినియంతం
గ్రుద్ధుం డగుచు బల్లగ్రుద్ధి యడిగె
నెవండె రాముం డాతం డెంతటి వీరుండె
యెట్టిరూపవంతుం డేడ వాడు? 358

ఎట్టి పరాక్రమాన్వితుం డరే త్రిశరున్ ఖరదూషనాదులం
గొట్టినవాడు, వాండు కయికొన్న మహాయుధ మెట్టిదే? పరుల్

మెట్టఁగ దుస్సహంబయిన మేదుర భీకర దండకావనిన్
దిట్టరిగాఁగఁ జొచ్చెనె? యదేలనె? యెవ్వఁడొ వాడు చెప్పవే! 359

ఎలుఁగెత్తి రావణుఁ డెట్టని కనులఁ
బలుకాడఁ జెల్లెలు బదులాడు నిటుగ. 360

సలలిత దీర్ఘ బాహుఁడు విశాలమహాక్షుఁడు వాఁడు నార చీ
రల ధరియించు దాశరథి రాముఁడు మన్మథతుల్యరూపుఁడున్
విలయకరాహిబాణముల వ్రేల్చె మహేంద్రధనుస్సమానమౌ
విలుఁగొని యద్భుతం బొదవ వీరరణస్థలిఁ గ్రీడ సల్పుచున్. 361

చూచితి వచ్చు బాణములఁ జూచితి రక్కసిమూక చచ్చుటం
జూచితి నంతె వేరు మఱి చూడఁగ నోపను రాఘవుండు ధ
ర్మోచిత శస్త్రసంచయ మహో! యెపు డెట్టుల వింటి గూర్చెనో
నోచఁ గనంగ; వింటిని గుణోద్ధతి మాత్రము భీతచిత్తనై. 362

వినుము సురాధిపా? వినుత వీరుని రాముని భార్య సీతరూ
పున సరివచ్చువారు దివిఁ బుట్టినవారలు లేరు, పృథ్విలోఁ
గనవిన నుండఁబోరు తనుకాంతినిఁ జక్కఁదనాన లక్ష్మియే
యన సరివచ్చుఁ గాదన మహావనదేవతయో యనందగున్. 363.

ఆమె సకలాంగ సుందరి యతుల సీత
ప్రథితవై దేహి పూర్ణేందు భాసవదన
నామె కౌగిలించినయెడ నఖిలసుఖము
గనఁ డెవఁడు? వా డింద్రునికంటె ఘనుడు. 364

రాఘవుని ధర్మపత్ని యా రామ భర్తృ
హితమె సతతంబుఁ గాంక్షించు సతి సుశీల
యామె యతిరూపసంపన్న యాపె నీకుఁ
దగినభార్య నీ వామెకుఁ దగినపతివి. 365

అవి తలపోయుచు నామెను
గొనిరా యత్నించియుంటి గొంకక యంతన్
ననుఁబట్టి బలిమి రాముని
యనుజుండు విరూపఁజేసె నతిఘోరముగాన్. 366

ముక్కు చెవులు బాసి దిక్కు మాలినరీతి
ఖరునిఁ జేర నతఁడు కయ్యమూని
సర్వబలముతోడ సమసె నా బోరున
దండవని బంధులతి నశించె.

ఆయమ పూర్ణిమాశశినిభాననఁ జూచి యంతన నీపయిన్
వేయఁడె మన్మథుండు తన వేడిశరంబుల నీవు చొక్క, నా
ప్యాయము గన్న నీవె కొన భార్యగ సీతను రాము లక్ష్మణున్
పోయి వధించి పొందు జయమ్ముం గుడికా లిడు మీ కథంబునన్

రాముఁడు లక్ష్మణుండు మృతులైన ననాథగఁ గాదె సీత నీ
వామెను గూడి యంతట సుఖాస్పదమూర్తివి గావె కాని శ్రీ
రాముని గెల్వనేరవు పరాజయమే యగు మూడులోకముల్
ధూమము బుగ్గిగావె తృటిలో గుంపితుం డతడైన సోదరా!

నిలువంజాలవు రాము క దుట; వానిన్ మోసము జేసి యా
లలితాంగిం గొని రా నమ ఁడవు నీలా పెంచకే మాయచే
ఫలితార్థుండవు గమ్ము రా వ్రఁచహో భార్యావియోగార్తిచేఁ
గలతం జెందుచు భూమి నుండడుసుమా కార్యార్థ మీ పెంచుమా.

ఆడుది నీ హిత మెంచుచు
నాడిన మాట లివియ కని యరిబలమున్ నీ
పోడిమి చూచుచు మొగుడు
జూదము సేయుము హితమగు చొప్పుగ నన్నా.

అను నా చెల్లెలిమాటలన్ వినుచుఁ జింతాక్రాంతుఁడై సోదరిం
గని యోదార్చి నిజార్థ మెంచుటకు లోఁ గర్తవ్యతామూఢుఁడై
చనెఁ గొల్వున్ విడి చేరి యంతిపురమున్ సవ్యాపసవ్యంబుగా
మనమం దెంతయు యోజనన్ సలుపు ధీసుంతుండు దైత్యేశుడున్.

తన బలదర్పముల్ దలచు దాశరథిన్ రణమందుఁ దాకఁ దో
డనె ఖరదూషణాదుల పెడంద స్మృతిం గను జారవాక్యముల్
మనమున నెంచుఁ జెల్లె లనుమానము లేకయె చెప్పియున్న రా
ముని బలదర్ప శేముషు లమోఘము లంచని యెంచుఁ దాల్మిమై.

ఇంతిని దొంగిలింపఁదగునే కడు వీరుఁడనైన నేను? శ్రీ
కాంతుని ఢీకొనందగునే కయ్యమునన్ ఏవి వానిలావు? కో
సంతయు మారుసేయక నిశాచర హంతకు వీడు పెట్లు? నా
యంతయు గల్గినన్ సరయ యయ్యది రాఘవుచేత మంచిదే. 374

దొంగిలించి సీతఁ దెచ్చినను దోర్బలవంతు డజయ్యు డంత నె
బ్బంగిని సూరకుండుఁ? బగబట్టుచు లంకకు రాడె? వచ్చుచో
రంగ మగున్ రణంబునకు లంక, జయాపజయంబు లెంచి నే
లొంగుట వీరలక్షణమె? లోకులు నవ్వరె? నన్నుదూరరే? 375

సీతను దెచ్చుటే యరయ శ్రేష్ఠము తెచ్చినయంత రాఘవుం
డాతను గోలుపోయి వ్యథ నొందుచుఁ బోరున నోడిపోవఁడే?
భూతలపుత్రిఁ దెచ్చుటయె పో జయమార్గము వేరులేదు సం
పాతము సెందినన్ సిరినమస్తము వానికి శాస్తి సేయనే? 376

వెదకి వేసారి ప్రియురాలి విపినమందు
గనఁగ లేమిని డస్సియుఁ దనువు విడడె
వీడకుండిన రాగఁలవాఁడె లంక?
లంక కరుదెంచు మార్గాన రాలిపోడె? 377

రావణుని హస్తగతమైన రమణి నతఁడు
మఱలఁ గోరునె? కోరిన మగువకొఱకుఁ
బ్రాణముల నొడ్డి నాతోడఁ బోరువాఁడొ!
కోరకుండినఁ కసిఁ బూనకుండునొక్కొ! 378

రాముఁడు జితేంద్రియుఁడు వాఁడు రాపకొఱకుఁ
బోరు సల్పునె యని యెంచఁ బుట్టెసునుఁగుఁ
బత్ని నపహరించిన వానిఁ బట్టి చంపఁ
దలఁచు నెట్లైన యుద్ధంబు దప్ప దపుడు. 379

నరపతి, దైత్యరాజునగు నాపని నెట్టు తెలుంగువాఁడు వాఁ
డెఱుఁగఁగలాఁ డటం చొకట నెంచిన రాఁగలవాఁడొకో జలా
కరమును దాటె లంకకు, నొకానొకరీతిగ వచ్చినన్ సరే
నరులు జయింప నోపుదురె నన్నవి లంకను స్వస్థలంబునన్. 380

బ్రహ్మవర మిచ్చియుండుట రాఘవుండు
చంపఁజాలఁడు చక్రంబు చంపలేదు
కాక నరరూపున హరియె కడళి దాటి
చంపునా యేమి? చంపినఁ జచ్చుటొప్పు. 381

నరుఁ డొకఁడే కదా తృటిని నా ఖరు సర్వచమూసమేతువిం
దురమునఁ జంపె వాఁడు ఘన దోర్బలవంతుఁడు భూమి, మానవుం
డరయఁగఁగాడొ స న్నవి బలాన్వితుఁ జంపఁగ వచ్చినట్టి యా
పరుఁడె యటంచు నెంతు రఘువర్యుఁడు రాముఁడు మానవుండొకో!

నను( జంపన్ రఘువంశమందు నరుఁడై నారాయణుండే భువిన్
జనియించెన్ విధి మున్ను గోరినగతిన్ సంసిద్ధుఁడన్ జచ్చిచో
జని వైకుంఠపదంబు నేలెద ననున్ సంహారముం జేయలే
ని నరుండే యగుచో ధరన్ స్థిరముగా నే నేలగా జాలెదన్. 383

అనుచుం గృతనిశ్చయు డై
యని గిని యేదైన నేమి యని రాఘవునిన్
దనపూర్వాపరజన్మల
పని నరసి తరింప సీత బట్టగ నెంచెన్. 384

సీతను గొనిరా రావణుఁడు మారీచుకడకు వెడలుట

ఆ సురసేత చెప్పడు నిజాత్మ గలట్టి తలంపు నేరికిన్
వ్రాసినవ్రాత తప్పునె పరాంగనకై 'యతి' గుట్టుగా జనున్
దాసులుగూడ రాజు చనుదారి నెఱుంగరు యానశాలవే
డాసి తనంత దా వెడలె లంకను వీడుచు దాటి సంద్రమున్. 385

పోవుచారిన గనె వృద్ధభూజ మొండు
మహిత శాఖోపశాఖల మహిని గ్రమ్మి
యోజనశతంబు వ్యాప్తమై యున్నదాని
మునులతపమున కిరవౌచు మనెడిదాని. 386

దేవ దేశీయు నా మఱ్ఱిచెట్టుకొమ్మ
పెఱిగియును యోజనశతంబు విఱిగియుండె

వింతగా గని యా సురవిభుడు దాని
విఱిగియుండిన కత మెంచి విహ్వలుడయి. 387

మును గరుత్మంతు డమృతంబు గొనగ జనుచు
గోళ్ల గజ మొందు దాబేటి గ్రుచ్చిపట్టి
కొమ్మపై వ్రాల విఱుగనీకొమ్మనాడు
దాని గల మౌనులకు రక్ష నూని వెడలె. 388

దివిజపతినుండి యమృతంబు దెచ్చియున్న
గాథ సర్వంబు వినుచు రక్కసులఱేడు
వైనతేయుని బల మెంచు వానిరౌతు
మదిని దలపోసి యెంతయో మనన మూను. 389

గరుడుడే యింత బలశాలిగాగ నింక
గరుడవాహను డెంతటి ఘనుడో యంచు
విష్ణు దలపోసి తలచుచు వెడలసాగె
కడలి దాటుచు గబగబ కాననమున. 390

అవలి యొడ్డునందు విపినాంతరమం దొక యాశ్రమస్థలిన్
రావణరాజు సేరి యట రాక్షసమౌనిని గాంచె, వాడు ర
క్షోవిభు నర్హమౌ గతిని సర్వసపర్యల దన్పి యంత మో
దావహుడౌ ప్రభున్ మఱల దర్శన మిచ్చిన హేతు వేమనన్ 391

ఆ జటావల్కలధరు గృష్ణాజినధరు
నియమితాహారు మారీచు నిరుపమాను
విందు గుడిచి యాతని ప్రశ్న వినుచు బలుకు
లంకపతి రక్కసుల ఱేడు రావణుండు.

వినవా! ఖరాదివీరు లటవీస్థలి బాలనసేయు బాంధవుల్
చనిరి దివంబు రాముడు నిశాచరకోటిని రూపుమాపి యా
మునులకు గీడు బాపె; మన ముండగనే మనవారి నెల్లరం
దునుమగ నూఱుకుందుమొకొ దోర్బలవీర మహావిశారదా! 393

ఖరదూషణు లాదిగ నా
సురులం దొకడైన లేక స్రుక్కిరిగా తీ

వర దైత్యజనస్థానం
బరయ శ్మశానముగ నయ్యెనంతయు వినవో? 394

ఆ జనస్థాన మెల్లయు నసురవైరి, హస్తముల బడె నదిముఖం బరయ మనకు
వింక లంకలో ఘోర వైరి జంకు గనడు, రాజ్యరక్షణ మూనగా రమ్ము తాత!

మానధనుండ! యింక నవమానమును గూడ నొనర్చె వైరులా
కాన వసించు శూర్పణఖ కర్ణములన్ ముకు గోసినార లా
మానిని రూపహీన గనుమా? యింక నూఱక నుండనౌనె యు
వ్వాని సురాంగనాసమను భార్యను బట్ట దలంచి వచ్చితిన్ 396

రాము డజితేంద్రియుడు ధర్మరహితు డరయ
గ్రూరు డును దుష్టు డెంచ మూర్ఖుండు గూడ
కుపితు డై తండ్రి ద్రోయుట విపినసీమ
భార్య గూడి యుండిన కులపాంసనుండు. 397

నీవును భ్రాతలున్ మిగుల నేర్పరులుం గడు శూరులుం గదా
నా వెనువెంట నుండ గ రణంబున నన్నెదిరింప నోప రా
దేవత లెల్లరుం గలసి ధీవర? మాయలమారివీవు నీ
చేవ లెఱింగి వచ్చితి నశేషసహాయము నిన్ను గోర గ.న్ 398

బంగారుజింకవై పద్మాక్షి యెదుట
చెంగుచెంగున దూకు మంగనం గనుచు

వెండిచుక్కలకాంతి. వెలు గొందు నిన్ను
తెండు తెండని యామె తెల్పదే పతికి? 400

నిను బట్ట కావిరాగ ననుజుడుం దాను
వనిలోన నీవెంట చనరొక్కొ వారు? 401

దూరముగా బొమ్ము దొరికెడిరీతి
వారలు నిను బట్ట బారుచునుండ 402

ఏరును గనకుండ నారిని సీత
దేరున దెచ్చి నాధారుణి నుంతు. 403

అపహరింప గ సీత నభిమాన ముంచి
రిపుశాస్తి సేయ మారీచ తోడ్పడుము 404

భార్యావిహీనుండు పరమదుఃఖాన
కార్యాంతరము లేక గహనంబు నంచె 405

తపియించి కృశియించి తాల్మి గోల్పోవు
నపు డాత దవి బూన నాతండె యోడు. 406

మారు మాటాడక మనగౌరవంబు
మారీచ? నిలబెట్టుమా నీవ యిపుడు. 407

దాశరథిపేరు వినునంత దాటకాసు
తుండు నోరెండి నాలుకతోడ పెదవి
దడుపుకొనసాగె భయవిహ్వలు డయి తెప్ప
పాటు లేవి కనుల జూచు బం క్తికంఠు. 408

పరమ దుఃఖవార్ధి బడుచు మారీచుండు, తెప్పరిలడు రామతేజ మెంచి
దండకావనమున దాశరథిపరాక్ర, మంబు గాంచియుంట మరువ గల డె?

తెప్పరిల మనసును గూడదీసికొనుచు
నతము ప్రాజ్ఞుండు వాక్యవిశారదుండు
నుభయ తారకమగురీతి నభయు డగుచు
తెనితో బల్కు విజము మారీచు డంత. 410

ఇచ్చక మాడువారలు మహేశవిప్రాపున మందు రెందతో
నచ్చని యప్రియంబును వినంగలవాడును జెప్పువాడునున్
మచ్చున కొక్క డుండడు ఏమా! వినియుండవు రా ు గూర్చి నీ
మెచ్చిన గూఢచారుల నమేయగుణాఢ్యుల బంపి నే .. . 411

రాముడు సద్గుణోన్నతుడు రాజిత శక్రసముండు వీరుడున్
భూమి నిశాచరప్రతతి పొందుట యెట్లుశుభమ్ము వింక శ్రీ
రామవిభుండు కోపమున రాక్షసకోటిని రూపుమాపడే
భూమిజ నీదుచావునకె పుట్టెనదా? మటి యేమి? రావణా? 412

జానకియే మదాత్మకును నంతత దుఃఖకరంబె యౌనె భూ
జానిగ లంక కే వగుట సర్వనిశాచరకోటితో లయం
బూనునె లంక? కాముకుడు భూపతి దుర్మతి రాష్ట్రియుక్తు డై
కానడొ నాశనంబు కలకాలము లోకము దూరు రావణా! 413

క్రూరుడుగా డహో తరుమగొట్టగ వచ్చిన వాడుగాడునా
వీరుడు శీలవంతుడు త్రివిక్రమతేజు డహీనధార్మికుం
డా రఘురామచంద్రుడు మహాగుణపూర్ణుడు కీడు సేయ డె
వ్వారికి లుబ్ధు డం చనుట వట్టిది సత్య మెఱుంగు రావణా! 414

కైకకతంబునన్ గురుడు క్ష్మావతి సత్యవచోవిలాసుడై
లోకమునన్ మనంగ, వనిలో రఘురాముడు త్యాగమూర్తియై
సాకుచు సత్యధర్మముల జన్మవిధిం గనుచుండి యుండె లో
కైక విభుండు రాఘవుడు కారణజన్ముడు సుమ్ము రావణా! 415

అత డిల ధర్మవిగ్రహుడు అతడు సత్యపరాక్రముండు నీ
వతని విదేహరాజసుత నాతని తేజమునన్ సురక్షితన్
హతు దవుగాక తేగలవె? యా రవికాంతి హరింప నెంతువే?
మతి చెడి సీత దేదలపు మానక, ప్రజ్వలితాగ్ని జొచ్చెదో! 416

పోవలదు తాత రాముని పొంత కీవు
రాఘవుని విల్లు యముడెపో, రాక్షసా!
మ్రింగ నోరు దెఱచియుండె మిడతవోలె
మడియనెంతువె రామాగ్నిమండలమున. 417

తాత! త్వదర్థమై పలుకు దాసునిమాటల బాటిసేయుమీ
సీకతలంపు వీడు మిక చేరుము లంకకు, రామమూర్తికిన్
ఘాత మొనర్ప దైత్యకులకాండము మూలముతోడ గూల్చునా
పూతచరిత్రు డా పురుషపుంగవు డాజి నిజంబు రావణా! 418

ఆ నరసింహమూర్తికి గులాంగన ప్రాణముకంటె మిన్న యా
జానకియున్ వదా పతివిశాల మహోరసువక్షసక్త యా
మానిని బట్ట శక్యమొకొ! మండు హుతాశను గేల దాకగా
బూనుట యామె దాయుటకు బోవుట మానుము పోక రావణా!

రాముని జూచు నంత రణరంగమునం జనిపోదు వీవు నీ
కేమి ప్రయోజనమ్ము వనబేషణ దెచ్చెడియత్నమందు నీ
కాముకవృత్తి వీడి మన గా దగు రాజుగ నిత్యసౌఖ్యసం
ధామము గాగ లంక, పరదారలగూడగ నౌనె రావణా! 420

యోచన జేయుమీ సచివయోధులతోడుత మంచిచెడ్డలన్
దాచక నీ బలాబలవిధానము శాత్రవశక్తియుక్తులం
దోచినరీతి జేయదగు దొందర యేలకో నేడు రాము నీ
వేచ గలాడవొక్కొ? నశియింపవె నీవు కులక్షయంబుగాన్. 421

మాటికిమాటికిన్ నుడువ మానను రాముని కీడు గావు, పో
రాటమునందు నీవనుచు, రాక్షసరాజ! విభీషణాదులే
మాటను జెప్పువా రటుగ మానక నీ వొనరింప క్షేమమౌ
సూటిగ మున్ను సే గవినచొప్పు వినందగు దీవు చెప్పెదన్. 422

అనుపమ శౌర్యదర్పముల నా మునివాడల సంచరించుచున్
మునులను జంపుచుం దినుచు మోదముతో ఋషియజ్ఞ విఘ్నముల్
గని తిరుగాడి రక్కసులు గాధిజుయజ్ఞము పాడుసేయ నా
ముని విసుగొంది కోసలవిభుం దరి జేరుచు గోరె రక్షణన్. 423

వినుతబలాన్వితుండు కడు విశ్రుతవీరుడు కోసలేశుడే
వని కరుదెంచి యజ్ఞమును బాడొనరించెడి నమ్ము జంప నెం
చినను మునీశ్వరుం డటుగ జేయుట కియ్యకొనండు రాముబా
లునె తనవెంట బంపుమనె లోకహితార్థము ధర్మరక్షకై 424

ఎంత బలగంబుతోనైన నెవ్వడైన
జంపగాలేడు మారీచు జంపలేడు
రాము డొక్కడె విను మహా! రాజ! వాని
బట్టగలవాడు దగురీతి గొట్టువాడు. 425

నీ మహాసేన మారీచు నేమిసేయు
బాలుడైనను రాముడే చాలు నాకు
నతని తేజంబు సామర్థ్య మరియనగునె
యే నెఱుంగుదు నీ బాలు డెవడో రాజ! 426

అని రాము బంపగా మునిపట్టు బట్ట
మునిమాట కా రాజు మోదంబు గనడు. 427

అతులిత కోమలాంగు డకృతాస్త్రుడు బాలకు డైన రాముడే
గతి; నెదిరించు దైత్యువని క్ష్మాపతి పంప దలంపకుండె గా

ఏ. తుద వశిష్ఠువాక్యమున నేరిచి రాము డతుల్యు డందుగా
ధీతనయు వెంట నంపె నధితేజుని పుత్త్రుని బాలచంద్రునిన్. 429

మునిరాజు వెంటాడె మోదంబుతోడ
దినరాజసముడు దేదీప్యమానుండు. 430

ఆ గాధిసూనుని యాశ్రమస్థలిని
యోగంబునందున్న యోగిరక్షకుని. 431

ధర్మంబు సేబూని తమ్మునిం గూడి
కర్మిష్ఠు డగు మౌని గాపాడువాని' 434

కన మీసములు లేని వనజాక్షిబాలు
ఏని దాటకిని జంపె వచ్చినవాని. 433

కనకమాలావృత కంఠంబువాని
ఘనపర్ణ శిఖతోడ గ్రాలెడివాని. 434

ఏకవస్త్రము దాల్చి యిల విల్చువాని
లోకానగని బుద్ధి లోపించుకతన 435

మనసులో నేంచి బాలునిగాగ నంత
వెనుకాడకే యాగవేదిక డాయ. 436

ఆయుధపాణి నన్నచ్చట గాంచి
పాయడు కాంతిని బాలరాముండు. 437

భయ మొంద డొక్కింత బాలవీరుండు
రయమున విల్లెత్తి లాగె గుణంబు. 438

కొట్టగ బాణ మొక్కట నకుంఠిత తేజు డు రాఘవుండు నే
బిట్టుగ నొచ్చి పాఱితిని భీతిని బాఱుచు నున్న గూడ నన్
బట్టుచు దూపు; వీడకయె పైచెను యోజనముల్ శతంబుగా
నెట్టుచు; వార్నిధిన్ మునిగి నె నపు డెట్టులో తెప్పరిల్లితిన్. 439

చంపియు నాసహాయులను, జంపక నన్ విడి వార్ధిమధ్యకున్
బంపిననాడు వాడు కడు బాలుడు. నేడొ మహాస్త్రశస్త్రముల్
పొంపిరిగాగ నేర్చిన యమోఘ బలాన్విత వీరమూర్తియే.
కంపము నొందు మేను రఘుకాంతుదలంచినయంత రావణా? 440

చంపక వీడిన రాముని
కొంపకు పుట్టింప నిప్పు కోరెదొ, ఓయన్నే
పంపున వీడెనా! నేడో
త్రుంపక విడువం డతండు రోయుచు నన్నున్. 441

బాలుని శరమే వననిధి
లీలగ నను బట్టి చంపలే దొకొ రాజా! 442

బాలకు డే గదా జలధి వైచె ననున్ మును వాడు; నేడొ యా
భీలుడుగాడొ యుద్ధమున బిట్టగు నొక్క శరాన జంపడే
లీలగ నిన్ను నన్ను నవలీల గ రక్కసిమూక నెల్ల బో
జాలము చెంతకున్ మఱలజాలము వోయిన గూడ రావణా! 443

చెప్పితిని రాఘవుని బాల్యచేష్ట కొంత
వినుము చెప్పెద యౌవనవీరరాము
గాథ దండకావని దనకాంత గూడి
సోదరునితోడ నుండ గా జూచివాని. 444

కక్ష దీర్చుకొనగ గాంక్షించి రాముడు
సర్వభూతహితు డు సాధుమూర్తి
మౌనిగాగ సతము మనుచుంట నపకృతి
జేయ జాల డనుచు జెలగి నేను 445

వాని జంజనెంచి పై బడు నంతట
నా సుపర్ణవేగ మధిగమించు
వడిని విడచె నత డు బాణమ్ములను మూడు
తోటి యసురు లెల్ల దూలిపడగ. 446

నేను బూర్వానుభవము లో బూనియుంట
నెటులొ పరువెత్తి చావు దప్పించుకొంటి
వజ్రసంకాశ రఘురామ బాణవితతి
జావకుండుట యేరికి శక్య మగును? 447

గీ. రెండుమాఱులు నన్ను రాముండు గొట్టి
చంపకుండ విడచుట సత్య మిరసి

దుష్టచేష్టల నంతతో ద్రోసిపుచ్చి
తపసినై యుంటి నిచ్చట ధర్మ మెఱుగ. 448

కనుమూసిన గనుదెఱచిన
గనుచుంటిని రామచంద్రు కార్ముకయుతు, నీ
వనమం దెల్లెడ రాముడు
వనజేక్షణుడే చరించు వానిం గనుమా. 449

చెట్టుల బుట్టలన్ ధనువు జేకొని వల్కలధారియైన యా
దిట్టరియే కనంబడు నదే కను మాతని శాఖశాఖలన్
గిట్టును వీడి చెప్పితి నకుంఠితతేజసువాడు వాడెక
న్పట్టు సహస్రరాములుగ నద్దెస లెల్లెడ నేక కాలమున్. 450

భీకర పాశ చాపముల భీతిని గాంచుచు దద్దరిల్లుచున్
నాకమువంక జూతు; రఘునందను లెందఱొ వేనవేలుగా
నాకసమందు గూడ నుదయం బగుచుండిరి మోము వాల్చినన్
నా కనుదోయి గాంచు నిల నాయన? పెక్కుఱు రామచంద్రులన్.

అణువు వణువున క్షణమాత్ర మద్భుతముగ
రాము లుదయించుచుండి రదేమొ! కాంతు
నేడ జూచిన మఱి యెపు డేని గాని
వీరు గోదండపాణిని ధీరవరుని. 452

ఏ మిది యంచు గన్ను గన నెంతయొ గట్టిగ మూసిమూసినన్
రాము డె విల్చు ముందు నిదురం గన నా కలయందు గూడ శ్రీ
రాముని నారిటంకృతి పరంపరలన్ వినుచుంటి నేడ నా
స్వామిని గాంచకుందు; ధరపై దివియందు జలంబులందునన్. 453

రా యను నక్షరంబు విన జాల సుమీ వడకున్ శరీర మా
రా యది యాదియందు గల రత్నములాదిగ శబ్దముల్ వినన్
రోయుచు నుంటి రాము దవరూపబలుం డెవ డైన డాయనో
నే యవు డా బలిన్ నముచినిం గడతేర్చిన వాడు వాడెగా, 454

ఇంతవా డంతవాడని యే మనందు
రాఘవుడు లేని చోటేది? రామమయమె

యెవ్వరును లేని తావున నెల్లరుండు
తావున నెఱుంగు మో తాత! దాశరథివి. 455

నీ మది కిష్టమైన గతినే చరియింపుము పూను మాను శ్రీ
రామునిపై గడంగుట సురారి! ననున్ మన నెంచినన్ భువిన్
రాముని మాట జెప్పకు పరాకున గూడ వినంగజాల నీ
భూమి బరాపరాధమున బొందరె ధార్మికులున్ వినాశమున్.

సాధువృత్తివి గాలంబు జరుపుచున్న
నేను నీతోడ రా జాల నేను గూడ
నీదు పాపాన నశియింపనేర దాత!
యెవరి యిష్టము వారిదే యేమి సెపుదు. 457

శూర్పణఖ విరూపము గనె సోదరుల ఖ
రాదుల వధించె నందువా రాగము విడి
సత్య మెఱుగ గనగు నీవు సాధువృత్తి
రాము దపకార మూన దే రామకైన. 458

శూరుడు వీరరాఘవుడు సూచుచు నూఱక యుండునే మహా
క్రూరత జూప్పనాతి తన కోమలి సీతను మ్రింగ బోవగా
నారి యటంచు జంపమికి నాయన! మోదము నొందగా దగున్
దూరకు మీవు రాఘవుని దోషమె కోయుట ముక్కుమం జెవుల్?

అరయకుండ సత్యము ఖరాదులు సోదరి వెంబడించి యా
ధీరునిపై బడన్ విడువ దేబెయె రాఘవుఁ డాత్మరక్షణం
బోరున జంపె వారల జమూయుతులన్ మఱి దోషమేమి? యె
వ్వా రిల యుద్ధ మూను పగవారల జంపక యుంద్రు రావణా!

రాముని తప్పేమి రావణ చెపుమ!
యేమని క్రోధంబు రామునిపైన. 461

బంధుహితుండను బల్కినా వితుల
బంధుత్వ మెంచి నీ బాగు నే నెంచి. 462

నీ కేది పథ్యమో నీవ యెఱుంగు
నాకైన మాటనే నీకు జెప్పితివి. 46

నా మాట వినకుండ రాముని డాయ
నేమౌదువో రాజ యేలు గనున్నావు. 464

నీ నాశమే కాక నిల్వదు లంక
నానాసుఖంబులు నాశన మౌను 465

సీతానిమిత్తమె చెడదె నీ లంక
పితృప్రహోతునిపాలు వీడుగా దొక్కొ 466

మేడలు మిద్దెలు వాడలు గూడ
బూడిదపాలౌను దోడనె రాజ! 467

నామాట వినవేని నాయనా! నిజము
రాముండు దునుమాడు రాక్షసవితతి. 468

అతడు సతతంబు భూతాళి హిత రతుండు
ధర్మ మెత్తెడి ధర్మంబె తలచి యెపుడు
దుష్టులనుమాత్ర వధియించు ద్రష్ట రాఘ
వుండు సజ్జనావళి రక్షకుండతండు. 469

పోరిన బోరుము తెంపున
ధీరునివలె నాజివైరితేజము డుల్లన్
వీరు డె దొంగతనంబున
నారిని గొని తెచ్చువా డు నయగుణధుర్యా! 470

మారీచుండ! హితోపదేశ మొనరింపబూనితే నాను ని
న్నోరి కోరిన దేమి! నీ వనిన దేమో యెంచుమీ! యేరి కీ
వీ రీతిం బలుకాడినావొ! స్పృహ లేదే? రావణుండన్ సుమా!
వీరుండం గడు ధీరుడన్ మఱచితే వేయేల నాలింపుమా! 471

నీకం దేవడి నిశ్చయించితివి నీచేనైన కార్యంబె నే
బ్రీతిం గోరితి ధిక్కరించి నను నో రెట్లాడెనో పల్కగా
జేతోమోదమునం బ్రలాపముల వాంఛింతే యకార్యంబు నీ
రీతిన్ మానవునిన్ బ్రగల్భముల చిత్రింపం దలం పేలరా! 472

నా మాటన్ విని రాముపై జనుట ప్రాణంబుల్ విసర్జించుటౌ
నే మారీచ! మదాజ్ఞ వీరునెడ మన్నింపంగ జాలన్నినున్

రాముండే హరియైన నీ వతనిచే రాలం బ్రశస్తంబెకా
యేమోయీ కడు బందవైతి విటు లెమ్మీ యింక కార్యార్థివై. 473

తలప రాజాజ్ఞ దలదాల్చు ధర్మ మబ్బు
దానమృతిగల్గ సద్గతి ధర్మమబ్బు
రాముడే నీ వనుగతి నారాయణుండై
యైన నాపంపు ధర్మద్వయంబు నిచ్చు. 474

చెవిని బెట్టుము రాజాజ్ఞ జెడక నీవు
వినవో నా యాన విభ్రాంతి మనెడివాడ!
మరణదండన విధియించి నెఱపువాడ
దాన మరణంబు తప్పదు ధర్మ ముడుగు. 475

నీ వనినరీతి రెండుమార్లింత దనుక
రామబాణంబు గురిదాటి బ్రతుక వాక్కొ-
యల్లె యీ మాఱు బ్రతుక గానగునో యేమొ
బ్రతుకు నవకాశ ముండి రాజాజ్ఞ వినిన. 476

వరుడు రఘూద్వహుం డనెడి భావము నీయది చావ వానిచే
పరమపదంబె లభ్యమగు, భానుకులోత్తముచేత జావవేన్
స్థిరమగు నర్థరాజ్యము నిదే యిడ బూన నొసంగుచుంటి నా
ధరపతి వాచు సౌఖ్యమున ధాత్రి వెలుంగుము నా హితుండవై. 477

నీవున్ నేనును గూడ జత్తు మనెదో! నే నీత దే బోవ , గా..
నీ; వేయేల లభించు జావు హరిచే విప్పట్టునన్ నాకునుం
జావే రానిమెదన్ రఘూద్వహుడె నా చాపంబునం జచ్చుచో
లావణ్యాంబుధి సీత చేత బడు నేల్గాగైన మేలేకదా! 478

కాన లే లెమ్ము మారీచ! కార్య మూను
మిద్వురకు మేలుగాదె నా యీ విధంబు.
సీత దెబూను యత్నమే శిష్టకర్మ
మిపుడు ధీమంత! యోజింపు మీవు గూడ. 479

సీత మాయసేత జేరెడి లంకకు
నధియ విశ్చయంబు నంతపైవి

రాము డనిని బూన రానిమ్ము మనలంక
జయమొ యపజయంబొ భయ మదేల? 480

అను నా రావణుమాటలన్ వినుచురాజాజ్ఞన్ దలం దాల్చుచున్
మనగా నొల్లక; రామచంద్రవిభురామం బట్టగా దోర్బ్రదం
బన నౌనే చనకున్న రావణుడు నన్ జంపుంగదా! దుష్టతా
వణు జేతం బడి చచ్చుకంటె సుకృతంబౌ రాముచే జచ్చినన్. 481

అని యెంచి మారీచు డంతట బల్కు
కని రావణున్ దుష్టకర్మాత్మునకును. 482

చచ్చుట యింక నిశ్చయము చావదలంచితి రాముచేత నీ
యిచ్చమెయిన్ బరాత్పరున కే నపకారము సేయబోయి, యా
పచ్చరితుండు రాఘవుడు చంపక నన్ విడకుండుగాక, నన్
బుచ్చుము; చేవ నీవలన, మోక్షముబొందగ జత్తు రాముచే.

మాయామానుషవిగ్రహుండు సుమ రామస్వామి భూభారమున్
ద్రోయం బుట్టినవాడు దైత్యరిపులం ద్రుంపన్ వనిం జొచ్చె నీ
మాయాతీతుడు నవ్యయుం డభయుడున్ మాభర్త నారాయణుం
డాయాద్యంతవిహీను డౌట బగ యేలా! రావణా! రాముపై.

సుఖపడగ వింటి కేగుము చొరవపలదు
పరమకారుణికోత్తము భక్తి గనుము
నీ హితం బెంచి చెప్పితి నేను వినుము
రాఘవునుబోలి నీ కేల రావణుండ! 485

మరణము సన్నిహితం బయి
పరుల హితంబును వినండు ప్రాజ్ఞుడుగూడన్
దురమున విను నీవారల
బరిమార్చును, నేను నేడె ప్రళయము గాంతున్. 486

కా దనెద వేవి వచ్చెద గాలు జీర
నీదు వెనువెంట రావణా! వాద మేల ?
కాలకర్మాలు రెండును గలిసినపుడె
పుట్టు విపరీతబుద్ధులు గిట్టుకాలకు. 487

### రావణుడు, మారీచుడు రామాశ్రమము జేరుట

అను మారీచుని రావణుండు హృదిలో నానంద ముప్పొంగ వే
జిన గా బంచవటీ కుటీరమునకుం సన్నాహముం జేసి సీ
తను బట్టంగల సంవిధానము సమస్తం బంత మారీచుతో
నని వే బోయిరి తేరుపై నిరువు రాయాప్రాంతముల్ దాటుచున్.
గిరుల నదీనదంబుల ప్రకీర్ణవనంబుల బత్తనంబులం
త్వరితగతిన్ గమించి యటదండక బంచవటీస్థలంబు జే
రి రథము డిగ్గి కాంచి కదళీవృత మాశ్రమవాటి సంతటం
దిరిగిరి. స్వీయరూపముల తీఱు నెఱుంగకయుండ నెవ్వరున్. 489

మారీచుని కరముం గొని
యా రావణు దను హితుండ యరుగుము పనికై
శ్రీరాముని యాశ్రమ మిదె
చేరితిమి జయంబు నీదె; సీతయు నాదే. 490

ఒరులు కనలేని మాయ. మై యుండ నచట
నంత మారీచు డింతతో వింత గొల్పు
హరిణరూపంబు దాల్చి విహార మూనె
మురిపెముం గొల్పుతీరున మెఱయుచుండి. 491

### ఆశ్వాసాంత్య పద్యములు

మాయామేయజగత్ప్రసిద్ధు డవు సంభావింప శక్యంబె నీ
మాయన్ నిన్నును; నీవె జిక్కితివి నీమాయన్ మృగవ్యాజమై
ధ్యేయా? నీ పదపంకజస్మృతియె పోః దీపంబు సంసారపున్
మాయాఘోరనిశన్ దరింప రఘురామా! ఆర్తరక్షామణీ!. 492

కారణ ముండకే గలుగు కార్య మొకండును నుండబోదు సం
సారమునన్ జనంబు పడి సంచితరీతి సుఖంబు దుఃఖమున్
సారెకు సారెకుం గుడుచు జచ్చుచు బుట్టుచు; జన్మజన్మలం
దారునె గర్భవాసగతియాతన నీకృప లేక రాఘవా! 493

కారుణికాగ్రగణ్యుడ జగత్పితరుండ! త్వదీయమే కదా!
ధారుణి జీవరాశి సతతంబు పెతంబడి దుఃఖవార్నిధిన్

ఘోరన నేడ్చుచుండ విని చూచుట నీదగు లీల యొక్కొ! యా
ఘోరము దుష్టచిత్తుల కగున్;దగునే యిది నీకు రాఘవా? 494

జాలి యొకింతయుం గనగ జాలవ! దుఃఖపరీతలోకమున్
లీలగ జూతువా? ఘనులరీతియ! యియ్యది నీస్వభావమా?
ఏలిక మోసమున్ నలుపునే; యిటు మోసము సేయువారలే
కాలగతిన్ విచారనిధి గాలిడి మున్గరె! లోకపాలకా? 495

ఇది శ్రీగోవిందరామాయణమున రక్షకరామ
కావ్యంబున ధర్మవ్యాసము సంపూర్ణము.

ఓమ్
శ్రీరామాయనమః

# శ్రీ గోవిందరామాయణము - రక్షకరాముడు

## 5 ఆశ్వాసము

పురుషుల వలపించెడి నిను బురుషుని గను కన్నుదోయి మద మందునె సుం
దరతమ మేది గనిన; శ్రీవర? లోకార్థమ్ముగాక భ్రమసెనరీతిన్.

### సీత లేడినిఁ గోరుట

మిసమిసలాడెడ పసిడివన్నెల మేను మిఱుమిట్లు గొల్పంగ మెలగు లేడి
రజతవర్ణపు సరి రమ్యమౌ చుక్కలు తనువెల్ల భాసిల్ల దనరు లేడి
రమణీయ రత్నాల లలితమౌ కాంతుల గొమ్ముకొనలు మెరజిమ్ము లేడి
మణుల తీరున నొప్పు మంజులంబై యున్న పస చెవ్వు చెక్కల మసలు లేడి

ఇంద్రనీల కాంతుల గడు వింపు గొలుపు
లేడి యరటి బోదెల జుట్టి యాడుకొనెడి
లేడి ఖంగుఖంగున దూకు పైడిలేడి
రాఘవుని యాశ్రమస్థల రహి జెలంగు. 2

అంద చందాల మురిపించు నతుల మగుచు
బరుగు లెత్తుచు బచ్చిక గొఱుక నిలుచు
గంతు లిడి పక్కకుంజూచి కదలిపోవు
నేరి వలపింపనేర దా తీరు లేడి? 3

కాని యది యేమొ యితర మృగంబు లెల్ల
దాని డాసివాసనజూచి తరలిపోవు

రాఘవుని యాశ్రమంబున రమ్యమృగను
తమ్ము భక్షింపవచ్చిన దైత్యుఁ డంచు. 4

అడవి మృగముల దినెడి యీ యసురమృగము
జీవహింస నొనర్పక చెలగు నేడు
ఆశ్రమపదాళి జరియించునట్టి రీతి
బచ్చిక చిగుళ్ళనే మేసి వలపు గొలుపు. 5

చిగురుటాకుల మేసి చెలగుచుం బొదల
మొగమెత్తి చూసు ప్రమోదంబు గొలుప 6

ఆ లేడి చపలాక్షి యాశ్రమవనిని
లీలగా దిరుగాడు గాలిలో నెగిరి 7
కులుకుచు గెరలెడి చెలువంబుదాని
లలి గాంచె సీత పూవులు గోయ నేగి. 8

రామసౌమిత్రుల రండని పిలచె 9
నామృగంబును గాంచ భూమిజ యంత.
రాఘవా! చూడుమీ రమణీయ మృగము
మేఘాల వెలుగొందు మెఱపు బోలెడిని 10

రాముడు దమ్ముండు రా వెనువెంటన్ భూమిట చూపెను బొల్పగు లేడిన్
ధీమహితాత్ము లదేగతిగా మా యీ మృగము గని రబ్బుర మొప్పన్. 11
అపురూపంబగు నందచందముల లీలానక్త యీ లేడి ము
న్నెపుడుం జూచి యెఱుంగ నీ వనిని వన్నెల్ చిన్నెలంగల్గి యీ
వపువుం గల్గినదాని జీవములతో బట్టంగనౌ దీని నీ
విపుడే, ముద్దులమూట వెంటగొననౌ నీ లేడినిన్ రాఘవా 12

వనమున్ వీడి యయోధ్య కేగుతఱి నీ బంగారులేడిం దగుం
గొన వెంటన్ భరతుండు నత్తలును సంతోషింతు రిద్దాని జూ
చిన నవ్వారికి గాన్క దీన నిడగా జెల్లుంగదా! పట్టుమీ
యినవంశోద్భవ? వీరరామ? ధరణీశేంద్రా! మనోవల్లభా! 13

అంత రామానుజుండు మాయామృగంబు
గనుచు నబల జానకి గని కాంచి రాము

దూరదృష్టిని బలుకు రాక్షసుల తెఱగు
తెఱిగి యుండుట మారీచు నెఱింగి యుంట. 14

చూచితి దీని నియ్యదియు జోద్యముగా గనుపించుచుండె మా
రీచుండు రాక్షసుండు పలురీతుల వేషము లూని యీ వనిన్
వేచుచు జంతుజాలముల వేటకునై చనుదెంచు రాజులన్
బూచిగ నక్కఁచంపి తిను మూఢుడు వాడు చరించు మాయతో 15

దుష్టులు దండకాటవిని దోర్బల రాక్షసులెల్ల జచ్చి రీ
భ్రష్టుడు దప్ప, జంపదగువాడగు వీనినిగూడ జంపుచో
శిష్టుల రక్ష చేకుఱు బ్రసిద్ధుడు మాయల వీడు వీని యీ
చేష్టలు మోసపుచ్చెడిని సీత యమాయకురాలు రాఘవా? 16

అని పల్కఁ లక్ష్మణు డా సీత వినుచు
బనివడి యడ్డుగా బలుకాడ దొడగె. 17

మరణము నెందకుండ రఘుమాన్యుని బాణహతిన్ సజీవమై
వరలిన బెంచుదాన వనవాసమునందున గూడ గాక నీ
శర విశిఖంబునం దునుమగా దలపెట్టెదో! దాని చర్మమే
మురిపెము గొల్పునాకు రఘుపుంగవ! యీయవె లేడిచర్మమేన్ 18

సుందరతమమైన సొంపులకుప్ప
యందాల పేటి యీ హరిణచర్మంబు. 19

చిత్రాసనంబున జేర్చిన దాని
నేత్రపర్వంబుగా నెనరొప్పగాదె 20

వినుగూడి దానిపై నిద్రింపనెంతు
వినవంశ దీపకా! యిదియే నా కోర్కెఁ 21

కామవృత్తిజేసి కాంతలు భర్తల
నిట్లుకోరుట తగ దెంచ నంచు
భయము దెచ్చు ననుచు బ్రాజ్ఞత గలిగియు
నడుగుచుంటి దానియంద మెంచి 22

### రాముఁడు లేడిని పట్టఁబోవుట

అని పల్కు ప్రియురాలి వినయంపు నుడుల
వినుచుండి రాముండు గనుచుండె లేడి. 32

తేరిజాలు జూచు దివ్యాస్త్ర రఘురాము మురిసె మొక్కగాంచు ధరణి సుతను
దివ్యకాంతి బూని తిరుగాడు నా లేడి సీత హృదయమునకు బ్రీతి నింపె 24
రక్తపద్మోత్పలముఖంబు రహి జెలంగ నింద్రనీలోత్పలశ్రవా లింపు గొలుప
కించి దభ్యున్నతగ్రీవ మింద్రనీల దళనిభాధర హరిణంబు తమివి గూర్ప 25

రాము డాశ్చర్యచకితుడై రామకోర్కె
దీర్పనెంచ లక్షణునకు దెలిపెనంత
నీ హరిణచర్మమున సీత యిందువదన
భర్తగవకూడి కూర్చుండు బ్రమద మొప్ప. 26

చూచి యెఱుంగ మిట్టి మృగశోభ, దివిన్ మృగశీర్ష మొండెగా
దోచు సమాన మీ మృగముతో ద్యుతి; నెంతటి చోద్య మిద్ది; మా
రీచుని మాయ కానగు జరింపగలాడిటు వాడొకండె ము
న్నేచడె లక్ష్మణా! యిత డనేక విధంబుల సజ్జనావళిన్. 27

ఇదియ మారీచుడే యైన నింతకంటె
నమయ మొండేది లభియించు జంప వీని
దమ్ముడా యగస్త్యుండు వాతాపి జంపె
నట్లె పరిమార్తు వీని నీవవిన యట్లు. 28

సీత యభీష్టమున్ నెఱప జెచ్చెర లేడిని బట్టువాడ నా
చేతికి జిక్కదేని యసుచేతివి బెట్టెద దీనిచర్మమున్
నాతి కొసంగువాడ విది వావన నీవు జటాయువున్ ధరా
జాతను రక్షసేయదగు సర్వవిధంబుల నప్రమత్తతన్ 29

సాయకం బొంటిచే దీని జంపివత్తు త్వరితగతి నంతవఱకును ధర్మమూని;
క్షణిక మందున నాపద సంభవించు ననుచు జాగ్రత్తబూను మీ యబల గాయ
ఆమె తోడనె మనపని యామె వశమె మన కవశ్యమౌ కర్మ మీ పవితరక్ష
ణం బవశ్యకర్తవ్యంబు నాకు నీకు దీవి గ్రహియింపగల దీవ ధీయుతుండ 31

ఖండన యోధుడైన రఘువర్యుడు పూనుచు నొక్కపాణి గో
దండము మెల్లగా విశిఖ దండము పూనుచు నొండు పాణి బల్
దండగ బూల తీగ దలదాల్చి జటాపటలంబు జుట్టి వే
చండతర ప్రచడగతి సాగెను మాయలమారి లేడికై. 32

మాయకు మూలమౌ మాయకుండగుచు
మాయలేడిని బట్టబోయె రాముండు. 33

అనుచున్ ఖడ్గము బొడ్డునం దునిచి ధర్మాయత్తుడై శార్ఙ్గమున్
ధనువుంబూనుచు రెండు తూపుటొదులం దాగొంచు రాముండు లే
డిని వే డాయగ బోయె నాహరిణమో; డీయన్నరీతిం ద్రుటిం
గన రాకుండగ మాయమౌచు మఱలం గన్పట్టెడిన్ ముందటన్ 34

ముందన కేగుచున్ మృగ మపూర్వగతిం దనవెంటవచ్చు రా
కేందుని భానువిం గను బ్రకీర్ణవనాన బరావృతాస్యమై
యందున నిందు గన్పడును నల్లె మఱింతగ దూరమేగుచుం
జిందులు ద్రొక్కుచున్ సొబగు జిందుచు బాఱెడి లేడి యావలిన్ 35

చూచుచు నంతలో మృగము జూడదు రాఘవు డంత నంతటం
దోచక యేమియున్ నిలుచు ద్రోవను, బచ్చిక మేయునట్లుగా
దోచగ గొంత దూరమున దోర్బలు డచ్చట కేగునంత, గా
ఙ్చాచుచు ఖంగునన్ దుమికి చయ్యన మాయమగున్ మృగం బహో 36

ఒకచోట నిలుచుచు నొయ్యారముం జూసి పచ్చిక మేయుచు చెవులెత్తు
వేఱొక్క తావున దూరుచు పొదరిండ్ల వెన్కకు జూచి వింతగొల్పు
నింకొక్క తావున నింపుగా గొఱుకుచు దలిరాకు కొమ్మల దాటుచుండు
మఱియొక్క తావున హరిణ జాలముగూడి గుంపులో [illegible] వింతసొంపు జూపు

నందినట్లుండు దరిడాసి యందకుండు
దాపునకు వచ్చి బెదరుచు దాటిపోవు
ముందు బొడిసూపు నంతలో బోవు నెటకొ
దశదిశల బన్నులెత్తుచు దారుచుండు 37

తరిమి తరుముచు మృగమును పరుగులెత్తి
వన్యమధ్యంబునకు దనవాడ పోడ
వెడలి చాల దూరంబుగా వీరవరుడు
విసిగి వేసారియును లేడి వీడ డాయె 37

పచ్చిక మేదుల నటు నిటు
నెచ్చట గనరాని మృగము నిస్పృహొందగుచున్
నొచ్చిన మది గూర్చుండిన
సచ్చరితుడు గాంచి చెట్టుచాటున లేడిన్. 39

వన్యమృగంబుల గూడి య
నన్యముగా దిరిగి లేడి నక్కాగ రఘురా
జన్యుడు బ్రహ్మాస్త్రము విడె
విన్యాసముసేసి లేడి పీడగ నఃటవుల్. 40

## మారీచుడు చచ్చుట

అంత బ్రహ్మాస్త్ర మాలేడి నపుడె పట్టి
చీల్చి చెండాడె శిథిలంబు నొంద మాయ
తనువు నిజరూపు మారీచ దైత్యుడాని
విట్టవిలువున నిలబడి నేలగూలె. 41

రాఘవుని యస్త్రమంత సురారిగుండె
బిడుగు వలె జొచ్చి యాతని మడియజేసె
ప్రాణముల విడుచుండియు వదలలేదు
రామచంద్రునిపై జూపు రాక్షసుండు. 42

అంత హా సీత! హా! లక్ష్మణా యటంచు
రామకంఠధ్వనిగ నార్తరావ మొప్ప
నఱచి జీవంబులను వీడి యరిగె దివికి
దాశరథిచేత మరణంబు తప్పదాయె. 43

పుట్టినవాడు చచ్చుట యపూర్వము కాదని వాడెఱింగియే
గిట్టదలంచి రాఘవునికేల, నృపాజ్ఞను మీఱకుండె, నా
దిట్టరి మాయకాడు నిజదేహము వీడెను విష్ణువైరిగా
బుట్టిన జీవితంబు తుదముట్టెడి యంతకు వైరిభక్తుడై. 44

ఎంతటివారి కబ్బు జగదీశ్వరు రాముని చేత జావు వీ
డెంతయొ క్రూరకర్ముండయి యేచుచు సజ్జనులం, దరించెగా
సంతత రామభీతి హరిసంస్మరణంబున జిత్తముంచుచుం
బంతము బూని యాహరికె బాముల గూర్చుచు వైరిభక్తుడై 45

హరి నామస్మరణంబు జచ్చుతటి జేయంజాలు మాత్రాన, శ్రీ
హరి సాన్నిధ్యము లభ్యమౌను గద, దేహాంతంబునన్ రాముచిం
బయజూడన్ హరిసన్నిధిన్ ఎడువగా ప్రాణంబులన్ వానిచే
మరణంబుం గన నోచి దైత్యుడయినన్ మానాథునిం జేరడే. 46

కారణ మేదియైన జనకాత్మజ సీతను లోకమాత నో
రారగ బిల్చినాడహ! పరంపదవర్తను శేషు లక్ష్మణుం
జేరినవాడు గూడ నికజేరె పరంపద మంట వింతయే
వైరిగ లేక భక్తుడుగ వాని స్మరించిన మోక్ష మబ్బదే! 47

సతతము రామచంద్రు మది సంస్మరణం మొనరించి భీతిచే
సతిని ధనంబు గేహమును సర్వము త్యాగమొనర్చి యొంటిపై
బ్రతుకు మహాత్ముడై విగతపాపుడులై హరిచేత జచ్చుచే
హితముగ రాఘవాస్త్రమున నీల్గిన వానికి మోక్ష మబ్బదే. 48

దైత్యుడును బాపి ద్విజుడును ధార్మికుండు
నొక్కరీతి బరంపద మొందగలరు
తనువు పాలించు సమయాన దలచు నంత
రాఘవుని సత్యమిద్ది శ్రీరాము మహిమ. 49

అనుచు మారీచు మరణంబు నరసి సురలు
ప్రమద మొందుచు బలికిరి రాము నెంచి
జన్మసాఫల్య మౌ నింక జానకీశ
యంచు మోదంబు ఖేదంబు నందినారు. 50

రావణుడు చెప్పిన విధాన రాముపోలె
నార్తనిస్వనంబున దైత్యు డఱచి యుంట
వాని విని లక్ష్మణుడు సీత దద్దఱిలుచు
నేమిసేతురొ యని రాము డిట దపించు. 51

హా! సీత హా! లక్ష్మణా! యను నార్తి
నా సీత వినునెడ నాపద దలచు 52

మాయహరిణంబు మారీచు మాయ యనుచు
దొల్తనే తెల్పె సౌమిత్రి ధూర్తు డిపుడు
చంపబడినాడు బ్రహ్మాస్త్రశక్తివలన
కీడు మూడునె యివ్వాని కేకవలన! 53

రాముఁడు మరలుట

అని రాఘవుండు కృతార్థుండే యయ్యు
మనమున శంకించి మహితమౌ కీడు! 54

తన యాశ్రమము జేర వనమార్గమందు
జనుచుండె వడివడి జనకజం దలచి. 55

సీత కలవరము - నిష్ఠురోక్తులు

ఆ పంచవటివి రామార్తివి విమట
నోపవి దుఃఖంబు నొందుచు సీత. 56

హా సీతాయను రామువిస్వన మదే యాలింపుమీ లక్ష్మణా?
వేసెం గేక రఘూత్తముండు వినవే, వేబోయి వారింపవే
గాసిం జెందెనొ! కీడుమూడెనొ! కటా! కాంతార మధ్యంబునన్
నాసామిన్ దరిజేరు లక్ష్మణ! యరణ్యంబందునం దోడుగా 57

జీవము విల్వ రింక పనజేక్షణు రాఘవు నార్తి వింటి వే
బ్రోవగ నాధువిన్ వెదలు మోయి సహోదరు జాడజాడుమీ
యీ పవి నెంతదూరమున నే విధి నెచ్చట కీడు మూడెనో
స్థావర మల్లె వీడి చనె జయ్యన రక్కసు లేమి సేసిరో. 58

అనుమాట సౌమిత్రి యాలించెగావి
చన నొల్లకుండె సీతను వీడి యతడు. 59

అంతన్ జానకి కోపతాపములతో నాలక్ష్మణుంజూచి గో
రంతైనం జలియింపవేమి వివియున్ రాముండు బిల్వంగ విన్.
గాంతారంబున రాముడెట్లొ మడియం గాంక్షింతువే యంత నా
చెంతంజేరి సుఖింపనెంచు తలపే చిత్తంబునం జొచ్చెనా? 60

అన్న మహాదార్తి నిస్వన మాలకించి
మిన్నకున్నావు దుర్బుద్ధితెన్నొ యిద్ది?
మిత్రురీతిగ నటియించు శత్రువీవ
యన్న నరయగ రక్షింప నరుగ వేల? 61

రాముని బట్టి వచ్చితిని లక్ష్మణ! కానకు నా నిమిత్తమై
రామి నిజంబ దాన నను రక్షణసేయగ బూననేర? నీ
రాముని గావగా జనుము. రాముడు లేనియెడన్ వసింతునే
యీ మహి నిచ్చటన్! హృదయ మే గతి నిల్చెను పోక యన్నకై.

బాష్పశోకపరిప్లుత భర్త దలచి
చపలయై భయభ్రాంతిని జనకపుత్రి
యాడుమాటల సౌమిత్రి యాలకించి
వినయమెప్పగ సీతకు బ్రియము పలుకు. 63

అమ్మ! యజయ్యుఁడా దశరథాత్మజుఁడీ భువనత్రయంబునన్
నమ్ముము రామునిన్ రణమునం గెలువంగలవారు లేరు నీ
తమ్మ! మృగాళి మానవులు దైత్యసురాదులు సృష్టిలో నర
ణ్యమ్మనవేని రాఘవు లయమ్మొనరింపగజాల రెవ్వరున్. 64

అన్న స్వరంబు గాదు సుమ! యాసురమాయ యటం చెఱుంగు, మా
పన్నుడు గాడు రాఘవుడు వన్యమృగంబును గొట్టితెచ్చునో
సన్నుతశీల! నిన్విడచి సాంద్రవనిం జరనౌనె నాకు రా
మన్న యనుజ్ఞ లేకయె నృపాజ్ఞను మీఱుట గూడ దోషమా. 65

అంతియకాదు దండక ఖరాదుల జంపిన నాటనుండియే,
యెంతయొ వైరమూని చరియించుచు నుండిరి రాక్షసాళి ర
వ్వంతయు నెట్టికష్టమును బ్రాపిలకుండగ రక్షసేయ నీ
చెంత ధనుస్సు బూని యట సీతమ! యుంటిని యన్నయానపై. 66

మాయలమారి రాక్షసుల మాయకు లోనయి నిన్ను వీడి నే
బాయను ధర్మమున్, మఱల వచ్చిన పిమ్మట నవ్వగింపుమీ
యీ యమ నంచు నన్న వని నేగ, దదర్థమ యప్రమత్తతం
గాయుచునుంటి నిన్విడచి కానను నొంటిగ, బోవజెల్లునే 67

కర్మబద్ధ సీత మర్మ మెఱుంగునె
యమితక్రుద్ధ యగుచు నన గడంగె
సత్యసంధుడైన సౌమిత్రి కంతట
జాడి దొలగి పరుషవాక్యచయము. 68

పన్నెయు వాసి గన్న రఘువంశమునం గులపాంసనుండవై
యన్నకు గీడు సేత హృదయంబున నున్న నృశంస; యోయి; నీ
తెన్నది యేదియో యెఱిగితిం, బలుమాట లవేల? రాముడా
పన్నడె యౌట నీమతము, ప్రాణము గానగ బోవకుంటివే. 69

తేనెపూసిన కత్తివి తెల్లమయ్యె
భరతుడో కైకయో నిన్ను బంపినారు
కపటవేషాన నన్గౌన గాన కీవు
వచ్చియుంటివి రాముడు మెచ్చునటుల. 70

సీతను బొందగోరునెడ సిద్ధి లభింపదు నీకు గైకయీ
సూతికివి విన్నిజంబ యిది సుందరునిన్ ఘనవర్ణు రామునిం
బూతచరిత్రునిం బురుషపుంగవు బద్మదళాయతాక్షునిం
బ్రీతిగ భర్తగాగ గొని వేరుజనంబుల కిచ్చగింతునే. 71

వీడి యెఱుంగ రాము రఘువీరుని నొక్క ముహూర్త మేని, నీ
తోడును దెమ్ము పొమ్మ పని, దోడ్కొని రా జనవేని, నే నిదే
వీడెద ప్రాణముల్ నిజము వీనులబెట్టుము నాదుమాట ని
వ్వాడ గలట్టి గౌతమి ప్రవాహమునం బడి చావ నెంచెదన్. 72

దాశరథి దప్ప నితరుపాదమ్మునైన
నంట నొల్లను లక్ష్మణా యనుచు సీత
యుల్లమును మోదుకొనుచుండి యోర్వలేని
పరమదుఃఖంబు గను పతివ్రతయు నాట. 73

తనదేహము కంపింపగ
దనువు గగుర్పాటు గనగ దాలిమి తొలగన్
విని మైథిలి పరుషోక్తులు
గని యామెను గేలుమోడ్చి కాకుత్థ్సు డనున్. 74

తల్లికి దుల్య! నీవు వసుధాసుత! దైవమ నీవు నాకు, నా
యుల్లము తల్లడిల్లె నెటు లోర్చెద నీపరుషోక్తి, లోకమం
దెల్లెడ స్త్రీజనంబు లిటులెంచుట వారిస్వభావ మొక్కొ! స్త్రీ
లెల్లరు ధర్మమున్ విడతురే? చపలాత్మలె! దుష్టచిత్తలే? 75

జానకి! సర్వదేవతలు సాక్షులు, వల్కితి న్యాయవాదిగా
దాని గ్రహింపవైతివి, పదంపడి నం బరుషోక్తులాడగా
బూనితివమ్మ! నాహృదయముం గడుగ్రుచ్చెను దప్తబాణమై
నీనుడి, యేమిసేతు నిక నీకొదవుంగన కీడు తల్లిరో! 76

రాఘవుడు సుఖుఁడని యెంచి లక్ష్మణుండు
కాని, యపనింద భరియింప బూన డతడు
ముందు గోయి వెనుక నూయి పోవు టెట్లు
కాళ్లు తడబడలాడు లక్ష్మణున కపుడు. 77

నేను నాయన్న మఱలిరా, విన్ను గనమొ!
కాలవిధి యెట్టిదో తల్లి! కాంచకుంటి
విధిని జవదాట గల్గెడి విధము గలదె!
నీకు వనదేవతలె పూనుగాక రక్ష. 78

ఓ వనదేవతా! యిచట నొంటిగ నున్నది రాముపత్ని, నే
నీ పని నీమె వీడి చన, నెట్టి మహాపద కల్గకుండ, నీ
దేవిని రక్షసేయగ నిదే నినువేడెద, నంచు నార్తుడై
పోవుచునుండె లక్ష్మణుడు ముందునకున్ రఘురాము జేరగన్ 79

## రావణుడు – సీత

ఎవ్వరిదృష్టిలో బడక యెప్పుడు లక్ష్మణు డేగునా యటం
చవ్వని దాగియున్న, యసురాధిపు డంత యతీశ్వరుండనన్
జవ్వని సీతముంగల బ్రకాంతిగ నిల్చుచు మోహితాత్ముడై
యవ్వనజాయతాక్షిని మహామహితం గను తెప్పవాల్పకే. 80

దండ కమండలంబుల యథావిధి పాదుకలన్ ధరించి యా
గండడు రావణుండు జట గట్టితలన్ మెయి గావిబట్టతో
నుండి విరాగియా యనగ నొప్పుచు భిక్షకవేష మూని రా
ముండును లక్ష్మణుండు విడిపోయిన జానకి బొంద జూచెడిన్. 81

చదల రవి క్రుంకి శశి రావి సాంధ్యవేళ
నలము పెంజీకటిని సీత నంత డాసె
నసురవిభుడు వనంబెల్ల నడలు కొనగ
గౌతమిని విల్చె గెరటాలు గదలకుండ. 82

బాష్పశోకాభిపీడిత పద్మవదన బర్ణశాల నాసీనయై భర్త దలచు
పీత హైశేయవాసిని సీత నరయు జిత్త మేరెకి శనియట్లు సేరబోయె. 83

వేదపరనాన బ్రాహ్మణవిజ్ఞు డనగ మాఱువేషాన దరికేగి మాటలాడు
వినయ మొప్పగ రాక్షసవిభు డెవండు లేని యానమయంబున జానకి గని.

ఎవ్వరిదాన వజ్రముఖి! యిందిరవా? గిరిరాజపుత్రివా?
యివ్వనదేవతామణివ? యిప్పుడు సుదతీలలామవా?
జవ్వని? దేవతాంగనవ? స్వర్ణ విభూషణ భూషితాంగివై
యివ్వని నుంటివేల? నిట నెవ్వరు దోడుగ లేక యొంటివై. 85

మవ్వపు రూపసంపద సమానలు నీకెటనేవి లేరు, ని
న్నెవ్వరు దెచ్చియుంచి రిట? నేరనివార లహో మనోహరీ!
యెవ్వగ బర్ణశాల వసియించెద విచ్చట, నీ వనీస్థలిన్?
బువ్విలు బూనువానివరతివో! యిది రాక్షసభూమి సుందరీ! 86

ఎవ్వరి పంశ పున్నతికి నీవిటు టన్మమునెత్తి తెచ్చినా
వెవ్వడు నీ కరగ్రహణ మీ భువి జేసి తరించినా డహో!
యవ్వనజోద్భవుం డిటుల నందమునే వడబోసి నీదురూ
పివ్వని సృష్టిసేసె నౌరా! యెంతవిలాసిని వీవు సుందరీ! 87

యతుల బతితుల జేయు నీయౌవనంబు చూడలే దింతదనుక నీసొబగు దాని
యక్షగంధర్వ కిన్నరులందు గూడ నఖిలసర్వాంగసుందరి వతివ నీవు.

కమలమాలను మేన గమనీయముగ దాల్చి
కమలాకరస్థితి గ్రాలవలయు
తారాపథంబున దనరార గాదగు
సొబగుల నేర్వగా జక్కలగమి
సుమమృదులంబైన సుకుమారి పూబోడి
వసియింప నుద్యానవనమె తగును

స్వర్ణప్రభాదీప్త వరదేహవల్లికి
సౌధరాజ నివాససరణి యొప్పు

నిటుల నాకులపాకలో నేల మనెద
వో త్రిలోకసుందరి? నీదు మనికి నాకు
వ్యసనకరమాయెగా!, దెల్పుమా త్వదీయ
కథ సమస్తంబు విననెంతు గౌతుకమున. 89

హెచ్చు వడి, నది గట్టు హరించురీతి
తరుణి చిఱునవ్వు నయనదంతముల జవ్వ
నాదు హృదయంబు హరియించె నీదు గాథ
వినదలంచెద జెప్పుమీ పేర్మి మీఱ. 90

అను నా బ్రాహ్మణవేషభిక్షువును మాయామూర్తిని గాంచి రా
మునియిల్లాలు సపర్యలన్ సలిపి ధర్మోక్తంబుగా స్వీయ గా
థను దెల్పం గడగెన్ రఘూత్తముడు సత్యాసక్తుడై తండ్రియా
నను బాటించి వనమ్ము జొచ్చినయుదంతబున్ సమూలస్ఫుగా.

ఇత డతిథి బ్రాహ్మణోత్తముం డెంచ మాఱు
పల్కనియెడ, శపించు నన్ భయము నొంది
సీత తనదు వృత్తాంతంబు సెప్పగడగె
గొంతసేపు యోజించి ప్రశాంతగతిని. 92

పలుగాకి ద్విజుడని భావించెనేమొ
నలుదిక్కులకు జూచు నళినాయతాక్షి 93

కనకుండి రాముని కమలాక్షు బతిని
వినయాన సత్కారవిధులను దీర్చి. 94

మాటల నందడి మఱికొంత తడవు
సూటిగా జన దనచొప్పును జెప్పె. 95

ఇనవంశోద్భవ రామచంద్రునకు, నే నిల్లాలనుం గోసలా
వని రాజేంద్రుని పెద్దకోడలను, సర్వైశ్వర్యభోగంబులన్
మనితిన్ బుట్టిన మెట్టి నిండ్లను సదా! మాన్యుండు ధర్మాత్ముడా
జనకోర్వీశుని సీత యన్ సుత నహో, సన్న్యాసి! భద్రంబగున్, 96

అత్తవారింట బెండ్లియై పిదప
బదియు రెండేండ్లుగా నుంటి బతిని గూడి
పదియు మూడవయేట నా పతికి రాజ్య
మిడగ మంత్రియుతుఁడు మామ యెంచునంత. 97

కైకమ్మ దశరథు కడపటిభార్య
ప్రాకటంబుగ రెండు వరముల గోరె. 98

రాముని వని కంప రాజ్యంబు విడక
భూమికి బట్టంబు పుత్రునిం గట్ట 99

కాముకుం డగు ఱేడు కాదనలేడు,
కామిని తప్పొప్పు గమనింపలేదు, 100

వని నుండ రాముండు పదునాలుగేండ్లు
తనయుండు భరతుండు గొన ధాత్రి గోరె. 101

నతివరంబుల రెంటి సత్యసంధుండు
మతిమంతు డయ్యును మన్నించె ఱేడు 102

తన తండ్రియానను దలదాల్చి సుతుడు
వినయంబుతో జేరె విపినంబు నాడు. 103

ఇరువది యైదేండ్ల వరలు రాముండు
పరగు నష్టాదశ వర్షాలు నాకు. 104

రాముడు సుప్రసిద్ధు డపరాజితు డెప్డు జితేంద్రియుండు నా
రాముడు సర్వభూత హిత రాముడు సద్గుణ మూర్తి రక్షణో
ద్దాముడు దానవీరుడు సతంబు ప్రతిగ్రహమెంచ బోవడే
నేమము నేవి దప్పని పునీత దృఢవ్రత సత్య సంధుడున్ 105

అన్నను విడియుండ డా లక్ష్మణుండు
పన్నగరీతిగా బగ దీర్చువాడు. 106

పరమధార్మికుడౌచు భ్రాతతో వనికి
నరుదెంచె విలుబూని యతులవ్రతుండు. 107

తాపసరూపాన దమ్ముడుం దాను
గాపురంబుండిరి కానలో విచట. 108

భార్యనై వెంటాడ బరమ పీరుండు
ధైర్యంబుతో నుండె తన్వి నంగూడి. 109

పలువిధంబుల భోజ్య పరికంబులను
లలి దెచ్చు వని నుండి రాఘవుం డిపుడె. 110

అందాక శ్రమదీర ననఘ! బ్రాహ్మణుడ
యిందుండు మీ యేల నేకాకి వైతి? 111

పేరును గోత్రంబు వివరింపుమయ్య
యూ రేది దండక నున్నా వదేల? 112

చూచి మాటాడు నంత, నాబూచి, సీత
నపహరింపంగ దుది నిర్ణయంబు పూని
స్వీయ మరణంబు విధి యౌాట సీత వలన
నటుగ నిశ్చితాత్ము డగుచు ననగడంగె. 113

దివిజులు మానవాది వనదేవత వర్గము దైత్యవారముం
బెవి బడెనేవి పేరు తమ చేష్టలు దక్కెడివారు భీతిమై
నెవని దలంచి లోకతతి యెల్ల భయంబున గుందుచుండునో
యెవ డసురాధినేత యతడే యిట బల్కెడివాడు సుందరీ!

రావణుడను, లంకాపురి
భూవరుడను దపము కల్మి బొందినవాడన్
నీ వహ కాంతామణివిన్
నా వలపున కర్హమైన నాకీమణివిన్. 115

చెలియలి కట్ట దూరమగు సింధువునం దొక లంక యుండె, నె
చ్చెలి యట గొండపై గలదు శ్రీకర సుందర పట్టణంబు నీ
వల నగరంబునన్ రహి విహారము సల్పుము పూలతోటలన్
పలవుల గొల్పు నా సుమ సువాసనలం జరియింపు సుందరీ! 116

కాంచన వర్ణ దేహమును గాంచగ నోచితి, బట్టుచీరనే
యంచిత రీతి దాల్చితి వహా! యమలత్వమును చాటు విన్ననన్
వంచపు వాంఛలింక, నిజ భామల మీదను పీడితిన్ రతిన్
గాంచెద దృష్టి విన్గలసి కాంతిమయూ! సతతంబు సుందరీ! 117

సుందర మోహనాకృతుల సొంపుల కుప్పల దెచ్చియుంచి నా
నెందఱనో, రహిం గొదువ యేమియు లేదు, పరాంగనాళి, వా
రందఱకున్ మనోహరివి రాణివి దేవివి పూజ్య వౌచు మ
న్మందిర మందు నుండదగు మాన్యవు నీవు త్రిలోక సుందరీ! 118

అందము చంద మెంచ వనియా, తగుచోటు వసింప నీకు, గన్
విందుగ ధర్మహర్మ్యముల ప్రేమ వసింపవె యగ్రభార్యవై
యిందుముఖీ! వినుం గనుటయేసరి, నాదగు దారలన్న నే
మందు నభీప్సితం బుడిగె నందఱ మిన్నవు నీవు సుందరీ! 119

నాకు భార్యవైన నలినాయతాక్షిరో
స్వర్ణదూషణయుత క్షామ లరయ
నయిదువేలమంది యలవరతంబును
విన్న గొల్వగలరు వియతికోర. 120

అను నారావణుమాటలన్ వినుచు లోకాతీత సీతమ్మ ప
ల్కును లంకాపతి నీసడించుచు మహాకోపంబునన్ రావణా.
వినుమీ విత్యమనువ్రతన్ బతికి నా ప్రేమానుసంధాతకున్,
గనవో భీతివి వీరరాము సతివిం గామింపగా దుర్మతీ! 121

రాముడు పూర్ణిమ శశివలె మోముంగలవాడు దయకు బూర్ణుడు రక్షో
ద్దాముడు గుణసంపన్నుడు రాముడు, తదనువ్రతనుర రావణ వినుమీ. 122

కదలవ నేరికిం దరముగావి గిరీంద్రమువంటివాడహో
విదితయశుండు నాపతి గభీర సముద్రము బోలువాడు, నా
హృదయముగొన్న రామ ధరణీశ్వరు దారయ సత్యవర్ధనుం
దెదురుగ నిల్వనేరవు సుమీ! నరసింహుడతండు దుర్మతీ. 123

సూర్యమండలి స్పృశియింప జూచుటయగు
నన్నుబొందగ నెంచు నీ పన్నుగడలు
నీవు నక్కవు సింహిన నేను గనుము
లెక్క గొనవొ వ్యత్యాసంబు రక్కవుండ. 124

చావు దరిజేరువానిగా స్వప్నమందు
గాంచె దీవింక కనకవృక్షముల నెన్నొ

రాఘవుని భార్యనగు నన్ను రాక్షసుండ
కోరుచున్నావు దుర్బుద్ధి మీర విటులు. 125

ఆకలిగొన్న సర్పమును నా మృగరాజును డాసి కోరలం
పేకగఁజూచు రీతిగనె భీతిల కుండగ నన్ను బొందగా
నీ కభిలాష పుట్టె, మరణింతువు సుమ్మిక, పావకుండువే?
యీ కరణిన్ విషంబుగొని యిచ్చటనే మఱి యిల్లు సేరుదే. 126

సీతయును రాఘవుండును జేరి యొకరి
కొకరు లేకుండ నొంటిగ నుండబోరు
పాము, సింగంబు గోరల బాయవెపుడు
నాత్మరక్షణార్థమ్మె యో యసుర వినుము 127

హరి రక్షితమౌ మందర
గిరి రాజంబు నఱచేత క్రీడగ గొనగా
దొరకొంటివి చెడుగాలం
బరయం గంటివి విడుపుము భ్రాంతివి మూఢా. 128

సూదితో గన్ను దుడిచెడి చొప్పెయగును
నాలుగకను జాచి కత్తివి నాకుటయగు
రాఘవుని ప్రేయసిన బొందు రాగమెంచ
నాశనకరంబె యిది రావణా! వినుమ్మ. 129

ఱాయి మెడ గట్టికొని సముద్రంబు దాట
నెంచెదో, సూర్యచంద్రుల నేకముగను
జేతులం బట్ట గోరుదో! చెడకు మీవు
రాఘవుని ప్రేయసిని బొందు రాగమూని. 130

ప్రజ్వలించెడు నగ్నివస్త్రంబునందు
మూటగా గట్టికొనిపోవు మూర్ఖుడ వొకొ!
రాఘవుని ప్రేయసిని బతివ్రతను నన్ను
బొందగోరుట నాశన మొందుకొఱకె. 131

ఉక్కుచుమ్మెన వాలున కెక్కినడవ
నుద్యమించుట యగును నీ యుద్యమమ్ము

రాముభార్యను గడు ప్రియురాలి గొనెడి
తలపు విడు మింక రావణా! తగదు నీకు. 132

నక్కయు సింగంబు నొక్కటి యగునొక్కొ
యంతరం బెంచుమీ యసుర నీవు
బడుగుచెలమ మహావననిధి తుల్యమా
యంతరం బెంచుమీ యసుర నీవు
కడుగు నీళ్లను సుధ కమనింప సరియౌనె
యంతరం బెంచుమీ యసుర నీవు
సీసంబు స్వర్ణంబు చెంతనిల్వగ నౌనె
యంతరం బెంచుమీ యసురనీవు
బురదయు జందనంబును సమానం బౌనె
యంతరం బెంచుమీ యసుర నీవు
కాకంబునకు నల గరుడపక్షికి జోడె
యంతరం బెంచుమీ యసుర నీవు
గ్రద్దకు హంసకు గల వాసి సమమౌనె
యంతరం బెంచుమీ యసుర నీవు

ఇట్టి మహదంతరంబది యెంతకలదొ
నీకు రాఘవునకు మధ్య నీవగనుము
రాఘవుని భార్య గొననుంట రావణుండ
నీకునీవ నశింపగా నిశ్చయంబొ. 133

రామ ధనుర్ధరుండు గన, రావణ, నన్ హరియించినన్ నరే
యే మనుకొంటివో వినుము-ఈగయె వజ్రపుసుక్క మ్రింగుచో
నేమగు? జీర్ణమౌనె? యటులేనును జిక్కను నీకు, దథ్యమౌ
నీ మరణమ్మె, నమ్ముమిది, నెమ్మని జెప్పుచునుంటి దుర్మతీ! 134

అటుల ధైర్యాన సీతమ్మ యసురునకని
యాత దేమి సేయునొ యని యటమట బడు
నంత భయకంపితాంగియౌ నబలగాంచి
దైత్యు డనగడంగె నిజప్రతాప మల్ల. 135

ఆడుది తిరస్కరింపగా నసురనేత
పది తలలవాడు కోపించి పరుగువాడు
మృత్యుదేవత కుద్దియా మేటివాడు
సీత మఱియింత భయమొంద జెప్పసాగె. 136

వినుమీ! నే దశకతుడన్ గెలిచితిన్ వీరాధివీరుండనై
ధనదున్ జ్యేష్ఠుని మాఱుతల్లిసుతు యుద్ధంబందు లంకాపురిం
గొని యవ్వాని విమానముంగొనియు నాకున్ వానికిన్ స్పర్థమై
మను గైలాస గిరీంద్రమందతడ హోమాన్యా! మహాసుందరీ! 137

అతడేగాదు సురలెవ్వరైన మఱియు
సర్పపక్షి పిశాచాది సకలజీవ
రాశియును నాభయంబున రాత్రిబవలు
పారుచుండరె నెలవుల బాసి యెపుడు. 138

కోపమూనిన యెడ గడు గోమలాంగి
చూడనోపదు నామోము సురవిభుండు
వీచు ననుకూలముగ గాలి, వేడివేల్పు
చల్లబడు నేను దిరుగాడు నెల్లకడల. 139

నే చరించెడి తావుల నీరజాక్షి
వృక్షముల యాకు లల్లాడ వెఱచునెపుడు
నదులు ప్రవహింపనేరవు నా భయాన
శబ్దమును వీడి బ్రదుకు బ్రశాంత వృత్తి. 140

అమరావతిని మించి యలరారు లంక
సుమపల్లవోద్యాన శోభాయుతంబు 141

ప్రాకార సంవృతప్రభల దీపించు
నాకంబు నంటుచు నా సౌధ వితతి 142

బంగారుమేడలే వరలుచు నుండ
శృంగారమయ దృశ్యమే చూతువందు 143

వైడూర్య మణిమయ వైభవంబొంది
గోడలు ద్వారాలు గొప్పగానుండు 144

అతుల రథాశ్వగజాన్వితంబగుచు
సతము ఫలంబులసా కెదులంక. 145

అట, నాతో విహరింపగా దగును సీతా; దివ్యసౌందర్యసం
ఘటితోద్యానవనంబులందు, మనుజాకారంబులన్ సంస్మరిం
పఁట నీకుం దగ దింక, దివ్యగుణ విస్ఫూర్తిన్ సుఖంబొందుమీ
యిటు లేలా మనుజుండు రాముని సతం బెంచన్ మనోహారిణీ! 146

ధీరుడె రాఘవుండు కడు దీనుడు రాజ్యము వీడి కానకుం
జేరెగురుండు చెప్పుటనె జ్యేష్ఠుడనయ్యు విహీనవీర్యుడై
మారెనుగా దవస్థిగ రమావిహీతుండగు వాని గొల్చెదో
సారెకు సారెకాతవిని సంస్తుతి సేసెదవేల సుందరీ! 147

తగునా! దానవనాథుడే తనకుదా, దాసుండగా జేర నిన్
నగుణాత్మన్ బ్రతిమాలుచుండ, దగునే సత్ప్రేమ లాలింపకే
గిగులం బొందగజేయ, మన్మథ శరాధీనున్ ననుం బ్రోవవే
యగునే మించి నిరాకరించుటను, నన్నాత్మీయునిన్ సుందరీ! 148

తొలుత పెడమొగంబును పెట్టి, తొట్రుపాటు
బడరె పిమ్మట యువతులు, భయ మదేల?
రాము డేమి సేయును విన్ను రామ చెపుమ!
యాతడు గతాయు, వైనట్టి యబలుడె సుమ! 149

ఆశ నెదగల్గి యుండియు నబలలగుట
భర్తనో లోకమునొ యెంచి భయము గాంత్రు
కామినులు గూడ జెయిదాటగా బ్రియుండు
వెతల బొందెద రాత్మలో వేయిగతుల. 150

లోకంబు లన్నింటి శోకింపజేయగా
బలవంతుడైన రావణుని నన్ను
దేవతాస్త్రీలకు బ్రాపమౌ గర్భ, మె
వ్వాని పేర్విన్న నవ్వాని నన్ను
బ్రహ్మతేజస్సుతో బఱగుచు సతతంబు
పది శిరంబుల వెల్గువాని నన్ను

గడ్డిపోచను బోలె గైలాస మెత్తిన
బాహుబలుని దొడ్డవాని నన్ను
పోరి కుబేరుని పుష్పకంబును గొన్న
విఖ్యాతవంతుడౌ వీరు నన్ను
వజ్రాయుధుని నింద్రు బందెలో బెట్టిన
పరమశూరుండైన వాని నన్ను
శివదేవు బ్రహ్మను సేవించి మెప్పించి
వరముల బడసినవాని నన్ను
మూడు లోకంబుల నీ దేరు లేకుండ
జయభేరి మ్రోగించు జయుని నన్ను
పొందగా నీవు సందేహ మొందె దేల ?
రాఘవుడౌ ప్రియుం డగువాడు? రాజ్య ముడుగ
మారువేషాన సన్యాసి తిరుగాగ
నడవి మనలెడివాడు, ప్రేమాస్పదుండౌ? 151

నారీ! రాముడు రణమున
గోరునకును నీడు కాడు కోరకు మతవిన్
జేరితి నీ భాగ్యంబున!
గోరెద భజియింప నిన్ను గోమలి! ప్రేమన్. 152

మానవుడైన రాఘవుడు మా పురిలంకకు జేరి గల్గుచో
మానిని కూడగాదగు సుమా యట నాతని, లేనిచో నసుం
బూనుము నీ ప్రసాదమునుబొంద, దపించుచున్న వాడ;న
వ్వానిదలంతె అంగుళికి వాడ, సమానుడు యుద్ధమందునన్. 153

ఏగతి సుఖపడువాడనొ
యా గతినె యనుగ్రహింపు మతివా నిను నే
ఈ, గతి జేరితి గాన
న్నాగతి భజియింపదగువొ; నారీమణిరో. 154

అన విని వైదేహి యతికోప మూని
తనమాట మతిపల్కె దైత్యనాథునకు. 155

ఏమి! కుబేరుతమ్ముడవ? యెంతటి పూజ్యు డతండు లంకకున్
స్వామివి నీవ యయ్యు నిటు పాపముసేత దురాత్మ యేల? నీ
కామము కర్కశుండు విను గాటికి జేర్చుటెకాదు రాక్షస
స్తోమవినాశసంబునకె తోడ్పడు దృష్టియ నీది రావణా! 156

ఇంద్రు భార్యను వెంగిల నెట్లో నీవు
ప్రాణముల నుండ గలవేమొ! రాముభార్య
నపహరించిన బ్రతుకగా నగునె నీకు!
తథ్య మిది నమ్ము రావణా! దైత్యనాథ! 157

అతుల వజ్రాయుధుని ముందె యతని సతిని
మహిత సుందరి శచి నవమానపఱచి
బ్రతికి యుండంగ నగుగాని బ్రతుకవీ, వ
మృతము ద్రావియు నన్నపమాన పఱచి, 158

అను సీత కఠపటి యహితవాక్యంబు
విని రావణుం డంత విఱ్ఱవీగెడివి. 159

హస్తంబు హస్తాన నఱుచుచు జఱచు
విస్తరించుచు మేఘ విభ్రమంబుగను. 160

పలుకాదు మైథిలిపై దృష్టి నిలిపి.
వలపూని తుదిమాట బంకి కంఠుండు. 161

వినవోకొ నా పరాక్రమము వీనుల విందుగ బిచ్చిదానవా?
వనవిధి నంత ద్రావగలవాడ నొకేవరి, మృత్యువున్ రణం
బున వధియింప నోపుదును, భూమిని జేతుల నెత్తి యాకసం
బున నిలుచుండి వట్టగల భూరిబలాఢ్యుడ, నమ్మి సుందరీ. 162

సునిశిత బాణసంతతిని సూర్యుని నడ్డము గొట్టి భూమినిం
దునియలు గాగ జేయగల దోర్బలవంతుడ వ్యర్థజీవిగాన్
విను మిదె కోరినంతట నభీప్సితమున్ నెరవేర్పగా గలా
డను దగు భర్త గాదగు పరాక్రమవంతుడ నమ్మి సుందరీ! 163

అనుచు బ్రాహ్మణరూపంబు నంత విడచి
తన సహజ భీకర తనువు దాల్చి తప్త

ధర్మకుండల ధారియై పడతిని గను
రక్త నేత్రద్వయుండైన రావణుండు. 164

ఎట్టి బట్టలవాడు నెట్టిని కమల
నెట్టిని కిరణాల విను దనవాడు. 165

మూడు లోకాల విఖ్యాతమూర్తి భర్త
గోరుదువయేని నా కొల్వు గూడు మింక
నీకు దగు భర్త నావార నేనె సుమ్మి
యాశ్రయింపగ దగువార వతివ నేను. 166

దేవి సాన్నిధ్యమంచు బ్రతిష్ఠ కోవగ
మారువేషంబు విరమించి మాయ మాని
స్వీయ రాక్షసరూపంబు స్వీకరింప
నాగ్రహం బొందె ననసొప్పు నసురుని గతి. 167

చేయ నెప్పుడు నపకృతి నీక నీకు
చాల కాలంబునకు విట్టి శ్లాఘ్యతముడు
నర్హుడగు భర్త తనకుదా నాశ్రయించె
గాన భజియింప దగువార కమలనేత్ర! 168

ఏమని రామునే తలతు పీగతి జానకి! యేమి చూచి! వా
షేమి జటాజినంబులకు వేలికయే గద! వన్యవాసిగా!
రాముని మానవున్ విడిచి రాగదె, యాయువు దీరువాడు నా
సోమరియా, ప్రియుండు? ననుసోకుల జెని భజింప ుందరీ. 169

రావణుఁడు సీతను హరించుట

అని తటాలున మూకి యా సీత బట్టి
తన రథంబున బెట్టె దానవరాజు.
ఎడమచేతిన జుట్టు కుడిచేత దొడల
దడయక పట్టుచు దవ్వి పైకెత్తి 171

వడి బెట్టి రథముపై బయనంబు సేసె
బడియగ వనము రాక్షసరాజు గాంచి. 172

బలము గలవాడు మనుజుల భక్షణమ్ము
సేయువాడును నయ్యు నా సీత నబల
నొంటరిగ నున్న గూడ దా బంటుతనము
జూపి చెఱపందు భుజియింప జూడ డతడు. 173

కామమోహితుడయు ను గాంత సీత
గౌగిలివి జేర్చి ము ద గదలుకొనడు
ఒడలు సర్వంబు కుట కుదక్షమింప
దసురపతి, సీతమెయి నుంచె నరదమందు. 174

బుధుడు రోహిణి బట్టు విధము దోపంగ
బెదరక సీతను బ్రేమమ్మై పట్టె 175

మేడ క్రింద జెయి బెట్ట గడగ దాతండు
ముడిచిన కాళ్ళనే వడి బట్టినాడు. 176

ఆ భయదంపు రూ పపవిజ, కనుచు
నాభీలమై మూర్ఛ నందెదు నంత. 177

మృత్యుదేవతబోలు నా దైత్యు గాంచి
పరుపు లెత్తిరి వన్యదేవతలు భీతి
మాయచే వింతదనుకను మాటువడిన
గాడిదలు లాగు రథమంత గానుపించె. 178

రథము పారెడి గగన మార్గాన దాన
పొరలి పొరలి యేడ్చెడి సీత పొక్కిపొక్కి
పాతకుండగు రావణు పాలబడితి
ననుచు మనమందు రఘురాము మనన మూని.

అఱవసాగెను లక్ష్మణు నంత దలచి
మత్తిలిన దానివలె నంత మైమఱచుచు
భ్రాంతచిత్తగ ఘోషిల్లు బరమసాధ్వి
దుష్టుడగు వానితో జను కష్టగతికి. 180

## సీతావిలాపము

శ్రీరామానుజ? నీ పెఱుంగవు గదా, చేకూరె జేడ్పాటు నన్
గ్రూరుండౌ యసురుంచు పట్టి బలిమిం గొంపోవుచున్నా డిదే

హా రామా! ధనమాన సౌఖ్యతతి ధర్మార్థంబు బోనాడు క
ర్మారాధ్యా! కనవైతి దొంగయగు దైత్యాధీశు శిక్షింపగన్ 181

సర్వ సద్గుణ సామ్రాజ్య సార్వభౌమ!
దుష్టసంహార సద్వ్రత! దోర్బలుండ!
ధర్మరక్షణ పరతంత్ర! ధర్మవీర!
నన్నపహరించు నీ దైత్యు నెన్ను గనవొ. 182

అసురపతి నన్ను హరియించి యరుగుచుంట
చెప్పరే రామునకు సతి శీఘ్రగతిని
వేడుకొనుచున్న దీ సీత విరులనొప్పు
కర్ణికార తరువులార! కరుణతోడ. 183

బహుళ శిఖరాల బుష్పాల బరిఢవిల్లు
ప్రస్రవణ గిరిరాజమా! వందనంబు
లసురపతి సీతను హరించి యరుగుచుంట
చెప్పవే రామమూర్తికి శీఘ్రముగను. 184

హంస కారండవంబుల నలరుచున్న
ప్రథిత గోదావరీనదీ వందనంబు
లసురపతి సీతను హరించి యరుగుచుంట
చెప్పవే రాఘవున కీవు శీఘ్రముగను. 185

తరువులిడు జంతుతతులార! పక్షులార!
యీ వనీవాసులైన మీ, కెల్ల శరణు
రావణుడు సీతను హరించి పోవుచుంట
చెప్పరే నాదు ప్రియునకు శీఘ్రముగను 186

ప్రేయసియు ప్రాణమున కన్న ప్రియము నైన
భార్య సీతమ్మ హరియింపబడిన వార్త,
రామునకు జెప్పుచో మీరు రామవిభుడు
నన్ను గొనితెచ్చు నెచ్చోట నున్న గాని 187

స్వర్గ యమ లోకముల నెందు బఱగుచున్న
జాడ తెలిసిన రావణు వీడబోడు

రామచంద్రుడు ధర్మ పరాయణుండు
దీర్ఘబాహుండు వీరుండు దీరవరుండు 188

అంచు గొంతెత్తి బిట్టుగా నఱచు చుండి
వృక్షగతుడౌ జటాయువున్ వీక్ష సేసి
భయము దుఃఖంబు చెనగొన బలుకసాగె
వినినమాత్రాన దాపంబు వెల్లివిరియ. 189

జటాయువు

ఆర్య! యో జటాయువ! కను మనద నంచు
నన్నపహరించెడివి దుష్టు డసురవిభుడు
బలయుతుండును సాయుధ బలమువాడు
వృద్ధుడవు నీవు వారింప వీలు గామి. 190

జాగుసేయక రామలక్ష్మణుల కిపుడె
తెలుపు మీ వార్త సర్వంబు దెల్లముగను
నున్న దున్నట్లు వారల యునికి నెఱిగి
యనుచు శోకించు సీతమ్మ నతడు గాంచె. 191

గాఢనిద్రను మునిగిన గ్రద్దఱేడు
చెవిని బడినంత బిట్టుగ సీత యేడ్పు
లేచి చెట్టుపై నుండియే చూచి యామె
నొడలు సడలించుకొని పల్కె దడయ కతడు. 192

విలు విలుమోయి రావణుడ! నీరజనేత్రను రామపత్ని దొం
గిలి చనుచుంటి వోయి, కడు గీ దొదవుం గద నీకు, నాదు మా
టల విన నొప్పు. వృద్ధుడ జటాయు వనే ఖగేంద్రుడన్ మహా
బలుడను ధర్మసత్యముల బాలన జేసినవాడ నేండ్లుగా. 193

ఇది తగునోయి? లోకముల కెల్ల హితుండును లోకనాథుడున్
విదితుడు సర్వలోకముల వీరుడు రాముని ధర్మపత్నినిన్
సదమలమూర్తి సీతను నిశాచర! రావణ! దొంగిలింతువే?
హృది దలపోయు మీవ, తగునే యిది నీ దగు రాచపోకడా? 194

రాజు పెయ్యును బలము గలాడ వయ్యు
నొరుల దారల దాకుట యుచిత మొక్కొ

యందు నృపదారరక్షణ మతుల ధర్మ
మనుచు నెఱుంగవె దైత్యకులాధినాథ! 195

పరదారన్ హరియించునీచపు మతిన్ వర్జింపుమీ రావణా! 224
పరులే దుష్కృతి సేయగా మన హృదిన్ బాటించు ఖేదింతుమో
పరికింపం దలపోయ నిట్టి పనికిన్ బ్రాల్మాలునే ప్రాజ్ఞుడౌ
ధరణీశుండగు వాడు, నీడు మిక, సీతన్ రామపత్నిన్ సతిన్. 196

ఎట్టుల బట్టెనోయి సిరి యింతటి దుష్టుడవైన నిన్ను? వి
ప్పట్టున నిల్వదింక, మది బట్టిన మోహవిలోలబుద్ధి బో
గొట్టుట సాధ్యమే కరుడుగొన్న స్వభావము మార్పు జెందునే
గిట్టును నీదు సర్వమిక గీడ్పడకుండవు నీవు రావణా! 197

ఎప్పుడ యేని నీకు నసురేశ్వర! రాముడు కీడు సేసెనే
చెప్పుడు; వాని భార్య గొని నీ! యపరాధము నిట్లు సేయగా
నొప్పునె చంపె వాడు ఖరు నుద్ధతిమై నని సాకు జెప్పెదో
యొప్పె సుమా! వధింప కెటులుండును వానిని దాకశాత్రవున్. 198

నిప్పులు గ్రక్కు రాఘవుని నేత్రములం బడి మండకుండ, నీ
యొప్పుల కుప్ప సీత నిట నుంచుము వేగమ! యేమి లాభమౌ
నిప్పుడు ద్రాచుపాము నొడినే బిగగట్టి రయానబోదువే
కప్పగ నిన్ను బట్టునది కాలము తీరెను నీకు రావణా! 199

అరువది వేల యేండ్లు జన కార్జిత రాజ్యము నేలినాడ, నే
డరిగె వయస్సు, వృద్ధుడ, నిరాయుధుడన్, బలదర్పశేముషిన్
పరలుచు నింటి బాణముల బట్టి రథంబున నుంటి వీవు, నే
నరయగ నిన్ను బోరగలనా? యయినన్ విడ నిన్ను దైత్యుడా 200

శూరుడ వీవయైన జన జూడకు నిల్వుము యుద్ధమూనుమీ,
వీరుడు రామభద్రుడిక వే చనుదెంచెడివాడు వానితో
బోరుము పోరుచో ఖరుడు పోయిన మార్గమునందె పోవవో!
వారల రామలక్ష్మణుల బారికి జిక్కగ బారిపోదునే? 201

ఏను జీవించియుండగా నిట దురాత్మ! పారిపోవగలాడవే? పద్మముఖిని
రాము భార్యమగొని నీవు రావణుండ! ప్రాణముల నొడ్డువాడ నా రాము కొఱకు

దశరథున కేను మిత్రుఁడ దాశరథికి
ప్రియతముండను బొంకెమను వీడి పడెడి
ఫలము పగిది తేరున నుండి పడగ ద్రోతు
నిన్నిదే క్రూర రావణ! నిముస మందె. 203

అను పక్షివాక్యాల నాలింపబోడు
కను వెఱ్ఱి జేయుచు గాంచి యా గ్రద్ద 204

ఇరువది కన్నుల నెగయగ నిప్పు
కరమెత్తి యనికి హుంకారంబు సలిపె. 205

తన్ను ఢీ కొన్న యా దైత్యాధిపతికి
వెన్నియ దా పక్షి వెనుకంజ విడదు. 206

ఇరువురు వీరులు పోరిరి యుద్ధముచు గగనంబు నందు నొండొరులు గడున్
బిరబిర దాకెడు మొయిలుల తెరవును జూపుచు దమతమ తెంపున్ లావున్.

గోళ్ళు ముక్కున ఱెక్కలు గొప్పయాయు
ధంబులుగ బక్షి భయద యుద్ధంబు సలిపె
ధనువు బాణంబులను బూని దైత్యవిభుడు
పోరె నిజబల దర్పంపు దీరు జూపి.

ఎగిరి పైబడి గోళ్ళ నెంతయో రక్తంబు మెయిగార దైత్యుని మేను జీరె
దుమికి గుభేలున దుష్టదైత్యుని విల్లు గాళ్ళచే దన్ని ముక్కలుగ జేసె
వ్రాలి తటాలున బక్షంబులను విప్పి కవచంబు బ్రద్దలు గాగ గొట్టె
ముక్కుతో మొగమెల్ల బొడిచి గాడిదలను రథమును ద్రుంచి సారథిని దునిమె

ఛత్రచామర ముఖ్య లాంఛనము లెల్ల
రూపఱగ జేసి దైత్యుని యేపు మాపె
గృధ్రరాజంబు రావణు గీటడంచి
పారిపోనీక నిలువగా దేరిపైన

రథము ధనువును గూలె సారథియు జచ్చె
నంకమున సీత నిడుకొని యసురవిభుడు
నేలమీదకు దుముకుచు నిలచినంత
భూతతతి యెల్ల సంతోషమున మునింగె. 210

ముసలివాడు జటాయువు విసిగి యలసి
యుండుటను గాంచి రావణుం డురికి దివిని
దాఁటసాగెను సీతతో భ్రమదగతిని
నటవి గని పక్షి వెనువెంట నడ్డుతగిలె. 211

రావణ! నాశ మొందెదవురా! వినరా, విడరా, ధరాసుతన్
ద్రావగ జూతువే విషము రామునిభార్య హరించి నీ వికం
జావక యుండుదే యతని సాయక తీవ్రహతిన్ వినాశమై
పోవదె నీదువంశము సమూలముగా గనువిప్పి చూడరా! 212

కాలపాశంబునకు జిక్కి కర్మవశత
జావనున్నావు మూఢుడు చావు రాగ
మంచిచెడ్డల గమనించి మసలలేడు
మత్స్య మది గాలమును మ్రింగి మడయురీతి. 213

ఈవిధి ఖగేంద్రు డెంత సెప్పినను
రావణుండొల్లక రామతో గూడ. 214

పరు విడుచుండగా బక్షిరాజంబు
సురవైరి వీపుపై బిరబిర వ్రాలి. 215

తలవెంద్రుకల బీకి దైత్యుని వీపు
బలిమిమై గీరుచు బాధింపగడగె. 216

ఎడమవైపున సీతను బుడమి దిగిచి
రావణుడు కుడిచేత గృధ్రంబు జబచి
గట్టిగా బట్టి ఖడ్గాన గాళ్లు నఱకి
పక్షముల గోసె పుడమిపై బక్షి పడగ. 217

రక్తసిక్త పక్షి రామకార్యార్థిని
ప్రాణములను బాయువాని జేరి
కౌగిలించి యేడ్చు గరుణాత్మ సీతమ్మ
దిక్కులేనిదాని తీరుగాగ. 218

నేత్రముల స్పందనము పక్షినిస్వనమ్ము
దెల్పు సుఖదుఃఖముల్ల ముందె తేటగాగ

మనుజులకు రామ! నీ పసమానగతిని
నట్టి లక్షణంబుల గాంచవయ్య నేడు. 219

భక్తభక్త! సీత పరమదుఃఖిత యయ్యె
దనకు తోడ్పడ నని దైత్యు బోరి
పరమ పదము సేరు పక్షీంద్రు గనుచుండి
రామ! లక్ష్మణ! యని భూమి బడుచు. 220

లతలను బట్టి కౌగిటను రామపదింబదియేడ్చు జెట్లకున్
వెత వెలిబుచ్చుచుం బరితపించును గౌగిట జేర్చి వాని సం
తత రఘురామచింతనమునం బడి 'హా రఘురామ రామ' నా
గతి గనజాలవా యనుచు గట్టిగ బిట్టుగ సీత యేడ్చెడిన్ 221

పక్షిపై నంత బడి యేడ్చు బద్మనయన
సిగను బట్టుచు లాగుచు జంక జేర్చి
యెగసి యిలనుండి సీతతో నేగు దైత్యు
నడ్డుకొను వార లెవ్వార లచట లేరు. 222

రామా? బ్రోవగ రమ్ము, లక్ష్మణు డనన్ రక్షింపుమా? వేగమే,
నా మాటల్ మరపొందుమీ, విశితబాణంబుల్ వలెన్ గ్రుచ్చె వి
న్నే మేమో యని యుంటి నాఫలము, నేడే పొందుచుంటింగదా!
యీ మూర్ఖుండగు దొంగ బారి బడి తే నేమందు రామానుజా!

అనుచు ఘోషించు జానకి నంత గాంచి
జుట్టుబట్టి యీడ్వబడిన సుదతి దలచి
లోకతతి యెల్ల విలపింగె లోక మెల్ల
చీకటులు గ్రమ్మె పవలె యా సీతగతికి. 224

మున్ను రావణు వధియించు తెన్ను గనగ
నాదినారాయణుడు భూమి నవతరింప
వరము గైకొన్న బ్రహ్మ రావణునిగతిని
గాంచె మోదంబు, గాగల కార్య మెంచి. 225

సీత యవమాన మొందుట జింత బొంది
దాన రావణనాశమ్ము తథ్యమంచు

సంతసించిరి దండక సకలమునులు
సురలు తమకార్యసిద్ధిని జూచినారు. 226

నాస్తి ధర్మంబు సత్యంబు నాస్తి నాస్తి
సౌమ్యబుజువర్తనంబులు సకలవిదుడు
రామచంద్రునిభార్యనే రాక్షసనృపు
డపహరించె నటంచు భూతాళి యేడ్చె. 227

మేఘమున నుండి మెఱసెడి మెఱపునోలె
సీత రావణాంకంబున జెలగుచుండె
పవలు వెలుగొందు చంద్రునిభాతి సీత
వదనమండల మెల్లయు వాడిపోయె. 228

కరుణ పుట్టించు సీతదుఃఖమ్ము వినగ
రోషము జనించు విన సీత రోదనమ్ము
వినుచు బసిలేళ్లు దలలెత్తి వినతి నలిపి
కంట దడిదెట్టుచున్నవి కానదారి. 229

చంక జానకి బెట్టి చనుచుండె మింట
గొంకుబింకును లేక కుటిలదైత్యుండు. 230

దక్షిణ దిశనుండి దాటగా జలధి
రాక్షసాధిపు డతి రయముతో నేగు 231

దండకావని వృక్షతతులపై నుండి
కొండలపైనుండి కొండలో బోవు. 232

శోకించుచున్ సీత చూచెడి భూమి
లోకనాథుడు రాము రాకకై యేమొ. 233

పంచవటిసమీపముననె పక్షిపోరె
గాని తద్ఘోష సీతశోకంబునేవి
వినగజాలడు రాముడు విపినసీమ
నుత్తరంబున దూరాన నుంటవలన. 234

పంచవటికి నుత్తరమున వరలువారు
నుత్తరాదిని భూమిపై నున్న వారు

గగనమార్గాన గుడివైపు కానదాటు
కాంతశోకంబు నెటు వినగల్గువారు. 235

రామలక్ష్మణు లేరును రామి గనమి
రాక్షసునియంకమున గుందు రాముపత్ని
యత్యశాంతిని నొడలెల్ల యలసట గని
మొగము వాల్చుచు దీనయై భూమి గనును. 236

మాయలమారి! స్వర్ణమృగమాయనుగూర్చి భ్రమింపజేసి వే
బాయగ జేసినావు రఘువర్యుని నన్నును సిగ్గులేదే? గొం
పోయెదవేల దొంగవలె, పోర జటాయువు జంపితే ఖలా!
న్యాయవివేకమూర్తియయి నాకొఱ కడ్డము రాగ దుర్మతీ! 237

ఎంత పరాక్రమంబహా! సరే! నిను స్తుతించుకొంచు గా
నంతయు లజ్జ లేక యిటు లాడుది యొంటరిపాటుజేసి సా
మంతుడ నంచు శౌర్యమున మానినినిం గొని పారుచుంటివే
యింతయు పౌరుషంబె? భయ మేల? పలాయన మేల? రావణా!

పురుషులు మున్ను మున్ను నిను బోడిమిలేని నిశాచరుండుగా
దురితునిగాగ దుష్టునిగ దౌర్బలహీనునిగా దలంపరే?
పరసతి నిట్లు భర్త దరిబాయ గ్రహించి భయాస్పదుండవై
కరమున బట్టి పోవుట యకార్యముగా జననింద పొందవే. 239

ఈవు నుతించుకొన్న బల మింక నశించెడుగాక, శౌర్యమున్
బోవునుగాక, నీచరితము గులనాశన! నిందపాలుగా
జీవము పీడ నుంటి విటు చెచ్చెర బోవక కొంతసేపిటన్
ద్రోవను నిల్చితేని దృటిలో మరణింపక యుండ జాలుదే! 240

ఒక ముహూర్తముగూడ నీ వుండ విలను
రామలక్ష్మణు లెదురైన రావణుండ!
ప్రజ్వలించెడి దావాగ్ని బక్షివోలె
నోప నోవుదె వారల తూపుదెబ్బ. 241

చెప్పెద నీహితంబు, మది జేర్చుము రావణ! యొక్కమాట, నీ
విప్పుడయేని న వ్విదుప నెంచుము రామున కప్పగింపు మ

ట్లొప్పవొ, దొంగవాని భువి నుంచరు రాముడు లక్ష్మణుండు నే
చొప్పున నైన నీ వ్వేదకి చ్రుక్కఁగజేతురు సుమ్ము నమ్ముమా 242

నన్ను బలవంతముగ బట్టియున్న నీదు
యత్నమంతయు విఫలమౌ నసుర! దుష్ట!
భర్త నారాము జూడక బ్రతుకగలనె
యేను చిరకాల మిల నుండ నెంచ సుమ్ము. 243

హితము చెవి కెక్కనొక్క లయించువేళ
బుట్టు విపరీతబుద్ధులు గిట్టువేళ
నీ హితంబును శ్రేయంబు నీ వెఱుంగ
నౌర! కాలపాశము మెడ నదిమి పట్టె. 244

దయ యను మాట లేక గుణధాముఁడకున్ రఘురామమూర్తికిన్
రయమున జేయుచుంటి వపరాధ మతండు, మహాత్ముఁడా, యమా
లయమున కీవు చేరెదవురా, విషముం గొనువానివోలె, ని
ర్భయముగ నుంటివా? భయకరంబగు కాలగతిన్ దురాత్ముఁడా! 245

వైతరణీ మహారుధిర వాహినినిన్ యమలోకమందునం
భీతిగ జూతు వింక, రణవీరుడు సర్వమహాస్త్రశస్త్ర వి
ద్యాతిశయుండు రాముఁడు ఖరాదుల నొక్కఁడె చంపినట్టి వి
ఖ్యాతుడు స్వీయపత్ని యపహర్తను నిన్ వధియింపకుండునే 246

సంతప్త హేమపుష్పావళీమయమైన
　　బూరుగుచెట్టునే పొందగలవు
బాగుగా గాలిన వైడూర్యపత్రాల
　　బూరుగుచెట్టునే పొందగలవు
నిశితంబు లుక్కుతునియల ముండ్లు గలట్టి
　　బూరుగుచెట్టునే పొందగలవు
అసిపత్ర శాల్మలి యటవిలో బడి క్రూర
　　బుద్ధికి ఫలితంబు వొందగలవు.

నతిభయంకర నవకంబునందు నీకు
యమునికడ గుందుగతియు, లభ్యంబుగాదె
పరులదారల హరియించు పాతకుండ!
నరకబాధలు తప్పునే పరమమూర్ఖ. 247

దైత్యు నంకమందు దనువెల్ల వణకుచు
గరుణ పుట్టురీతి బరుషములను
బలుకు సీతహితము బాటింప దసురుండు
ముదపుత్తోడ జనెడి సుదతి బట్టి. 248

చనెడి దారియందు సంరక్షకు డొకండు
గానరామి గుంద గొంత యొకట
బర్వతాగ్రమందు వానరపంచక
మున్న వారి గాంచి భూరిబలుల. 249

ఉత్తమాభరణంబుల నుత్తరీయ
మందు గట్టి వానరులకు ముందు బడగ
విసరె నా మాట తనఘోష వినినవారు
రామునకు దెల్పగలరని రాఘవుసతి. 250

సీత చేజిక్కెనని యెంచి శీఘ్రగతిని
మోదమున బారిపోవుచు మాట వినరు
చంద మొక యింత గనడు రాక్షసవిభుండు
కామమోహితునకు గండ్లు కానబడునె? 251

రామ రామా యను రమణి యారవము
వ్యోమమార్గమున గపులు వినినారు. 252

కనుఱెప్ప వేయక వనచరుల్ గనిరి
పెనగొను వార్తితో వెడలు జానకిని. 253

లంకాభిముఖుడైన రావణుం డంత
బింకాన జంకలో బిగబట్టి సీత. 254

వనగిరి నదములపైనుండి పారి
చని పంప కావల జలనిధి దాటె 255

తనచావునకు భువి జనవంబు నొందె
తన మృత్యుదేవత ధాత్రిజ యనుచు. 256

రావణుం డెంచక లంకలో జేరె
దేవతల్ మురిసిరి దివిజారి గనుచు. 257

సీతాపహరణంబుచే రావణుండు
సీతాసతిచే జేడ్పడునందు. 258

## రావణుఁడు సీతతో లంకకు జేరుట

రావణుడు చేరి లంకకు రమణి నంత
తనదు నంతఃపురంబున దాచియుంచె
స్త్రీపురుషు లేరు నాబిడవైపు జూడ
కుండ రాక్షసస్త్రీల గాపుంచె నచట. 259

నా యనుజ్ఞ లేక నారీమణిని సీత
స్త్రీపురుషు లెవరును జేరరాదు
ప్రథితరత్నములను స్వర్ణవస్త్రాదుల
గోరువాని నెల్ల గొదువలేక. 260

రమణి కొసగు డనియె రాక్షసనాథుండు
కాపు గాయు భయదకాయలైన
రాక్షసాంగనలకు రామకు నెపు డప్రి
యంబు జెప్పరా దటంచు నుడివి. 263

## రావణుఁడు-జనస్థానము

అంతిపురంబునం దపవిజ నుంచి
మంతనం బుండె నరాంతకుం డతడు 262

ఎనిమిదిమందిని దుష్టుల
బనిచె జనస్థానమందు వసియించి యటన్
దునుమగ రాముని లక్ష్మణు
ననువుగ నందియ వార్తలట గలవానిన్. 263

కానను దండకన్ మనల గాదనువారలు సేరి యా జన
స్థానముపం గలట్టి మన దైత్యుల నెల్లర జంపినా తహో
దానికి మాఱుసేయక యథావిధి నుండగనౌనె మీర లా
స్థానము జేరి దండకను సాకుడు వైరుల గుర్తెసేఱుంగుచున్ 264

మును ఖరదూషణాదుల ప్రపూర్ణబలాన్విత సైన్యనారముం
బవిచితి నందు నుండుటకు వారల నెల్లర జంపి స్వేచ్ఛగా

మనెడి నరుల్ విపుల్ మనకు మానక వారల జంపుదాకనే
గన నిదురం బ్రశాంతిని బగం గడు గ్రుద్ధుడనైతి నేనిటుల్. 265

మీర లెనమండుగురు రణవీరు లరయ
మున్ను పలుమార్లు మీ శౌర్యమును గణించి
పంపుచున్నాడ రాముని వధకు మిమ్ము
యత్న మొనరింపదగును గార్యము ఫలింప. 266

రావణు నాజ్ఞను వారలు
వోప జనస్థానవాసముం గన సీతా
దేవి తనకు జిక్కనయటు
భావించుచు దైత్యవిభుడు ప్రమదము గాంచున్. 267

రావణుఁడు సీతకు స్వీయవిలాసము జూపుట

బుద్ధి వెకల్యంబు బొంది రావణుడు
ముద్దియ గన నంతిపురమున కేగి. 268

కనె దీనావన నశ్రుపూర్ణముఖి శోకాక్రాంతమూర్తిన్ మహా
వనధిం గొప్ప తుపానులో మునుగు నావంబోలుచున్ లేళ్ల గుం
పున దూరంబయి లేడిపిల్ల ఘనక వ్యూహంబునందున్న మా
డ్కిని రామున్ విడి రాక్షసాంగనల బారిం గుందు నా జానకిన్ 269

రాను రానని చెప్పెడి జానకినుడి
కాదు కాదని రావణకంటకుండు
కడు బలాత్కారమున జూపె కాంత కపుడు
స్వీయ చిద్విలాసపుమేడ సిరియు గొప్ప. 270

స్వర్ణ నవరత్న ఖచిత మా సౌధమెల్ల
వివిధ మృగపక్షియుతముగా వెలయుదాని
లలిత సౌందర్యవతులు వేలాదిగాగ
నైహికానందమున నున్న యతుల వసతి. 271

సౌధసోపానపంక్తి నపదృశగరిమ
వెండిదంతాల కిటికీల వెలయు సొగసు
రకరకంబుల వృక్షాల రమ్యతయును
దైత్యనాథుండు చూపె భూతనయ కపుడు. 272

వేలకొలది రాక్షసుల వీడిది యెల్లరు సౌఖ్యజీవులై
కాలము బుచ్చుచుండి రిట గాంతరొ! నీ విక సౌకశ్యమూర్తివై
యేలుము నాదు సర్వమిట నీవె శరణ్యము నీ యధీనుడన్
పాలనసేయు మింక నను భార్యగ, ప్రాణముకన్న మిన్నవై 273

నా యీ యంతిపురంబున
ధ్యేయగ నీవౌచు సుందరేశ్వరి వగుచున్
నా యీ స్త్రీలకు సతులకు;
గాయవె భజియించి ప్రేమ గాంచుచు నన్నున్. 274

నీదు ప్రేమప్రసాదంబు నెమ్మినిమ్ము నర్హుడను నేనె గానొకొ యతులరీతి
జేయి జూచు నీదాసు వర్జింపనగునెయుభయులకు సేమ మదియకా నుర్వితనయ

తలపకు మన్యథా వినుము ధాత్రిజ! మంచిని చెప్పుచుంటి నీ
వలపున కీడుజోడయిన పార్థివపుంగవుడన్ గ్రహింపుమీ
జలనిధి మధ్యలో గల విశాలపురం బిది, దీని జేరగా
గలరె సురాసురాళి జనకాండము నింద్రునితోడ గూడినన్. 276

అనమానుండ సుమా! పరాక్రమమునం దా యక్షగంధర్వులేన్
గసితో నే గనువిప్ప బారుదురుపో కల్యాణి! నీ కెంచ దా
వనవేషుండును రాజ్యహీనుడు గతప్రాభవం డహో భర్త! యా
వ్యసనంబున్ విడి నన్ భజింపు మిక సీతా నన్ను నీ భర్తగా. 277

రాముని జూడగోర కిక రాగలవాడొకొ నాదు లంకకున్
భామరొ! మూడులోకముల బాహుబలాన్వితు డెవ్వడుండె నా
సీమకు వచ్చిన న్గెలిచి సీత గొనంగల మేటి జోదొకో
రాముని గీమునిం దలపరాదు తలంచిన మేలుగల్గునే. 278

లంకారాజ్యము నెల్ల నిచ్చెద నిశే రాజ్యాభిషేకంబు ని
శ్శంకన్ జేసెద నీకు నేలు మిక, నాశావ్యాప్తమౌ దీప్తితో
జం కేలా సుఖియింపు మ న్గలసి నీసాన్నిధ్యమం దుండు నీ
కైంకర్యం బొనరించు కింకరుడనై కంజాక్షి! యో సుందరీ! 279

పూర్వజన్మాన జేసిన పుణ్యవశత
సుఖము బడవచ్చితీ విడూ సుందరాంగి

వనవివాసంబు కడు బాపఫలము సుమ్మి
యదియు నిక దీరె సుఖియింపు మతివ! యిచట 380

కమలతుల్యంబు మోము శోకంబువలన
గాంతిహీనంబుగా నుండి కాంతి గనుచు
నుత్తమాభరణంబుల నొంది దివ్య
గంధపుష్పమాలికల బ్రకాశ్య వగుము. 281

మహిత పుష్పకనామ విమానమందు సుఖతరంబుగ విహరించుమండవచ్చు
నిర్వరము గూడి; భజియింపు మీవు నన్నువిమల లోకైకసుందరీప్రేమమూర్తి!

అనుచుం బలికెడి రావణు గనకుండగ జీరచెఱగు గప్పుచు వదనం
బున జానకి శోకించెడి గనుగన నశ్రువులు గారి కాల్వలు గట్టన్, 283

పైటచెంగున గప్పి వదనబింబంబు
నీటితో గనుగవ నింపుచు నేడ్చు. 284

ధ్యానపరురాలు పరవశ, దీనవదన, మారువల్కని సీతకు మఱల
మమతతో బల్కు రావణమహిపు డపుడు కర్మసంబంధగతిని లోకంబురీతి.

జన్మజన్మాల ఘటియించు సంచితంబె యిట్టి సంబంధమూలమౌ; నెంచవలదు
ధర్మహానిగ, విద్దాని దలపదగును దైవగలియంచు శాస్త్రవిధానమందు. 286

ఎవరిం బాదము లంటి మ్రొక్కని టు ము, న్నే నీవశుండన్ సుమా
భవబంధమ్మున మన్మథాగ్ని బడు నన్ బాధింతువో! బ్రోచెదో
భవదీయుండను నానమస్తమును నీపాదంబులం దుంచితిన్
స్తవమున్ సల్పెద నీకు బానుడ భవత్పాదంబులన్ మ్రొక్కెదన్. 287

ఎట్టిస్త్రీకిని దలవంచనట్టివాడు
రాక్షసేశుండు రావణరాజు నేడు
మన్మథవశుండు తలస్తోక మహిళపదము
లంటి మ్రొక్కె దాసోహ మటంచు సీత! 288

సీత నిరసన

ఏదియొ చెప్పు రాక్షసుని నింద్రియలోలుని వంక జూడగా
రాదని మోము నెత్తకయె రామునిపత్ని భయంబు వీడి యా

మోదము లేవియట్లు తనసుంగల బెట్టుచు గడ్డిపోచ నీ
మాదిరివాడ వీవనెడి మాడ్కిని బల్కెడి గడ్డిపోచకున్. 289

ధరణి గలండు మున్ దశరథక్షితినాథుడు సత్యసంధుడై
స్థిరు డతిధార్మికుం డతని జ్యేష్ఠకుమారుడు రాఘవుండు నా
బరగెడి రామమూర్తి బలవంతుడు నాప్రియభర్త దైవతం
బరయగ నాకు బూజ్యు డసమానుడు పద్మదళాయతాక్షుడున్. 290

పుట్టె నిక్ష్వాకువంశాన భూరియశుడు
ధార్మికుడు సత్యసంధుండు ధర్మవిదుడు
దీర్ఘబాహుండు సింహసదృశబలుండు
నుండు విను జంపు సహలక్ష్మణుం డతండు 291

ఉందురుగాక రక్కసు లహో పలుగాకులు పెక్కుమంది నీ
చందమువారు విన్గొలువ, సర్పవిషంబు సుపర్ణు జంపునా?
పొందెద వీవు చావు సరుమూలమునన్ సహలక్ష్మణుండుగా
జిందులు ద్రొక్కుచున్ విడువ శ్రీరఘువర్యుడు బాణసంతతిన్ 292

యూపబద్ధంబు పశురీతి నుండ విలను
నాయువును జ్ఞానమును దేజ మరయ మృగ్య
మాయె నీకహ! రాముని మానవతిని
నపహరింపగ బ్రతికెడి యూశ విడుము. 293

చదలనుండి భువికి జంద్రుని బడగొట్టు గలటి నెండగొట్టు క్షణములోన
రాఘవుం డతండు రావణా! నాభర్త విన్ను ద్రుంచి త్రుటిని నన్ను గొనడె
కాలపాశవశత గాలంబు ఓ౫స విన్ను రాఘవుండు నెమ్మిగనడు
నీదుమదము బలము నిముసంబులో దీయు గర్వ ముడుగ నీకు గంటకుండ!
నీదుకతన లంక నీ బుర లెల్లరు మడియరొక్కొ రాఘవుడు దలంప
నపహరింప నన్ను నాయు వుండునె నీకు లంక యింక విధవరాలు గాదె

కమలవని రాజహంసతో గ్రాలు హంసి
చేరునే తృణంబుల నుండు నీరుగాకి
నా తనువు నీవు తాక సంజ్ఞ నశియించె
దినుము మఱి బందె నుంచుము దీని నీవు. 297

బండెను బెట్టగా దలతువా? తనువున్ బశుశక్తి బెట్టుమీ
తిందువా మేనుగోసి తిను దేహము బ్రాణములన్ గణింతునే
బొంది నశించుగా నెపుడొ పోయిన కీర్తియు మాన మెన్నడుం
బొందగలేముగా మఱల, మూర్ఖుడ? నేను బతివ్రతన్ సుమా! 298

తనువుం బ్రాణము నేమి జేసిన సరే తాపత్రయం బొంద, వే
తినినన్ బండెను ద్రోసినన్ బెదర బాతివ్రత్యభంగంబు నొ
ల్లను లోకంబున దూరు బొంద దనువున్ లావణ్యమున్ నిల్చునే.
మనెడున్ గీర్త్యపకీర్తులే యెపు డిలన్ మర్యాద గోల్పోదునే. 299

అనుచు సీతమ్మ పరుషంబు లాడి విసిగి
మాఱుమాటాడ నొల్లక మాట మాన
రావణుడు మేను గగురింప రాముసతికి
బల్కె గడసారిమాటగా బ్రళయగతిని. 300

వినుమీ నా తుదిమాట సీత! కడు నే వేపారితిన్ వేడుచున్
విను, ధిక్కారము సేసి తీవు నను గావిమ్మోసి యేడాదిలో
పున నీకుం గడు ఇచ్చితిం గడువులో బొందంగ నన్ గానిచో
దునకల్ సేతురు వంటవారు తుది సంతుష్టిం దినం బ్రొద్దుటన్. 301

విను సీతా! పదిరెండుమాసములలో క్షమింపవేనిన్ ననుం
దనువుం జెండరె వంటవారు గడు వంతం బందునన్ బ్రొద్దుటం
గనవే నీవ యనుగ్రహంబు, తమ వింకా యేలనే! గ్రద్దలేన్
దినగా నొప్పదె వానికైన ఫల మింతేనిన్ లభించుంగదా! 302

నాయన జేసియే నావంటవాండ్రు
దూయరే కత్తుల దునుమగా నన్ను? 303

కాయంబు నఱకుచు గ్రద్దలు దినగ
వేయరే ముక్కల విసరి దిక్కులకు. 304

నీవు లేక, లేక నీయనుగ్రహమును,
బ్రతుకు టెటుల? నేల బ్రతుకవలయు?
నేలు మీవ నన్ను లీలగా దేవిరో!
కాక చావె నిజము గడువుదీర. 305

సీతయును రావణుండును జేరి యొకట
బ్రతుకజాలర? నీయనుగ్రహము లేమి
నేను జీవింపజాల నిన్నేను జంపి
మూర్ఛురాలవ సుందరీ! మోదముగను. 306

అనుచుం గోపపరీతచిత్తు డయి దుఃఖాక్రాంతుడై జానకీ
వనితన్ గాపుగ నున్న వారి గని దివ్యాశోకవృక్షంబులం
గనుచుం బుష్పలతానికుంజముల నానందంబు నొందంగ వే
గొనుడీ యామెను, మంచిమాట లవి నాకున్ మేలు చేకూర్పుడీ. 307

సీత ప్రేమించి నన్ను భజింప నిచ్చ
బుట్ట జేయుడు భయము గొల్పుచు సతంబు
నెటుల కార్యసాఫల్య మౌనటుల నామె
గనుచు వర్తింపుడి యశోకవనమునందు. 308

అనుచున్ గంతులు వేయుచు
జనగా రావణుడు రాక్షసాంగన లంతన్
జనకజ నశోకవనిలో
మనుదావిగ జేసిరి తమమధ్య సతంబున్. 309

నానాపుష్ప లతావితానములు నానాదృశ్యసందోహముల్
నానావృక్ష నికుంజ పక్షితతు లానందంబు నందించు నే
దీనాత్మన్ విలపించు సీతకు, నిజాత్మేశున్ స్మరించున్ సదా
దేనిం గాంచక యామె రక్కసులు భీతిం గొల్పినన్ ధీరయై. 310

చెట్టుచేమలు పుట్టలు గుట్టలన్ని
సలిపెడి ప్రతిధ్వనుల రామశబ్ద మపుడు
జానకీదేవి శోకాన లీనమయ్యె
శోకవనమయ్యె నెల్ల యశోకవనము. 311

దండకము.

ఓ రామ! యో నాథ! యో భర్త! యో ధర్మసంరక్షకా!
దుష్ట శిక్షాపరా! దీనసంత్రాణధీరా! కృపాస్వామి! సత్యస్వరూపా! దయం
జూపవా! రక్కసుం డిట్లు నీ భార్యనుం దెచ్చి బంధించె నీ భక్త నిన్నీడి
ఘోషింప నాలింపవా? నిత్యకారుణ్యమూర్తీ! నమస్తే నమః. 312

అనుచున్ జానకి రామతారకము నిత్యానందసంధానమున్
మనమందున్ జపియించుచున్ బ్రతుకు 'రాంరామా' యటంచున్; నరా
శననాథుండును వీరరాఘవు భయస్వాంతంబునం జిక్కుటన్
మననంబుం బొనరించు రామగుణనామంబుల్ సదా భీతిమై. 313

సీతాపరివేదనమే భూతంబుల నెల్ల నిండి 'భో' యనుచుండెన్
జేతంబుల రామస్మృతి జాతం బగుచుండె దైత్యజాతికి గూడన్. 314

## ఆశ్వాసాంత పద్యములు

జానకీదేవి వని నుంట సంచితంబె
కష్టమే జన్మ మెత్తిన కారణమున?
నయిన రామయ్య నీవేల యడవి నుంట?
యెటుగ సంచిత మొదవె నీ కిలను జెపుమ? 315

తప్పని యెడ జీవికి సంచితంబు నిన్ను
గొలువనేల నీ కృప గన ఫలితమేమి?
సంచితానుభవంబున జతయె యగును
నిన్ను గొల్చెడి శ్రమయును నీరజాక్ష! 316

రామ? యనన్య భక్తి హృది రాజిలు వారల నోముచుంట నీ
నోము గదోయి. లేడిని వినోదముగా గని పొందుకోర్కెమై
బాముల గాంచె సీతయని పల్కెదా! యన్య పదార్థ రక్తయై
కామము దేహి యందున నొకా నొకపట్టున నేని పుట్టదో? 317

భక్త భక్తుని విను లేడిబట్ట జంపి
భాగవత నింద సల్పెగా పరమ సాధ్వి
యయ్యు; నదాన రక్కసు నాలయమున
నునికి ప్రాప్తించెనని యందు వోయి రామ? 318

ఇది శ్రీ గోవింద రామాయణము రక్షక రామ కావ్యమం దాత్మాశ్వాసము సంపూర్ణము.

# శ్రీ గోవిందరామాయణము - రక్షకరాముడు

## 6. పదమాత్మాశ్వాసము

విన్నున్ వీడిన యాత్మల
తెన్నుం గను దీవు తీర్చిదిద్దగ గృపచే
మన్నింపవె ప్రారబ్ధము
విన్నే స్మరియించునంత నీరజనేత్రా, 1

### రాముని యాశ్రమ ప్రయాణము

రాచకులంబు రాము డపరాజితవీరుడు మాయలేడి మా
రీచుని జంపి యాశ్రమము కివ్వన జేరగబోవు దారిలో
జూచుచు దుర్నిమిత్తములు సుందరిసీతకు గీడు మూడెనా
వేచెడి నామనంబు నటవీస్థలి రాక్షసు లేమి సేసిరో. 2

ఎడమ కన్ను భుజము నదరెడి నఱచెడి
నక్క వెనుక భాగంబున; దిక్కులేక
రాక్షసుల వాతబడినదో రాముపత్ని
జంపి, తినినారొ? దొంగిలి చనిరొ వారు! 3

హాసీత! హాలక్ష్మణా! యన్న కేక
నా సీత విని యంత నా రక్షకొరకు. 4

సౌమిత్రి బంపిన నపుయంబు గాంచి
యామెను మ్రింగిరో హరియించినారొ! 5

మాయలేడి యాచు మారీచు డరుదేగ
నాశ్రమంబు వీడి యరుగ నేను
పరువు లెత్తి యెత్తి బహుదూర మేగుచు
నన్ను వెంటగొనె వనంబునందు. 6

అంతియే కాదు చచ్చుచు నఱచె వాడు
నఱపు విని లక్ష్మణుండును నామె విడిచి

నన్ను జేరగ వచ్చుచు నున్నవాడె
యొంటరిగ నుంట దైన్యు లా యువిద గొనిరొ. 7

ఆ జనస్థానయుద్ధంబె యటవియందు
వైర మొనగూర్చె రాక్షసవరులతోడ
సీతయును లక్ష్మణుండును సేమ మొక్కొ
యొంటరిగ నుండిరా వారు జంట వీడి. 8

అతిభయంకర మీ ద్విజరుతము మఱియు
నప్రదక్షిణ మొనరించి యఱచు వీని
గన నుపద్రవమునె తెల్పుగాదె! జంతు
తతియు నప్రదక్షిణమున తిరలుచుండె. 9

శంకితాత్ము డగుచు శకునంబులం గని తలచుచుండె సీత దమ్ము నతడు
దారి లక్ష్మణుండు తారసిల్లుచు రాము దీనుడైన యన్న దేరిచూచు. 10

రామలక్ష్మణుల కలయిక

కాంచుచు లక్ష్మణున్ వనిని గాంతను వీడుచు వచ్చియుంట నిం
దించెను నొంటిమై విడిచితే యని వామకరంబు వ త
ప్పించుచు ప్రేమదుఃఖములు పెన్గొన క్షేమమే యి ? సౌమ్యుడా
యెంచు మటంచు రాముడనె నేర్పడజూపుచు చుర్ని ˙ త్తముల్. 11

సీతమ రాక్షసుల్ దినిరొ! జేర్చిరొ బొంగిలి యేడకైన? నే
నాతని మాయలేడి యగు నాసురునిన్ దునుమాడునంతలో
భీతిగ వాడు కేకలిడె బేర్కొని సీతను నిన్ను జట్చుచుం
గోతులదీసె వాడు మనకున్ రిపుమాయ నెఱుంగవైతిగా. 12

లే దిక యాశ్రమస్థలివి లే దిక సీత యటన్ మనంబుసం
దేదయినన్ సరే యనుచు నెట్లు దలంచుచు నూరకుందు, నే
ఖేదము పొందకుండ వనికిం జనుదెంచె ధరాత్మజాత! నా
స్వాదుచరిత్రపూత యెటు చయ్యన వీడితివోయి లక్ష్మణా! 13

అనుచున్ దుఃఖాక్రాంతుడు
తన రామవిభుండు వలుక దమ్ముడుగూడం
గనులన్ నీరము నింపుచు
వినయంబున నాత్మగతిని విశదముసేసెన్. 14

### సీత నిష్ఠురోక్తుల సౌమిత్రి రామునకు దెల్పుట

అన్నా! రాఘవ! నేను దోషి నగుదే! యన్నా త్వదీయాజ్ఞపై
యున్నా నాశ్రమందు విల్లుగొని నుర్వీజ రక్షింప; నా
పన్నుం డా రఘురాముఁనార్తి వినవో పాలింపవో పిల్చు. బొ
మ్మనం గావగ నంచు నన్దరిమె రామా! సీత కష్టోక్తులన్. 15

అన్న చచ్చునంత నతివను జేబట్ట,
వదినమాట వినవో కతలవేమి
మాయబుద్ధి జేసి మాతోడ వని కీవు
వచ్చినావె కైక మెచ్చురీతి. 16

కా దని యంచువా! వెడలు కా దనకుందగ రామమూర్తికిన్
మోదము గూర్చు తోడుగ బ్రపూతమనంబున గానిపట్ల సం
వాదము వీడు గౌతమిని బ్రాణము లిప్పుడ వీడుదాన వీ
మాదిరి దుష్టబుద్ధి విడుమా! చనవోయి! పతివ్రతన్ సుమా! 17

అనుచు నిందించె నేమేమొ యనుచు సీత
హృద్విదారణమగురీతి నేడ్వ దొడగి
రామునకు మూడు లోకాల రాదు కీడు
కీడు సల్పగలాడును లేడు నిజము. 18

పుట్టలే దింతవఱ కింక బుట్టబోడు
రక్కసులమాయ యా కేక రాముగొంతు
కాదనుచు జెప్పియుంటిని గాని సీత
వినక పట్టినపట్టును వీడలేదు. 19

దేవతల గాయురాముడు దివ్యబలుడు
పిలుచునా 'త్రాహి' యని స్త్రీని బిలువ డెపుడు
పొందునా యాపదను విను పొందియున్న
బిలువగా బోడు నిన్నన వినమి సీత. 20

ఆయమ వీడి రాఘవుని యానను మీఱి మదిం దపించుచుం
గాయముతోడ నెట్లొ నిను గాంచితి కారుణికాగ్రగణ్య! నే
నాయమ దూరు వించు నెటు లచ్చట నుండదు, నున్న గౌతమీ
తోయములందు బ్రాణముల ద్రోయగ జానకి యుద్యమించెగా. 21

అచ్చటనే యున్న సీయాన నాత్మ నెంచి
యామె ప్రాణాల దీయుట యగును గాదె
దైవవిధి నెంచి భారంబు దైవమందె
యుంచి సీదరి జేరగా నెంచినాడ. 22

అను సోదరువిమాట విని రాఘవుండు
తను వెల్ల వణకంగ దమ్మున కనును. 23

ఆడది పల్కు నంతటనె యాయమ వీడుదె వన్యభూమి, నీ
వాడ నటంచు నన్నెఱుగవా? యిక జేసెడిదేమి? సీతనే
జూడ మదాశ్రమస్థలివి, సోకులమూకలు చంపినారొ! యే
జాడయు గానరానియటు, జానకి నుంచిరొ రాక్షసాధముల్. 24

అనఘా! యెంత విపత్తు దెచ్చితి వహా; యా జానకీవాక్కులన్
విని నీవున్ గుపితుండవౌదె? యువిదల్ వేనోరు జారుం గదా!
కన, స్త్రీ వక్రమశీలగాదె పతి గాంక్షించుచున్ భీతిపై
ననువాక్యంబుల జాటిసేయదగునా? యౌరా సుమిత్రాత్మజా! 25

విన్నవిన నేమి జానకి నన్ననేమి
యదియ ప్రాప్తవ్య మేమొ ముందేమి కలదొ!
దుఃఖమే పుట్టె నారూపుకోడ భువిని
వనమునం దొంటి స్త్రీ వీడి చనగనౌనె. 26

అనుచున్ విలపించుచు వడి
ననుజుని గవగూడి వెడలు నాశ్రమమునకున్
జనకజ గన నాతురత
జనుచుం గనె దుర్నిమిత్తచయమున్ దారిన్. 27

శూన్యమై యుండె నాశ్రమవన్యభూమి
పక్షి మృగ వృక్షతతికాంతి బాసియుండె
దర్భకృష్ణాజినంబు లందంద ద్రోయ
బడిన వాశ్రమంబంతయు బాడువడియె. 28

పాడుపడినదాని బరికించు బరికించి గనగ సీత నెచట గాంచదయ్యె
గానలేక భార్య గడు దుఃఖమొందెను జానకీ యటంచు జనవిభుండు. 29

పూలను గోయఁబోయినదొ! పోయినదో ఫలముల్ గొన నడవిన్
క్రీడ విహారమై చనెనొ! లేఁజిగురాకుల పొంత కేగెనో!
హేల నదీజలంబులకె యేగెనొ! నాకయి వేచివేచి యాం
దోళన పొంది నన్వెతకునో, యడవిం బడి యంచు నెంచుచున్. 30

పంచభూతాత్మకంబైన ప్రకృతి నున్న
యా చరాచరంబుల నెల్ల నడిగె సీత
గూర్చి యున్మత్తుడో యన గుందుచుండి
వినుచు స్థావరములును ద్రవించునట్లు. 31

బాల విడచితి రాక్షసభక్షణమ్ము
కొఱకె యంచని దుఃఖించు గొమ్మ నెంచి
మాయహరిణమ్ము నన్నెంత మాయ జేసె
సీత హరియింపబడెనొ భక్షింపబడెనొ. 32

అనుచు శోకార్తితో నాశ్రమ మెల్ల
ననుజునితో రోసె నవనిజ గనగ. 33

నదులు వనములు కొండలు నదములన్ని
వెదకి వెదకి వేసారియు వీరరాము
డంత నిలువండు మఱల ప్రయత్న మూని
పరమయత్నానగూడ విహ్వలత గాంచె. 34

అః విజను గాంచనొకొ! బ్రతుకాశ లేదు
చచ్చి స్వర్గాన దశరథచక్రవర్తి
గవిస వనవాసదీక్షనే గంగ గలిపి
వచ్చినా విట కన, మాఱుపల్కు టెట్లు? 35

సీత గన కే నయోధ్యకు జేరుటెటుగ ఏది సీత యనెడువారి కేమి చెపుదు
రాఘవుడ, గోలుపోతిని రమణినంచు బలుకగానేల పందనై బ్రతుకనేల?

ఏది నా సీత యని మిథిలేశ్వరు డన
మాఱుపల్కుదు నెటులొక్కమాట యేని
జానకీదేవి యేదన సకలమునులు
శిరము వంచుచు నేమని చెప్పువాడ. 37

వీడితి భాగ్యభోగ్యముల వీడితి రాజ్యము తల్లిదండ్రులన్
వీడితి జానకిం బ్రియను వీడెద బ్రాణముగూడ లక్ష్మణా!
వీడుచు నీవుగూడ నను, వీటికి దల్లుల సేవ కేగుమీ
మూడవె యిట్టి కష్టము లపూర్వకృతాఘఫలప్రదంబులై. 38

ఏ నిటు దుఃఖజీవి నయి యెట్లు మనందగు మేను వీడినన్
జానకిలేని స్వర్గము స్మశానముగా గనుపించుగాదె యీ
కాన నశింతు నేను జనగాదగు దీవ యయోధ్య కింక, నా
యానగ, భూమి నేలు మనుమా భరతానుజు గౌగిలించుచున్. 39

అమ్మలకు దెల్పి నాదు దాసోహ మీవు
చెప్పు కౌసల్య కంత నాసీత నేను
వని నశించినగతి విధివశుల మగుచు
జేయగలదేమి జానకి చేయి జారె. 40

జానకి చెంతలేక తృటి సాగదు దుఃఖదవాగ్నికీల లీ
మేను దహించుచుండగ నమేయబలాన్విత వీరరాము డీ
కానను రాక్షసాధముల కై వనమౌగతి భార్య వీడె నం
చేనపకీర్తి నిం బడయనే వినజాలుదునే సజీవినై. 41

నన్ను విడనాడి యెచ్చోట దెన్ను గనక
యెంత దుఃఖించుచుండెనో యిందువదన
భర్త రాక కెదురుచూచు పరమసాధ్వి
యా పతివ్రత యెటుల శోకాబ్ధి బడెనొ! 42

అనుచు దుఃఖాశ్రుపూర్ణుడై యతివ దలచి
తలచి మూర్ఛపా లౌచు బంకిలము జొచ్చు
కరివిధంబున దిగజారె ధరణి కపుడు
దాని గని లక్ష్మణుండు విదాన మూని
రాము నోదార్చబూనె విలక్షణముగ 43

మాయామేయజగత్పితామహుడు రామస్వామి తా నయ్యు ద
న్మాయం జిక్కి సతీవియోగవిరహోన్మత్తుండుగా మారుచున్
వేయుం బ్రశ్న చరాచరప్రతతి నెన్నేసార్లు పై దేహి యే
మాయెం దెల్పు డటంచు మూర్ఛ గను దుఃఖాక్రాంతచిత్తంబున 44

అన్న? యా ప్రస్రవణగిరియందు గలదొ!
యమల గోదావరీ తీరమందు గలదొ!
విపినమం దెల్ల వెదకుచు నిపుడె యామె
నమల దరి జేరగలము శోకార్తి విడుము. 45

పురుషుడు యత్నము వీడుచు
బరగుట తగునొక్కొ రామభద్రా యిటుల
దురపింతురె వీరులు వని
నరుగుచు నలుదెసలు వెదుకనగు నరసింహా! 46

అనుచున్ రాముని గొని వెం
టను బ్రస్రవణగిరిలోన కటవిన వెద కె
జని గోదావరి దరికిం
గనజాలరు సీత నెచట గాకుత్స్థవరుల్. 47

కందగడ్డ యయ్యె జిందుచు రుధిరంబు
రామ చంద్రుముఖము రమణి గనమి
గన్ను లెఱ్ఱబారె గమలాక్షి సీతను
గానలేమి నెచట గానరామి. 48

సర్వలోకగతికి సాక్షియౌ దినరాజ
చెప్ప దదేల నాసీతజాడ
జగతి కాహ్లాదంబు సమకూర్చు శశియైన
జెప్ప దదేల నాసీతజాడ
సకల విశ్వాంతర సంచారు డనిలుండు
చెప్ప దదేల నాసీతజాడ
భూమి నల్గడ జుట్టి పొంగు సముద్రుండు
చెప్ప దదేల నాసీతజాడ

నేరి వనదేవతలు? పల్కరేల వారు?
వృక్షములు మౌనముద్రను వీడ వేల?
నిద్ర జెందినవొక్కొయీ యద్రితతులు
రాఘవుని జూతురే యింత లాఘవమున.

కమలజోడు వీడ గమలనాభుండును
విశ్లిష్టయుండుగాడె! నే ధరిత్రి
గమలపాణి సీత గానకయుండిన
వ్యర్థజీవినౌచు బ్రతుకవలయు. 50

అనుచుం జతికలబడు రా
ముని గనగా మృగచయంబు మోములనెత్తెన్
జనువున నేమో దెల్పెడి
యవి, కను జంతువుల దశరథాత్మజు డెలమిన్. 51

ప్రేముడి సంతతంబు మీకు బెంచెనుగాదె మృగంబులార! మా
భూమిజ! యామె యేది? యెటుబోయె? నెవండు హరించె నామె, మి
మ్మోముట గూడ మీహృదయములే మఱపొందిన వాకృతఘ్నుతన్
క్షేమముగా సజీవియొకొ సీత! యెఱింగిన దెల్ల దెల్పరే. 52

అయ్యనంజ్ఞుండు రాఘవుడపుడు చెంత
జనువుగా దిరుగాడెడి జంతుతతిని
గాంచి యవి తన్ను బరికించు బెంచి యెంచి
సీత యెచ్చట నని, వాని జెప్పగోరె. 53

అంతట రాము డాడు నుడి నా మృగవర్గము వించువించు భూ
కాంతుని జూచి చూచి దివి గాంచును రాజుగారు జానకీ
కాంతను వెంటగొన్న దిశగా బరువెత్తగసాగె, నీ దిశం
గాంతువు రామ సీత చనగాదగు నీదెస కన్నరీతిగా. 54

ఆ మృగ హావభావాదుల నన్ని
సౌమిత్రి గ్రహియించి సంతోషపడుచు. 55

దక్షిణదిశ బట్టె ధాత్రిజ యంచు
దక్షిణాభిముఖాన దరలు జంతువులు. 56

జంతువుల్ సూచించు సరణివి మనసు
గంతు వేయగవచ్చు గగన జానకివి 57

అవి చెప్ప సౌమిత్రి యాతని గూడి
జనుచుండె దక్షిణావనమార్గమందు 58

పోవుచు దారిలో భూమిపై బడిన
పూవుల గవినాఁడు పూరుషోత్తముఁడు, 59

పూవుల జూడుమీ యవియ పుణ్యవతీసతి సీతకొప్పులో
దావికి నే నమర్చినవి దైత్యకరంబున జిక్కి పోవుచున్
లావు గడంగ దాపెనగులాడుట రాలినయట్లు దోచెడిన్
జీవముతోడ నున్నదియొ! చేరినదో దివి! దుఃఖితాత్ముఁడై 60

పూవుల గని సీత కొఱకు
బోవదగిన మార్గ మిదియ పోవుదమని, యా
దీవరు లిరువురు గాంచిరి
త్రోవను జానకి యడుగులతో సరియడుఁగుల్. 61

సీత యడుఁగు గాంచి చెంతనే దైత్యుని
పెద్దయడుగు గనుచు వీరవరులు
సీత దైత్యుచేత జిక్కిన దనుటయే
తథ్య మనుచు హృదిని దలచి యంత. 62

రాక్షసునిచేత బడి సీత రామకాంక్ష
విడిపడగ గొట్టుకొనుతఱి బుడమి బడిన
యడుగు లివి యని తోచెడి నంచు బలుకు
రాము డడుఁగుల గుఱితించి లక్ష్మణునకు. 63

ముక్కలు ముక్కలై భూమిపై బడియున్న
రథ మొండు గాంచిరి రాజసుతులు
చచ్చిన గాడిదశవముల గనినారు
విరిగి పడిన తేరు దరిన వారు
భిన్నమై కూలిన పెనువింటి నొకదాని
గొడగాంచినారలు భూపవరులు
ఛత్రచామరములు ఝుండాయు గనిరట
విరిదియుండిన వాని వీరవరులు
సారధియును వీరు చామరగ్రాహులు
వారిశవము లివియ యవిని సల్పి
రేమొ దైత్యు లిరువు రిట సీత గొననెంచి
యనుచు నన్నదమ్ము లాడుచుండి. 64

పరిసరాల గవిరి బంగారుశకలాల
బూలమాల తెగిన పూలగముల
జానకిమెయినుండి జారిన వియ్యని
యనుచు నిశ్చయించి రపుడు వారు. 65

ఇంతట జుట్టుప్రక్కల మహీస్థలి రక్తము చిమ్మియుంట భూ
కాంతుడు గాంచి రక్కసులు కండల గోసి భుజించినారొ నా
కాంతను గాక దొంగిలిరిగా యెటులైనను, ధర్మ మాపెనన్
సుంతయు గాయదాయెననుచున్ రఘువర్యుడు దుఃఖితాత్ముడై 66

కనుమిది సర్వలోకముల కర్తను శూరునిగూడ నెప్డు వం
చన మొనరింపవే యతవిశక్తి గ్రహింపమి భూతవర్గముల్
వినయు, దయాపరాత్ము, నతివిశ్రుతవీరుని, సద్గుణంబు లా
తనియెడ దుర్గుణంబులయి తప్పక కూర్పవె కష్టసంతతుల్. 67

బరుల కపకృతి సల్పకయుండు నన్ను
లోకహిత మెంచి మృదువగు పోకడల జి
తేంద్రియుండనై కరుణతో నెపుడు నుండు
నన్ను నిర్వీర్యునిగ సుర లెన్నరొక్కొ! 68

సద్గుణంబు నాకు సహవాసియై యుంట దుర్గుణంబుగాగ దోచుచుండె
కాన నాదు తేజ గన సృష్టి సమయింతు నాదు సద్గుణంబు నాకు నేనె. 69

కరుణ త్యజించి భూతతతి గాల్చెడివాడ ప్రభాకరుం డిదే
పరగెడివాడు తేజుడిగి, పాయడె వెన్నెల నెల్ల చంద్రుడున్
విరిగి నభంబు నేలబడు పీడగ జీవము ప్రాణికోటి యె
వ్వరి కిక సౌఖ్యముండును దివంబులు రేలును నేకమయ్యెడిన్. 70

జలనిధు లింకిపోవు, గ్రహసంచలనంబు నశించు వాయువున్
చలనము వీడు నగ్నియును జల్లబడున్ వనశైలవాహినుల్
లలితలతానికుంజసుమరమ్యత యెల్ల నదృశ్యమౌను నా
బలమున గాంకర్మమున వమ్మొనరింతు నిదే త్రిలోకముల్. 71

ప్రళయ మొనగూర్తు నా బహుబాణవితతి
ప్రథిత దివ్యాస్త్రసంచయప్రభల నెల్ల
గొండ నింపెద, లోకాళి కూలి సమయు
సృష్టి; నశియింపజేసెద దృటిని గనుము. 72

యక్ష మానవ గంధర్వ రాక్షసాది
జీవు లెల్లరు నశియింత్రు సృష్టియందు
ధర్మమును దప్పి జీవింప దగదు సృష్టి
రాఘవు డెవండొ చూపింతు లక్ష్మణార్య! 73

సీత జాడ నెవరు చెప్పకుండిరిగద!
యిదె చరాచరంబు లెల్ల సమయు
నంచు వింట బాణ మంతట సంధించె
పరపురంజయుండు ప్రజ్ఞ వెలుగ. 74

లక్ష్మణుడు - రాము నూరడించుట

జరయుం గాల మదృష్టమున్ మరణమున్ సౌమిత్రి యీసృష్టిలో
బరగుంగా ననివార్యమై యటుల కోపంబూనగా నేను నే
రరయన్ దీకొన జాలు నప్రతిహతుండం జుమ్మి ధర్మార్థమై
ధర యెల్లన్ మసిసేయగా దగదె సత్యప్రాప్తినేయెంచుచున్. 75

మున్నుం జూడని యట్టి భీకరమహామూర్తిం ద్రిలోకాంతకున్
గన్నుల్ విప్పుచు జూడలేని ప్రళయాకారున్ ధనుష్పాణి నా
పన్నుం గ్రుద్ధుని గాంచి లక్ష్మణుడు కై వారంబునన్ మ్రొక్కియో
యన్నా నీవె స్వభావమున్ విడిచి క్రోధావేశముం బొందెదో! 76

చంద్రునకు గాంతిమాత్రమే చదల గలుగు
సూర్యునకు వెల్గు గుణ మొండె సుమ్మి కలదు
వాయువు చలింపశక్తినే వఱలు నెపుడు
క్షయమె భూదేవికిం గల సద్గుణంబు. 77

ఒక్కొకరి యందు గుణ మొండె యుండెనిటుగ
నీవొ యీసర్వగుణముల నిలయమ వయి
యుత్తమ యశుండవైన సర్వోత్తముడవు
దివ్యమై సద్గుణములుండు సత్యమీవు. 78

ఒక్కడు ముష్కరాత్ముడెవడో వని జానకి దొంగిలింప నా
యొక్కనిబట్టి చంపుటయె యుక్తముగావి సమస్త సృష్టినిన్
ముక్కలు సేయబూనెదవొ భూరిగుణాఢ్యుడ? యద్ది ధర్మమా?
యొక్కడు తప్పుసేయ సకలోర్వియు దండన కర్హమా ప్రభూ! 79

కను మింట యొక్కరుండె భువి కాంతకు గానని సల్పినట్లు దో
చును నడుగుల్ విభేదము జూపని యొక్కని పాదచిహ్నముల్
తునకలుగా రథంబొకటె తోచెడి సారథియొండె చచ్చెనం
దున నపరాధి ముష్కరుని ద్రుంచుటయేకద రాజధర్మమౌ. 80

ఎవని కెట్టి శిక్ష నెంత విధించుట
యర్హమగునొ యంత నవనిభర్త
దోషులకు విధించు దొడ్డబుద్ధిని గల్గి
మృదువుగాగ సదా వహియించి శాంతి. 81

ఈవహ! యంతమాత్ర ధరణీశుడవా? జగదేకభర్తవై
ప్రోవవె సృష్టినిన్ సకల, భూతశరణ్యుడ నీవు, జానకీ
దేవి వియోగమెంచుచు హృదిన్ విలపించనివార లుందురే
దేవర! నీకె దుష్కృతి మదిం దలపోయుదురే జగంబునన్. 82

నెత్తిపైనున్న రవిని గన్నెత్తిచూచి
యుమియనెంచునె యెవడైన నుర్వియందు
నీకె యపకృతి సేయగా నెగడువాడు
తనకుదా నపకృతిజేసికొనెడి వాడు. 83

పరమగతి వీవయని, రామభద్ర, నిన్నె జీవకోటి, పూజించు, నీ జీవతతిని
నాశనము సేసెదో కరుణను ద్యజించి ! క్రోధివౌదె మృదుత్వము కోలుపోయి.

అవనిన్ దోషిని బట్టజాలమొకొ; రామా ! విల్లుజేరబూని మా
ని వరుల్ నీకు సహాయమై దనర నే నీవెంటరా సర్వమీ
భువి గాలింపమె దేవలోకమునకుం బోవచ్చు నెచ్చోటనేన్
జవమొప్పం దిరుగాడి వానిగనమే సర్వజ్ఞ! రామప్రభూ! 85

అయినన్ సీతను గానకున్నయెడ, నీ వంతన్ ధనుష్పాణివై
లయముంజేయగవచ్చు సర్వమును, నీ రామన్ సురల్ నాడు నీ
చెయి నుంచంగొనిరానిచో గదనముం జేబూనగా నౌను. నీ
ప్రియ లభ్యంబగు సామమార్గమున నన్వేషించినన్ రాఘవా! 86

అనుచు శోకసంతప్తుని యంఘ్రులంటి యన్న యాలించి శాంతించునట్టి రీతి
మహితవాక్యాల బలికి రామానుజుండు ఉపశమింపగజేసె నాయుర్వి పతిని.

అమృతమును దేవతలు పొందునట్టిరీతి
తపసియై నిన్ను బొందెగా దండ్రి యతడు
నిన్నువీడి నీ సద్గుణ నిచయ మెంచి
చేరె దివి కంచు భరతుండు చెప్పెగాదె. 88

ప్రకృతి సహజంబు బాములు ప్రాణితతికి
నీవ యాపద సహియింపనేర కిటుగ
ప్రాకృతునిబోలి దుఃఖింప బాటియగునె
క్షుద్రలక్షణయగు నిది క్షోణినాథ! 89

స్వర్గముననుండి నహుషుండు పడడె భువికి
సుతశతంబెల్ల నొకనాడె స్రుక్కియుంట
మన వసిష్ఠుడు మహితుండు గనడె వ్యథను
జలనమొందదె భూదేవి సహిత మొకట. 90

గ్రహణము గ్రహింపదే శశిరవులగూడ
దేవతతి భూతములు గూడ దేవదేవు
విధిని జపదాటజాలునే వీరరామ!
పూరుషోత్తమ నీవిటు పొక్కదగునె. 91

సత్యసంధులు విజ్ఞులు సరకుగొనరు
కష్టముల నెప్పుడును గాలగతి నెఱింగి
మనగలారలు నీబుద్ధి గనుము నీవె
భూత భవితవ్యములు రామ! పురుషసింహ. 92

అనుభవింతు మదృష్టపూర్వానుభవమె
జన్మజన్మాల కర్మల జనితమైన
సుకృత దుష్కృత ఫలితమె సుమ్ము రామ
నీ హితోపదేశమె యిది నీరజాక్ష! 93

లేరు నిన్నెఱింగినవార లేరు భువిని
దివిని నసమానుడవు నీవు, దివ్యబలుడ
సకలలోక సంహారప్రశస్తశక్తి
శాత్రవుల రూపుమాపు మీజన్మయందె. 94

(19)

సీతను నీకె యపకృతి జేయుదైత్యు
డింకను మఱేమిసేయునో జంక కిలను
నీవె దగువాని గని చంప నీరజాక్ష!
లోకరక్షణమగు జగదేకనాథ! 95

అనుజసంభాషణ మానంద మొసగ
విని సారముంగొని వీరరాఘవుడు. 96

ధర్మంబుపైవంగి తనువెల్ల మోపి
కర్మంబు దలపోసి కర్తవ్యమరసె. 97

అన్ననుగాంచి యంత బలుకాడె సుమిత్రసుతుండు బుద్ధిసం
పన్నులునున్ మహాత్ములగువారు చలింపరు దుష్టకాలమం
దెన్నడు, వాయువేగమున నీల్గి ప్రకంపము నొందునే గిరుల్
సన్నుత పూరుషోత్తమ ! విశాంపతి! సీత లభింపకుండునే. ‘8

కానన మెల్లయున్ వెదుకగాదగు, దుర్గములున్ గుహల్ జన
స్థానమునం గలట్టి ఫణసంధులు క్రూరమృగాకులంబులై
గానగనౌ గిరుల్ గనుము కార్ముకవీర యటన్నతోడనే
పూనుచు వింట దీవ్రశరమున్ సహలక్ష్మణుడై చనెన్‌పవిన్. 99

జటాయువు అగ్నిసంస్కారము

వెదకుచున్న రాము నెదుటగా గనిపించె
పర్వతంబువోలు పక్షిరాజు
రక్తమయుని నతని భ్రాతకు జూపించి
యితడె సీతను దినెనేమొ యనెను. 100

గ్రద్దరూపుదాల్చి కానన మందుండె
రాక్షసుండితండు లక్ష్మణ!యని
చంప నర్హుడంచు క్షణములో విల్లెత్తి
యతని దరికి రాముడరుగు నంత. 101

ఓ రఘురామ! దాశరథి! యోపతితావన! సాధు రక్షణా!
తారకనామ! నా యసువు ధాత్రిజనుం గొనిపోయె రావణుం
డారసి వాని; సీత గొన నాపితి ఢీకొని నీదు రాకకై
పో రొనరించి వాని రథమున్ విలు సరధి నేల గూల్చితిన్. 102

అలసితి కొంత సేపటికి నంత ననుం బిగిబట్టి కోసి ఱె
క్కల బృథివీజ తోడ దశకంఠుడు వే, గగనంబునం జనెన్
చలనము లేక నీ కొఱకు వచ్చియు చావక జానకీ కథన్
దెలుపగ నుంటి గంటి విను నే గొనయూపిరితోడ రాఘవా! 103

అను పక్షిరాజును నాత్మీయు నంత
దన కౌగిటం జేర్చె దశరథ సుతుడు. 104
తన తొడ నాతని తలనుంచి యంత
కనె బెను దుఃఖంబు కరుణాకరుండు; 105

తనకై పోరి గతాయువౌచు సతి సీతాగాథ దెల్పంగ నుం
డిన భక్తుం దనువెల్లయున్ నిమురుచుండెన్ బ్రేమపై యాతనిం
గనుగొంచుం దడివెట్టుచుం గనుల దుఃఖాక్రాంత చిత్తుండునై
వినియున్ జానకి జాడ భక్తపరుడై విశ్వంభరుం డయ్యెనున్. 106

రాజ్యమును వీడి వనికొచ్చి రమణి బాసి
వీడుటాయె జటాయువు విహితు విచట
నెట్టి కష్టము లొదవె నా కిట్టు లనుచు
నార్తిమయుడు రాముడు పక్షి నడిగె నంత. 107

ఓ జటాయువ? యొకమాట నోపికగని
చెప్పగలవ? మోక్ష మగుత! సీత నేల
నపహరించె రావణుడు నే నతని కెపుడు
నెట్టి యపకృతినిం జేసి యెరుగ సుమ్మ 108

అతని రూప మెట్టిదియొ యాతడెటన్ వసియించుచుండునో
యాతని వీర్య మెంతటిదొ! యాతని కర్మ తెలంగు లేవియో!
యాతని గూర్చి నీ యెఱుక నంతయు జూచినదంత జెప్పు మా
తాత! సురారి చేత వనితామణి యే గతి నుండెనో కదా! 109

పెనుగాలి సృష్టించి తన మాయచేత
విను వీధి జీకటి వెలయగా జేసి. 110

ఆకాశ మార్గాన నా సీత గొనుచు
రాకాసి దక్షిణ ప్రాంతాల కరిగె. 111

జీవంబు నిలువక చేరు నేచ్చటకో
దైవంబె నాగతి దైత్యారి యింక! 112

ఉవిద గొంపోవు ముహూర్తము నెంచ
భువిజ త్వరితముగ బొందు నిన్ రామ. 113

గాలాన బడుచేప కరణి రావణుడు
కాలము దీరుచు గతియించు రామ! 114

సీతకై దుఃఖంబు చెందగా వలదు
పూత జానకి నిన్ను బొందును మఱల. 115

అని కొనయూపిరి మనుచున్న పక్షి
జన రాము తొడయందె చనిపోయె దివికి. 116

భక్త భక్తుడు రాముడు పక్షిరాజు
గనుచు గడు దుఃఖ మొందుచు గర్మజేసె
దహన సంస్కార మొనరించి దాని కెలమి
సలిపె జపతర్పణాదుల శాస్త్రవిధిని. 117

తపసులను వారు పొందు భూదాన మొసగు
వారికి లభించెడిని యట్టి పరమపదము
నుత్తమోత్తమ లోకంబు నొందు గాత
నా యనుజ్ఞను ద్విజరాజు నాదు సఖుడు. 118

ఈత డనన్య భక్తుడు మహీసుత సీతకు రక్ష నిచ్చి సం
ప్రీతి జనింప వాకు రిపువీరునితో నని సల్పి జీవమున్
ఖాలరు సేయనట్టి గుణ గణ్యుడు ధర్మవిదుండు వృద్ధుడున్
దాత, హితుండు చచ్చుటయు దమ్మద నా దురదృష్టహేతువౌ. 119

పక్షిరాజు స్వరాజ్య సంపాలనమ్ము
చేసె నీతడు ధర్మసంసిద్ధి నొందె
పక్షిలోకంబునం గూడ బ్రదితులగుచు
బరహితార్థంబె జీవించువారు గలరు. 120

అని రాఘవుండంత ననుజుని గూడి
వనములో దిరుగాడ బయనంబు సేసె 121

ఆ జటాయువు చెప్పిన యసురుగాథ
నమ్మి రామలక్ష్మణులంత నైరృతి దిశ
సాంద్ర కాంతార సీమలో జనిరి చనుచు
జానకీదేవి జాడల గాన నెంత్రు. 122

అయోముఖి లక్ష్మణుని వలచుట

దండకావని నా జనస్థాన మెల్ల
నన్ని దమ్ములు గాలించి తెన్ను గనక
మూడు క్రోసుల దూరము పోయి యచట
గ్రౌంచదవి జొచ్చినారలు కాంత వెదుక. 123

మహిత గుహలను సుమలతా మందిరముల
వెదకి వెదకుచు దిరుగుచు వీరవరులు
క్రౌంచవవి దాటి యట మతంగాశ్రమంబు
పొంత బాతాళసమమగు భూరి గుహను. 224

చొరగ బోవుచు రాక్షసి జూచి రచట
వ్యాఘ్ర సింహాది క్రూర మృగాళి దినుచు
భయద వికృత రూపంబుతో బఱగు దాని
వికట దంత లంబోదరవికృతి దాని. 125

అది గని రాము ముందున గలట్టి సుమిత్ర తనూజు బట్టి రా
యదను రమించగా ననుచు నాదరణమ్మున గౌగిలించి యీ

సుదతి నయోముఖిం గలసి సొంపుగ నింపుగ గొండకోనలన్!
ముద మలరంగ సౌఖ్యమును బొందగదోయి మదీయ నాథుడా 126

విడువ లభించినా వనుచు బ్రేముడి జూపుచు బల్క రాక్షసిన్
దడయక పట్టి ఖడ్గమున దావి చెవుల్ ముకునున్ స్తనంబులన్
వడి దెగగోసె లక్ష్మణుడు పారగ రక్కసి త్రోవబట్టి రా
ముడు తన సోదరుం గలసి పోయెను సీత నిమిత్తమై వనిన్. 127

పాపడు లక్ష్మణుండు తన ప్రక్కనె కాంచుచు దుర్నిమిత్తముల్
ప్రాపగు నేమొ, యేదొ? యశుభంబగు దృశ్యము రామ! పూను మీ
యే పగుతూపు వామ భుజమే యదరెన్ సుమయంచు బల్కగా.
భూప కుమారుడైన రఘుపుంగవు డంతట నప్రమత్తుడై. 128

కబంధుని శాపవిమోచనము

చనుచుండి వారటు వనిలోన జొచ్చి
వినినారు చదలంటు విపరీత రవము. 129

తనముందు నడచెడి తమ్ముడుం దాను
ధ్వని పుట్టు స్థానంబు గన నెంచినారు, 130

దిక్కులు పిక్కటిల్లు ధ్వని దీనికి కారకుడైన రాక్షసుం
డిక్కడ నుండగావలయు, నీతని గానగ నౌనటంచు, నా
ప్రక్కల నంతయున్ వెదకి రాముడు లక్ష్మణు డంతగాంచి నా
రొక్కెడ మొండె మొండు పొదనుండిన దానిని భీకరాకృతిన్ 132

తలయు మెడయు లేని దైత్యుడాతండు
బలమగు బహుదీర్ఘ బాహుండు వాడు
వక్షాన గన్నుండి వీక్షించువాడు
కుక్షిలో నోరుండి భక్షించువాడు. 133

దక్షు డాకర్షింప దన బాహు యుగళి
భక్షించు జీవుల భయదకాయుండు. 134

గ్రద్దల మృగముల గరముల బట్టి
ముద్ద జేయుచు మ్రింగు మొనగాడు వాడు. 135

నిజ యోజనాయత భుజముల బట్టి
గజముల సింహాల గబళించువాడు. 136

పెద్ద బొజ్జగలాడు పెను కోఱవాడు
వద్దిర! గిరివోలె నటనున్నవాడు. 137

ధీరులు నన్నయు దమ్ముడు
జేరుచు నున్నంత వాని జేతుల వాడే
వీరిని బిగి బట్టగ నా
వీరులు వాని వశులై రి వింతగ సంతన్. 138

పరవశుడైన రాఘవుడు పాయడు ధైర్యము కాని లక్ష్మణుం
డరి కరమందు జిక్కుటనె యార్తిని బొందుచు నన్న జూచుచున్.
వరగుణ రామచంద్ర? ననుబాయుచు రక్కసి కప్పగించి, వే
పరుగున బొమ్ము నీవయిన భద్రముగా మన రాజ్యమేలగన్. 139

అన విని రాముడా యనుజుని గనుచు
జనువుగా భయము విసర్జింపు మనియె. 140

ఇంత కబంధుండు నెలుగెత్తియఱచి
వింతగా దొరికిరి విందుగా నేడు. 141

ఎవరయా! మీరిర్వు రెచ్చోటివారు
కవచముల్ ధనువులు ఖడ్గాలు దాల్చి. 142

నా నోట బడినార లీనాడు మీరు
నే నిదే భక్షింతు బోనీయ మిమ్ము. 143

అను దైత్యుమాటల నాలించుచుండి
కనెగ్లెళ మా రఘుకాంతుండు నకట! 144

వీడి స్వరాజ్యసీమ వనవీధులజానకిబాసి యామెనుం
జూడకయుంటగాక యిటు క్షుద్రుడు రాక్షసుచేత జిక్కఁగా
గీడును దాపురించె విధికిం దల యొగ్గక తప్పునొక్కొఁ! నె
వ్వాడగుగాక కాలగతి బాయగజాలగలాడి లక్ష్మణా! 145

వాలుకసేతువుల్ దృటిని, వాహినిచేదెగిపోవు రీతిగా
కాలహతుల్ గదా మహిత కార్ముకవేత్తలు ధర్మమూర్తులున్
గాలముమీఱ నేరికగు గా గల దెల్లయుగాక మానునే
యేల విచారమంచు మది నెట్టులొ రాముడు బట్టి గట్టిగా. 146

తమ్ము భక్షింప నుంకించు దైత్యునిగాంచి
రామలక్ష్మణు లపుడు కర్తవ్యమరసి
నఱకినారలు దైత్యునికరము లంత
నాతడు హతోస్మి ధన్యోస్మియనుచు గూలె. 147

రక్తమయుడయి భువిగూలి రాక్షసుండు
వీరవరులార మీర లెవ్వార లయ్య!
తెలుపుడని కోర సౌమిత్రి తెలిపె నంత
రాఘవునిగూర్చి సర్వంబు రక్కసునకు. 148

సోకులకొంగ! దాశరథి శూరుడు వీడు రాముడీతడి
క్ష్వాకులవంశజాతుడు నిశాచరుడొండు సతిన్హరింప న్ని

కైకననామె నీతడు మహాటవిఁద్రిమ్మరుచున్నవాడు మా
రాకకుగారణం బిదియ రాముని తమ్ముడ నేను దైత్యుడా! 149

అనిపల్కె సౌమిత్రి యడిగె రాక్షసుని
వని గబంధుండుగా మనుచున్నకతము. 150

సౌమిత్రినుడి వాడు చల్లగా వినుచు
శ్రీమంతుడైనట్లు చెంది సంతసము. 151

వచ్చినవాడె రాఘవుడు! వచ్చినవాడహో రామచంద్రుడే!
సచ్చరితా! వినుంగనుట శాపవిమోచన హేతువయ్యెగా
తెచ్చితివే కృపామృతము ద్రెంపగ దుర్భర పాపబంధమున్
వచ్చినమేననుంటి విటఁబ్రాప్తిలదొల్లిటి రూపురాఘవా. 152

స్వాగతమిదె రాఘవులకు స్వాగతమిదె రామచంద్ర! జగతీనాథా!
యాగతులౌటను మీరిటు నాగతి ధన్యంబయయ్యె నళినదళాక్షా! 153

బాహువులగోసి సంచితపాపమెల్ల విఱుగగొట్టవె శాపంబువీగిపోవ
విన్ను బిగబట్టి కాంచుటదెన్నుగంటి విన్నుముట్టుట నాశాపనిగళము దెగె. 154

వినయము వీడితిం జెడితి విశ్రుత సుందరమూర్తి వంతమౌ
యినశశితుల్యదీప్తిగల యింద్రునిఖుండను, దివ్యదేహిగా
మనుచు గురూపినైతివిసుమా! యిటు భీకరరూపమూని స
న్మునులకు భీతిగొల్పుచు బ్రమోదము బొందెడి వాడనైతిగా 155

స్థూల శిరుడను ముని కందమూలములకు గొండొక దినాన రా వని మెండిగాగ
నీ కు రూపమూనుచు వెక్కిరించి నాడ నతని, నాతండు శపియించె నంతనన్ను.

నీవు వెక్కిరించినరూపె విన్నుబొందు
గాకయనె రాక్షసుండవై, కరుణపుట్ట
శాపము క్తికాతనివేడ సదయుడగుచు
నాస నిడె నేడు జరిగినదాని ననఘ! 157

ఎన్నడు రామచంద్రుడు మహీసుతకై వని జొచ్చునో, యతం
డెప్పుడు బాహువుల్ నఱకి యీవనిన్ దహియించువాడొ నా
డెన్నగ నీవుపొందగల వింపగు తొల్లిటి దివ్యరూప సం
పన్నతనంచు రాఘ! మునిపల్కెను నేడటునంభవించెగా. 158

దనువంశజుండ శ్రీయను వాని సుతుడ
ఇనువంశ లక్ష్మణా! వనజభవుండు. 159

ఇడుట దీర్ఘాయువు గడుమెచ్చి తపము
జడియక యింద్రుపై సమరంబు సలుప 160

తనువెల్ల వజ్రాయుధంబునగొట్టె
జనదౌడలు దలయు దనువులోపలకు. 161

తిననోరు లేకుండ మనుటెట్లు దేహి
కన దీర్ఘ కాలంబు కదలలేకుండ. 162

నను జంపివేయుమీ యని యింద్రు గోర
బలిబూని చంపడు బ్రహ్మవరాన. 163

ఆమడ పొడవైన హస్తాల నిచ్చి
సామజంబుల దినుశక్తి నాకిచ్చి. 164

కడుకు కోరల నోరు కడుపునం దుంచె
తఱుగని కష్టాలు విఱుగుగా నింక 165

కరములు తెగిపడె కమలాక్ష! రామ!
మరణంబు నొందెద మహితాత్మరామ! 166

నను జంప రాముడే చనుదెంచు ననుచు
మునితెప్పె నటుగనే కనినాడ విన్ము. 167

చంపగల్గు రామచంద్రు డొ. డె నన్ను వచ్చెనతడె నాదుభాగ్యవశత
చంపి నన్ను దహనసంస్కార మొనరించి శాపమోచనంబు సలుపుమయ్య.

అని దనువంశజుండు పలుకాడిన మాటల నాలకించి యా
తని కను, విన్ దహింతుము యథావిధి శాపవిముక్తి కాగ మా
పని యొకటుండె రావణుడు బిన్మిహరించె మదీయ భార్య సీ
తను వినవెంతు మాకని కథన్ వివరంబుగ నీవు చెప్పినన్. 169

ఎటుగనుండు దివ్యజ్ఞాన మిప్పుడు రామ
శాపదగ్ధుండ గానె యా శాపముక్తి
యగ్ని సంస్కారమున బొంది యపుడు మీకు
దెలుపగలవాడ హితమగు తెఱగురామ! 170

కాలము మీఱకుండ రవికాంతిని బాయకమున్నె రాఘవా
కాలము దీర్చుమయ్య ననుగాల్చుము గోతిన బెట్టి యంత నే
మూలనొ దాగియున్న తొలి పుట్టుక నాటి సురూపసంపదన్
లీలగ బొందువాడ నవలీలగ మీకు హితంబుసేయగన్. 171

చెప్పెద జానకీ గతిని జెప్పగలట్టి గుణాత్ము గూర్చి నీ
కొప్పును వాని స్నేహము మహోద్ధతు డాతడు విక్రముండు నీ
ముప్పును విప్పిచెప్పగల పూజ్యు డతం డెఱుగుం ద్రిలోకముల్
తప్పక వాడు నీకిపుడు తాల్మినొసంగును సాయమెమ్మెయిన్. 172

అనిన గబంధు దేహము వనియందు గలట్టి గిరివి బల్లపులోయన్
గని చితి జేర్చిరి దహనము నొనరించిరి దశరథసుతు లుత్తమపురుషుల్.

మంటయందు బుట్టి మహితసుందరు డొందు దివ్యమాల మెడను దీప్తి జెలగ
హంసయుతవిమాన మధిరోహణము సేసి గగనమందు గ్రాలి దిగెను భువికి.

సలిపెను బ్రదక్షిణంబు సాష్టాంగవినతి
సేసి బద్ధహస్తుండు విశిష్టగతిని
భక్తి గద్గదిక గదురు వాక్కు గూడ
బట్టి రాఘవు గీర్తించి పరమనియతి. 175

కబంధుడు సుగ్రీవుని గుఱించియు శబరిని గుఱించియు చెప్పుట

పలికె శాపవిముక్తుడు పరమహితము
రామ షడ్యుక్తులను బూని రాజు సతము
తనకు సరివారితో మైత్రి దనరుచుండి
కార్యసాఫల్య మొనగూడ గడగుచుండు. 176

ఆపద నున్నవార లెపు డార్తులకుం దమతోడివారికిం
బ్రాపగుచుంట లోకగతి రాఘవ! రాజ్యముబాసి, యార్తి చే
నేపఱి, వానరాధిపుడ హీనబలుం డొక డుండె వానికిం
జూపుము మైత్రి నాతడు వసుంధరపుత్రి నెఱుంగజాలెడిన్. 177

తనకుం బాములయందు సాటియగు నాతండే తగుం బొత్తుకై
పని దీరుంగద యటి మిత్రుడు లభింపన్ నీవు సుగ్రీవు మె

త్రిని బొందందగు ఋష్యమూకగిరియందే యుండె యుండు బంపాతటిం
గను మీ, యాతని గార్యసిద్ధికొఱకై కంజాక్ష రామప్రభూ! 178

అతడు వానరేంద్రుడు మహాబలశాలి పరాక్రముండు వి
ఖ్యాతి గలట్టివాడమితకాంతియుతుండును గార్యదక్షుడున్
సీత లభించు నీ వతని స్నేహముబట్టిన, వానియన్నయే
ఘాతుక మూని రాజ్యరమ గైవసమ్ము గొనినాడు రాఘవా! 179

రాజ్యకారణాన భ్రాతయే తమ్ముని వీటినుండి తరిమి వేసియుంట
బలుల హితుల గూడి పర్వతంబున నుండె నతనిచెలిమి జేయు మనఘ నీవు

అతడు కార్యార్థి యగుటచే నమితబలులు
మీర లతనికి దోడ్పడువార లగుట
నాత డుపకార మొనరించు నాప్తుడయిన
వానరుండని చులకన పూనవలదు. 181

నీవును సోదరుం డతని నెయ్యము సేయగవచ్చు తెడు సు
గ్రీవుడు సీత నంత వెదికించు త్రిలోకములందుగూడ నా
రావణువీడు కొండగుహలన్ మఱి యెచ్చటనున్న గాని దై
త్యావని నెల్లయున్, విను కృతజ్ఞుడు వాడు పరోపకారియున్. 182

అతడు ఋక్షరజ స్సను నామె సుతుడు
భాస్కరున కౌరసుండును బ్రథితబలుడు
సురవిభుని పుత్రు డాతని సోదరుండు
వాలి, తనసోదరునె యిల్లు వదలజేసె. 183

శోకము వహింపనౌనె విశుద్ధచరిత కాలము దురతిక్రమముగా గనవొ రామ!
కాకమానునె యేదైన గాలగతివిన నెటుగగానున్న దటు లౌట యెఱుక నీకె.

సుమ ఫల వృక్ష పక్షి మృగ శోభితమై కనువిందు సేయుచుం
బ్రమదము గూర్చు బశ్చిమపుమార్గమునం బడిపోయి పోవుచున్
విమల నదీనగాగ్ర వనవీధుల, దాటుచు, నేగుచుండ స్వ
చ్ఛసులగు వారిపూరముల జక్కని యొక్క సరస్సు వచ్చెడిన్ 185

పంప యను పేర బరగు నా సొంపు లొలుకు
పుష్కరిణియందు నంచగములును గ్రౌంచ

ములను గురరప్లవంబులు లలిత మధుర
సుస్వనమ్ముల జెలువారుచుండ రామ! 186

వధ యన నెఱుంగనట్టి వా పక్షితతులు
మానవుల గాంచి బెదరవు మాన రెపుడు
లలి మనోహరగానంబు జిలుకరించు
వాని గవినంత శాంతిని బడయగలరు. 187

అచటి పూవుగము లహర్నిశంబుల యందు
వాడిపోవు రాలి పడవు పుడమి
దివ్య గంధయుతిని దేదీప్యమానముల్
హృదయ రంజకంబు లెపుడు రామ! 188

అదియ మతంగమౌని వనియందు వసించిన పుణ్యతీర్థ మ
య్యదియ సమాధిసిద్ధులు మహాత్మ మతంగుని శిష్యకోటి స
మ్మదమున బూర్వమున్న స్థలమున్ విను, వీరల స్వేద బిందువుల్
గద యట దివ్యపుష్ప తతిగా గల విప్పుడు గూడ రాఘవా. 189

ఆ మతంగ మహాముని యతని శిష్య
సంతతియు గతించిరి కాని యింతవఱకు
శబరి యనువారి పనికత్తై సకల విదుషి
బ్రతికియుండిన చిరజీవ రామచంద్ర!  190

ఆమె సన్న్యాసిని తపంబు నందె మనుచు సర్వభూత నమస్కృత శాశ్వతుండ
వైన నిన్ను గాంచగనట బ్రతికి యుండెనిన్నుగని స్వర్గలోకంబు తెన్నుగనగ

అచట జూచెద నాశ్రమమ మల మొండు
కడు భహస్యంబు నగుదాని కర్మవీర!
యది మతంగమహాముని యాశ్రమవని
యందు జొరలేదు మత్తేభమైనగూడ. 192

అది తపఃప్రభావ కలితమైన వనము
దాన దుఃఖంబు విడనాడి దశరథ సుత!
శాంతి గనుచు విహారంబు సల్పు దీవు
[illegible] 193

అచ్చటకు ముందె ఋష్యమూకాద్రి కలదు
బ్రహ్మనిర్మిత పర్వతరాజ మద్ది
మదపుటేనుగు గున్నలు సుసలుచోటు
దాని నెక్కుట సులభసాధ్యంబు కాదు. 194

పాపకర్ముల కెక్కఁగా వలను పడని
పర్వతంబది దుష్టులెవ్వారలైని
దాని నెక్కిన జత్తురు తథ్యమదియ
రాక్షసులు వారి భక్షింత్రు రాత్రులందు. 195

అందొక పెద్ద ఖాతిగుహ యద్భుతమైన దొకండుగాంచనౌ
నందె వసించు నల్వురు సహాయులతో గపిరాజు వాని నా
సుందర పర్వతాగ్రమున జూడగవచ్చు నొకప్పుడాత డా
నందమునన్ జరించునెడ నా నుడి మీకు శుభంకరంబగున్. 196

అని కబంధుండు రామానుమతి గొని
చనె దివ్యమార్గాస్యశాపంబు దొలగ. 197

## శబరి స్వాగతము

ఆ కబంధుని శాపంబు నటుగ మాపి
యాతని హితోపదేశంబు నాత్మదలచి
పదమరగ బోవుచుండిరి పంపజేరి
గనగ సుగ్రీవు మైత్రిని గాననమున. 198

ఆ రాత్రి విదురించి యద్రిపై వారు
జేరిరి పంప పశ్చిమ తటంబునకు. 199

రమణీయ శబరి యాశ్రమ మంత జేరి
కమనీయ మగుదాని గాంచుచు వారు. 200

శబరిసన్నిధి జేర జనుచుండ వారి
శబరియే కని వేగ స్వాగతంబనుచు. 201

ప్రణమిల్లె నెదురేగి భక్తితత్పరత
గణనీయ రామలక్ష్మణులకు శబరి. 202

స్వాగతంబిదె వికాంపతి నీ యీ యాగతంబున లయంబగు గా నా
యాగతంబిక ద్వదాగమ నార్థన్. వేగ నీ విడవె ప్రేమను ముక్తిన్ 203

అర్ఘ్యంబిదే కొమ మఘవినాశన రామ!
పురుషోత్తమా! రఘుపుంగవుండ!
పాద్యంబిదే కొను పతితపావన ధామ?
యాద్యంతరహిత! యో యఖిలపురుష!
యాచమనంబిదే యఖిలాండమయ రామ!
సృష్టి స్థితిలయ విశిష్టమూర్తి!
వనమాల నర్పింతు బరమ సుందరరాను!
నారాయణ! హరి! యనంత! శౌరి!
నడచి నడచి వచ్చితిటకు నన్ను గావ
బాదపముల నొత్తవిమ్ము త్వద్పాదపాంసు
కణము లభ్యంబు కావిమ్ము కరుణ గనుము
రామ! జనరామ! భక్త సంత్రాణ రామ! 204

అనుచు బదముల గడుగుచు నా జలంబు
దలను దాల్చుచు నా నీరు ద్రావి శబరి
పుష్పతతిచేత బదముల బూజ సలిపి
యాత్మ సంతుష్టి జెంది ధన్యననియమచు. 205

అంత దర్భాసనాసీనులైన వారి
కారగింపుగ విచ్చె దివ్యములు ఫలము
లెన్నొ పక్వమై తీయగా నున్న వాని
నెవ్వి యెన్నుచు ఫలరుచు లెన్నొ యెంచి. 206

చిరకాలంబుగ నీ నివేదనకుగా జేకూర్చితిం బండ్లనో
పరమాత్మా! పరిపక్వమై మధురమై భాసిల్లు వీనిన్ దయా
పరతంత్రుడవు నారగింపుగొను నా భాగ్యంబిదే సుమ్మ! నీ
యరచే బెట్టగ నోచితిన్ ఫలము లాహారంబుగా నేటికిన్. 207

పండు వెంబడి మఱియొక పండు నొసగి
భక్తిమై రాఘవుల దృప్తిపఱచు శబరి

కొసరి కొసరుచు బండ్లను గోరికినుచు
రాము డాప్యాయముగ బ్రేమరాశియయ్యె. 208

తనను బూజించి ధన్యాస్మి యనెడు వృద్ధ
శ్రమణి భక్త దపస్విని శబరిగాంచి
రాఘవుడు భక్త భక్తుండు రామమూర్తి
ప్రమద మొప్పగ బ్రశ్నించె బరమ దయను. 209

తప మభివృద్ధి జెందుగద! దాటితో విఘ్నములన్ని క్రోధమే
నెపమునగాని రాదుకద! నిర్మలబుద్ధిని సౌఖ్య మొందెదో
సఫలమె నీ గురూత్తముల సన్నిధి సల్పిన సేవ తిండిలో
నెపుడును నీమముర్ గనుచె నిల్పితివా నియమంబు లన్నియున్.

నిను సేవించి కృతార్థనైతినిగదా! నేడే తపస్సిద్ధియుం
గననౌ రాఘవు పాదపద్మముల దాకం గల్గి పూజించి వా
నిని దత్తీర్థము ద్రావనోచితిని బొందెన్ జన్మ సాఫల్యమున్
జనె నా సంచితకర్మ సర్వమును మీ సందర్శన ప్రాప్తిచే. 211

తరియింపగలదాన నీ కృపను బొందం గల్గుటన్ నేడు, నా
గురు శుశ్రూషయు బండె సత్ఫలము చేకూరెంగథా? నీదయా
భరితంబైన విశేష దృష్టిపడె నాపై ముక్తి ప్రాప్తించదే!
దురితంబెల్ల నశింపదే రఘుపతీ! దుష్ప్రాప్యమే యయ్యెనున్. 212

చిత్రకూటాద్రి కీవు వచ్చిన దినంబె
యూ మతంగుని శిష్యులా యతులు ఋషులు
నేను శుశ్రూష జేసిన మౌనివరులు
దివికి జనువేళ నాకిటు దెల్పినారు. 213

రాముడు లక్ష్మణుం డిటకు రా దమివారల పూజనల్పి నీ
వామహనీయ మూర్తుల దయామయదృష్టి లభింప నక్షయం
బై పను లోకముం గనెదవంచు వచించిరి వారిమాటపై
నోముఫలింప వేచితిని నోచితి విన్నుగనంగ రాఘవా. 214

అప్రమేయాత్మ? నేనొక యాడుదాన
మూఢురాల హీనకులంబు పుటుకదాన

నిన్ను స్తుతియింప నెఱుగ నా తెన్నుగనగ
దేవదేవేశ! కృపజూప్ప మీవ రామ! 215

నీకు సాక్షాత్తు దాసి గావేర రామ!
యట్టి యధికార మిసుమంతయైన గనను
నీదు దాస పరంపర విలుపుదు మది
పాహి మాం రామ రామ తుభ్యం నమోస్తు. 216

అని భక్తి గీర్తించు నాభక్త గనుచు
జనువున బలుకాడు జానకీవిభుడు. 217

కనడు కులంబు జాతి మత కర్మలదైవము ముక్తినీయగా
వినుమిల భక్తకోటికి లభించెడి మోక్షము మోక్షసిద్ధి సా
ధనకు సతంబు సాధుజన దర్శన సంగతి దైవనత్కథల్
వినుటయున్ స్మరించుటయు విశ్రుతమార్గములో తపస్వినీ! 218

సాధుసాంగత్యమే భక్తిసాధన కగు
ప్రథమగతి దీని బొందిన వారు గాంత్రు
భక్తిమార్గాల నన్నిటం బ్రగతి శబరి!
భక్తి సంసక్త హృదయంబె ముక్తిదెచ్చు. 219

వింటి నీ గురువుల విశ్రుత సిద్ధిని
వింటి నీదు చరిత విమల శబరి
కంటి నేడు నిన్ను గననెంతు నాశ్రమ
మా మతంగుని దిది యగుటచేత. 220

అను రాముని గని యామె యానందమొంది
వినయంబుతో జూపె విపులాశ్రమంబు 221

ఇదియ యాగవేదిక కను మిందె మౌను
లస్మదాచార్యులు సలిపి రమిత దీక్ష
యాగముల నెన్నియో పరమాత్మవేత్త
లగుచు ననదృశ కాంతిచే నలరు నిదియు. 222

మునలివారలు నుపవాసముల నలసట గనిన వారలు నగువారు కదలలేక
సప్త జలధుల సంకల్పశక్తి నిటనె పుట్టజేసిరి స్నాతులై పూన దపము.

వార లీ నీట స్నాతులై వల్కలముల
వృక్షముల నారవేయగ నింతదనుక
వారల తపః ప్రభావంబు వలన నెండ
కున్నవి కనుమివే యిటనున్న వాని. 224

కువలయంబుల సుమముల గూర్చి మునులు
పుష్పమాలల గట్టిరి పూజకొఱకు
వాడకున్నవి కను నేటివఱకు గూడ
వారల తపఃప్రభావంబువలన రామ! 225

చూచితి వాశ్రమస్థలి విశుద్ధ తపః ప్రతిభావిశేషము
నోచితి నిన్నుగాంచ గడునోచితి దెల్పగ నీకు నాకథన్
వేచినదాన నిన్ను గని వేగ కళేబరముం దృజించి సం
కోచములేక స్వర్గమునకున్ జన రాఘవ! యాజ్ఞ నీయుమా! 226

అనిపల్కి దాసిగా నంతట నిలిచె
వనజాక్షు మునుముందు భక్తిమై శబరి. 227

అంతట రాఘవుండు కని యాశ్రమణిన్ శబరిన్ మహావ్రతన్
సంతస మెంతయో తెలిపి చక్కగ జేసిన యామె పూజకున్
గాంత యథేచ్ఛగా జనుము కామితలోకము ముక్తి గాంచగా
మంతయులేదు సంశయము చూచుట నన్నిటనో తపస్వినీ! 228

అని రాఘవుండను నంతట శబరి
తనజన్మ తరియించెనవి సంతసించి. 229

కరముల జతజేసి కమలాక్షు మ్రొక్కి
శిరముంచె నాతని చరణంబులందు. 230

ఈవె సమస్త కైవల్య మీ లోకముల్ నేకు మేను
నీవె నిత్యానందమూర్తి వీవె నిత్యుండవున్ సుమ్మి
దేవదేవేశ! రామయ్య! ధ్యేయుండ వీవె సతంబు
జీవాత్మనన్ బ్రోవు మీవ శ్రీశా! కృపంజూడు నన్ను. 231

అని రాఘవుని లక్ష్మణుని చుట్టు తిరిగి
యనుచు నారాయణాయ నమో యటంచు. 232

జటిలయును వృద్ధ చీర కృష్ణాజినాంబ
రంబు దాల్చుచు జీర్ణ దేహంబు శబరి
తన కళేబర మగ్నిహోత్రంబునందు
హోమ మొనరించె రామాజ్ఞ నొందియంత 233

ఆ హుతాశనకీలల నమిత కాంతి
బుట్టె సౌదామని యనంగ బూత శబరి
చనియె బూతాత్మ కేగెడి స్థానమునకు
నిజసమాధి యోగస్థితి నిలచి యపుడె. 234

రాముని ప్రసాద మొంది పరంబదంబు
నందె గర్మానుబంధ దేహమ్ము [illegible]
క్షణమునం దవిద్య నశింప శ్రమణి శబరి
దుర్లభంబగు మోక్ష సంతుష్టినొందె. 235

శబరి నిజకాంతి వెలుగుచు స్వర్గమేగ
జూచి తలపోసి మునుల విశుద్ధతపము
రాఘవుడు బల్కె నాశ్రమ రమ్యవిధము
లక్ష్మణునితోడ నిజహిత భ్రాతతోడ. 236

సప్తవార్నిధి జలముల స్నానమాడి [illegible]! నలుపమె పితృతర్పణమ్ము
నంతమొందె నమంగళ మంత [illegible] సంచెల్లుచు బూనె శాంతి.

కానగు మంగళంబు [illegible] శాంతి నింక నా
మానస మేలనో [illegible]
బూనుచు నున్న దిప్పు డిక [illegible]! కపిరాజు గూడ నీ
కాన సమీపమందె కవ కాంచుము పంపను ఋష్యమూకమున్. 238

అని తమ్మునిం గూడి జనకజావిభుడు
చనికనె బంపను సౌందర్యవతిని. 239

కని మన్మథావేశమున సీత దలచి
మనజాల విడనాడి మహిజనంచనుచు. 240

పొమ్మనె సుగ్రీవు పొంతకు వేగ
తమ్ముని లక్ష్మణు దశరథ సుతుడు 241

ప్రేయసిని బాసి విలపించు ప్రియునివోలె
తనయ నెడబాసి శోకించు తల్లివోలె
తనయు నెడనాసి దుఃఖించు తండ్రివోలె
కూర్మి శిష్యునకై కుందు గురునివోలె. 242

ఛాత్రుని కయి వ్యథ గను నాచార్యువోలె
నాత్మ పరమాత్మ సంబంధ మనెడి రీతి
పరమ దుఃఖాన మునిగె నా ప్రథిత గుణుడు
రాఘవుడు గూడ సంతాప రాశియయ్యె. 243

శబ్దములు పల్కజాలని, శాస్త్రవితతి నిర్వచింపంగ జాలని, సర్వమునులు పూర్తిగా స్వానుభవమైన బొందలేని, వేదవాక్కుల కందని, విశ్వపతియె. సచ్చిదానందమూర్తియే సకల విదుడె శోకతాపాల దపియించు చొప్పుగాగ ప్రాకృతుడన నటించు నారాయణుండు పరమ సౌందర్యరాశి పంపాతటాన ప్రకృతి శాంతి సందేశంబు వడయుచుండె. 245

మంగళము

మంగళమౌ శ్రియఃపతికి మానుషదేహికి రామమూర్తికిన్
మంగళమౌ సుమిత్ర సుకుమారునకున్ రఘురాము భ్రాతకున్
మంగళమౌ రమాసతి కమానుషు నింట వసించు సీతకున్
మంగళమౌత శ్రోతలకు మంగళమౌత పఠించువారికిన్. 216

అన్ని యుగముల ధర్మార్థ మవతరించి దుష్టశిక్షణ మూనెడి దోర్బలునకు
శిష్ట సంరక్షణము సేయు శ్రీధవునకు మంగళంబగుగాత సుమంగళమ్ము 247

ఫలశ్రుతి

మాయలమారి వేషమున మానవురీతి సతీవియోగ దుః
ఖాయత చిత్తవృత్తిని జగంబు గనన్ నటియించు రాఘవ
ధ్యేయుడు తాపదగ్ధుల దరింపగ జేసిన దివ్యవిగ్రహం
డాయువు సౌఖ్యమున్ సిరియు నందగజేయుత భక్తకోటికిన్. 248

## ఆశ్వాసాంత్య పద్యములు

ఓయీ! రాఘవ వ్రాయజేసితి వహో యొప్పార నీ కాండముం
గాయంబెప్పుడు సంచితార్థమున రోగాక్రాంతమై నెమ్మదిం
బాయన్ శాంతినిగూడ నెట్లు రచియింపగల్గినా నొక్కొ-యో
ధ్యేయా! నీ మహనీయ సత్కృపయ గాదే యింతకున్ మూలమౌ. 249

పలువురు శాపదగ్ధులహపాయుచుశాపము తొంటిరూపముల్
గలిగి భజించుచున్ విను సుఖాన పరంపద మేగినారు నీ
లలిత మనోజ్ఞరూప గుణ లాలితుడెవ్వడు సంచితాఘదు
ష్ప్లలిత మహార్ణవంబు దరిబట్టి తరింపకయుండు రాఘవా! 250

కాపురం బుండునే సదా కష్టవితతి
కష్టసుఖములు దేహికి గలుగ వొక్కొ-
సుఖము దుఃఖమ్ము నొకరీతి జూచువాడె
ధన్యతముడును విజయుండు దశరథసుత ! 251

## గద్య

ఇది శ్రీ వసిష్ఠ-శక్తి-పరాశర-త్ర్యార్షేయ పరాశర
గోత్ర పవిత్ర సుభద్రా వేంకట కృష్ణమాచార్య
పుత్రుండును, మహాత్మాగాంధీ చరిత్ర, భారత
దేశార్థిక చరిత్ర. భారతీయ రాజ్యాంగ
చరిత్ర, పాహి మాం శతకేత్యాది
గ్రంథకర్త ఆత్మకూరి గోవిందా
చార్య విరచిత శ్రీ గోవింద
రామాయణ మహాకావ్యం
బున 'రక్షకరాము'డను
అరణ్యకాండము
సర్వముసంపూర్ణము
మంగళం మహత్
శ్రీశ్రీశ్రీ

# గోవింద రామాయణము - సాహితీ సమీక్షలు

## శతావధాని - శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

ఈ గోవింద రామాయణము చదివిన తరువాత వేరు వేరు రామాయణాలు చదువనక్కరలేదు. అలాగే వేరు వేరు వ్యాఖ్యలు పరికించే పనిలేదు.

## శ్రీ బూర్గుల రామకృష్ణ రావు

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు భారత స్వాతంత్ర్య సమర యోధులలో అగ్రశ్రేణికి చెందినవారు. త్యాగమయ జీవితమును గడిపిన మాన ధనులు. అనాసక్తియోగము నవలంబించిన కర్మయోగులు.

## కవిసామ్రాట్ - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆచార్యులవారి శైలి ప్రసన్నమై మధురమై సర్వజన సుబోధకముగా నున్నది.

## కళాప్రపూర్ణ శ్రీ నిడదవోలు వేంకటరావు

"అందరూ ఒక యెత్తు ! అగస్త్యుడొక్కడు ఒక యెత్తు" - అన్నట్లుగా తెలుగు భాషలో నింతవరకు వెలువడిన రామాయణము లొక యెత్తు - గోవింద రామాయణమొక యెత్తు - అని ఘంటాపథముగా చెప్పవచ్చును.

## శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యుల వారు సుప్రసిద్ధ ఆంధ్రనాయకులు. అనన్య ప్రతిభాశాలి. అఖండ త్యాగధనుడు. ప్రాణము కోల్పోవుటకైనను సిద్ధపడి స్వాతంత్ర్య పోరాటములో పెక్కుసార్లు కారాగృహమునకు చని వచ్చినవారు. ఇప్పుడు గోవింద రామాయణము వ్రాసి ఆంధ్ర భాషకు అఖండ సేవ చేసినారు.

## శ్రీ మాడపాటి హనుమంత రావు

పద్యములు సులభశైలిలో రసపరిప్లుతములు.

## శ్రీ కాటూరి వేంకటేశ్వర రావు

సరళ సుందరమైన వాల్మీకి రచనమందలి సౌలభ్యాన్ని పుణికి పుచ్చుకున్నది గోవింద రామాయణం.